ఓం

శ్రియైనమః

# శ్రీ రాఘవాభ్యుదయము




గ్రంథకర్త

**నారాయణం రామానుజాచార్యులు**



ప్రచురణకర్త

**డా॥ నారాయణం లక్ష్మీనరసింహాచార్యులు**

శ్రీనారసింహ హోమియో క్లినిక్

ఉల్లిపాలెం - 522 265 (వయా రేపల్లె, గుంటూరుజిల్లా)

**Sri Raghavabhyudayamu**
**of**
**Narayanam Ramanujacharyulu**

Editor :
**Dr. N.L. Narasimhacharyulu,** H.M.M.S.



First Edition : 2001
Copies : 1000
Price : Rs. 75.00

For Copies : ✆ : 08648-54036
**Dr. N.L. Narasimhacharyulu**
Sri Narasimha Homeo Clinic,
Vullipalem - 522 265.
Via Repalle, Guntur Dt. (A.P.) India



**This book is published with the financial assistance of T.T. Devasthanams, Tirupati under their scheme "Aid to publish Religious books".**

Printed at :
**THE VANI PRESS**
Seshadrisastri Street,
Governorpet,
Vijayawada - 520 002.
Phone : 435393

# విద్వత్కవిశేఖర

# శ్రీనారాయణం రామానుజాచార్యులుగారు



| జననము : | విష్ణు సాయుజ్యము : |
|---|---|
| 23-6-1897. | 26-3-1982. |

శ్లో. శ్రీరాఘవాభ్యుదయ సంజ్ఞక కావ్యకర్తా
యః పండితః సుజనజన్య యశోధనాఢ్యః
శ్రీ సూత్ర దుగ్ధజలధేః కలశోద్భవస్తం
రామానుజార్య మనిశం ప్రణమామి మూర్ధ్నా.

"విద్యాలంకార" శ్రీమాన్ నారాయణం శ్రీరామాచార్యః

విద్వత్కవిశేఖర

శ్రీనారాయణం రామానుజాచార్య స్వామి తమ కావ్యమైన

**శ్రీరాఘవాభ్యుదయము**ను

శ్రీ సప్తగిరీశుడైన శ్రీ వేంకటేశ్వరునకు

సమర్పించెను.



సీ. ఆనందనిలయంబునందువేంచేసి నీ
  వనుపమభోగంబులందుచున్న
నిజభక్తులొనరించు నిత్యకల్యాణోత్స
  వంబులఁజిక్కి నీవలరుచున్న
మ్రొక్కుబడులసొమ్ము లెక్కించువారలం
  బెక్కుమాఱులరసిచొక్కుచున్న
అపరాధకానుకలందుటకెవ్వేళ
  నిద్రింపఁదీరక నిలిచియున్న

తే.గీ. నెట్టులైనను నీపనుల్గట్టిపెట్టి
కడకు దినమున కొకఝాముకాలమైన
వచ్చి నా జిహ్వపై నుండనిచ్చగింప
వేని కడతేరదీకృతి వేంకటేశ!

చ. సదయుఁడవైన నీచరణ సారసయుగ్మము నమ్మి రాఘవా
భ్యుదయము నే రచింప మదినూనితి నీ భువి సాటివారిలో
ముదమలరింపఁజేసి యశమున్గొని దాసునకిచ్చిమెచ్చెదో,
హృదయమునందు నిర్దయవహించి హసించెదొ వేంకటేశ్వరా!

డా॥ చతుర్వేదుల వేంకట శ్రీ శివ సుబ్రహ్మణ్యశర్మ
M.A., B.Ed. P.O.L. Ph.D.,
సాహిత్యవిద్యా ప్రవీణ, అద్వైతవేదాంతాచార్య,
ఓరియంటల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్,
యస్.వి. యూనివర్సిటీ, తిరుపతి - 517 502.

## "సంజీవనీ"

**వాల్మీకి గిరి సంభూతా రామాంభోనిధి సంగతా,**
**శ్రీమద్రామాయణీగంగా పునాతుభువనత్రయం..**

ఒక జాతి సంస్కృతికి దర్పణం ఆ జాతి సాహిత్యం. భిన్నత్వంలో ఏకత్వంగా, వసుధైకకుటుంబంగా భాసించే భారతీయ సంస్కృతికి పలుభారతీయ భాషా సాహిత్యాలు భాష్యం చెప్పాయి. ఆ భాషలలో తెలుగుభాష ఒక విశిష్ట స్థానమును కలిగి ఉన్నది. అపారమైన చరిత్ర సంస్కృతిని కలిగిన తెలుగుజాతి ఆయా కాలాలలో వెలువడిన సాహిత్యాన్నంతా పరిరక్షించుకొంటూ తన సంస్కృతిని సుసంపన్నం చేసుకుంటున్నది. ఈ సంస్కృతి భాండాగారాన్ని ఒక తరంనుంచి మరోతరానికి అందించటాన్కి అంకితభావంతో ఉదారంగా, నిస్స్వార్థంగా కొందరు వ్యక్తులు, కొన్ని సంస్థలు చేస్తున్న కృషి అనుస్యూతంగా సాగుతూ ఉన్నది. అందుకే ఆ పెన్నిధిని మరింతగా పరిపుష్టంచేసి ఆగామితరాలకు అందించగలుగుచున్నది.

భారత సాహిత్యనందనవనంలో తొలి పారిజాతపుష్పం శ్రీమద్రామాయణ మహాకావ్యము. వేల సంవత్సరాలుగడిచినా ఆకావ్య సౌందర్యం చెడలేదు, వాడలేదు. దాని మనోహరపరిమళాలు సర్వజగత్తును నేటికీ ఆనందింపచేస్తూనే ఉన్నాయి. సహృదయులు దాని మకరందమాధుర్యాన్ని ఆస్వాదించి నేటికీ పులకిస్తూనే ఉన్నారు. ఇది పవిత్రగంగానదివలె పాపాలన్నీ తొలగించి సకల శ్రేయస్సులను పెంపొందిస్తూనే ఉన్నది. నేటికీ తరగని జీవశక్తి, అందులో ఉన్నందున ఎందరెన్ని విధాలుగా చెప్పినను శ్రీరామకథ మొహం మొత్తదు, దాని వన్నెలు తరగవు. ఇప్పటి మానవుల స్వరూప స్వభావములను మథించి వెన్నలాగా ఆయా పాత్రలను చిత్రించి ఆనాడే చెప్పాడు వాల్మీకి. అందుకే ఆపాత్రలయందు నేటి వారికి ఎక్కువ మక్కువ. అందుకే నేటికీ ఆకావ్యము సజీవంగా ఉంది. పూర్వకవులు ఇది వరకు చెప్పినదే కదా! అని శ్రీరామ కథను వదిలేస్తే లోకంలో ఇంతటి ఉత్తమగుణసంపన్నుడైననాయకుడు వేరొకడు

లభిస్తాడా? శ్రీరామచంద్రునివంటి నాయకుని కీర్తించకుండగా కవులు ధన్యత్వం ఎలా సంపాదించగలరు? ఆంధ్ర సరస్వతి కూడా ఆ శ్రీరాముని రమణీయ, కమనీయ గాథను బహురీతులలో, బహుస్వరాలలో గానం చేసింది. ఆంధ్రదేశంలో పండితులు, పామరులు అవధిలేని అప్యాయతతో చదువుకొని, పాడుకొని నేటికీ ఆనందిస్తూనే ఉన్నారు. అలాంటి రామాయణాన్ని గూర్చి ఎంతచెప్పినా తరగదు. ఎంత చెప్పినను అది సాగరమున నీటిబొట్టులాంటిదే.

ఆర్షధర్మబద్ధమైన భారతీయసంస్కృతికి తలమానికంగానిలచిన శ్రీమద్రామాయణ కావ్యము మన సమాజములోని కట్టుబాట్లకు సత్సంప్రదాయాలకు, జనజీవనసరళికి, ఆదర్శకుటుంబానికి, ఆధ్యాత్మికసంస్కృతికి మంచివ్యవస్థకు ఒక సుస్థిర రాజ్య పరిపాలనకు, సాంకేతికంగా నిలిచింది. గురుశిష్యుల సత్సంప్రదాయమునకు, తండ్రీ కొడుకుల ధర్మవత్సలతకు, అన్నదమ్ముల అనుబంధానికి ఆలుమగల అనురాగానికి, స్నేహితుల సఖ్యతకు, యజమాని సేవకుల భక్తి విశ్వాసములకు, పాలక పాలితుల సద్భావనకు, సదవగాహనలకు, రామాయణంలోని ప్రతి పాత్ర గర్భితంగా ఏదో ఒకసందేశాన్నిస్తూన్నది. అందుకే రామాయణ కథాంశము అన్నికాలాలలోనూ అన్నియుగాలలోనూ నిత్యనూతనమై నిలిచింది. శ్రీరామకథను ఎన్నివిధాలుగా రచించిననూ తృప్తిలేదనే భావన భారతీయులలో జీర్ణించుకొని పోయింది.

పుట్టుకలేని పరమ పురుషుడు శ్రీరాముడుగా అవతరించినట్లు అపౌరుషేయమైన వేదము వాల్మీకి మహర్షి ద్వారా పౌరుషేయమైంది. వేదమున చెప్పిన అనంతకోటి కల్యాణగుణస్వరూపవిభూతులుగల పురుషోత్తముడు దశరథాత్మజుడుగా అవతరింపగా, ఐహికాముష్మిక, వైయక్తిక కార్యసిద్ధి కామ్యసిద్ధి, చదివేవార్కి సుఖశాంతులను ఇచ్చే వేదము కూడా వాల్మీకిని తండ్రిగా చేసుకొని శ్రీమద్రామాయణ కావ్యంగా భూలోకమున అవతరించెను. మహాతపము ఆచరించిన దశరథుడు శ్రీరామునకు తండ్రియైనాడు. చరితవ్రతుడైన వాల్మీకిమహర్షి శ్రీమద్రామాయణ కావ్యమునకు తండ్రియైనాడు. బ్రహ్మవంటి మహనీయుడు కావ్యరచనకు కావల్సిన శక్తియుక్తులను వాల్మీకికి ధారపోసాడు. అందువల్ల అది మహనీయకావ్యమైంది. నేడు అది వేదము వలె మనకు పరమప్రమాణగ్రంథమైనది. అట్టి ప్రామాణిక గ్రంథపఠనము చేత జీవితంలో విలక్షణమైన సంతృప్తిని, శ్రేయస్సు ప్రేయస్సును మనశ్శాంతిని చేకూర్చకలవు. రామాయణ మహాకావ్యము నేటి సామాజిక ధర్మములైన సత్యము, ధర్మము, ప్రేమ, వీరము అను స్థిరమైనగుణములపై నిర్మింపబడిన ఆదర్శ జీవిత సౌధము.

సాహిత్యములో మిగిలిన ప్రక్రియలకంటే మహాకావ్యమునకుఉన్నస్థానము విశిష్టమైనది. ఆ మహాకావ్యము ఒక జాతిపురోగతిలోఏర్పడ్డ ఒక మహాసంకటాన్ని ఎలా అధిగమించిందీ, దాని అసలు (ఆత్మ) లక్షణం ఎలాంటిది, ఆ సంస్కృతికి వచ్చినవైలక్షణ్యం ఎలాంటిది అనేవిషయాలను ఆనాటికావ్యం వివరిస్తుంది. జాతి చరిత్రలో గొప్పమలుపు వచ్చినప్పుడుల్లా ఆ జాతికి ఒక నూతనేతిహాసం అవసరమౌ తుంది. ఇతిహాసాలన్నిటిలోనూ మానవీయ చైతన్య వికాసం ప్రధానంకావటంవల్ల వాటిలో విశ్వజనీనతాలక్షణం ప్రధానంగా ఉంటుంది. పతనంలోకివెళ్ళే జాతికి ఒకమహాకావ్యం చైతన్యాన్నిచ్చి, ఆదర్శానికి ఆ జాతి నిలిచేలా ఆకావ్యం చేస్తుంది. అందువల్ల అనేకులైన కవులు కొత్త ఇతివృత్తాన్ని స్వీకరించకుండ శ్రీరామ కథను స్వీకరించడంలో వారి లక్ష్యం జాతికి కనీసావసరాలైన సత్యము, ధర్మము, ప్రేమ, ఆదర్శం మొదలగునవి జాతిగుండెల్లోకి సూటిగా వెళ్ళగలిగేటట్లు స్పందించి అవి వారికి స్ఫురింపచేయడమే. భాస, కాళిదాస, భవభూతి, దిజ్నాగ, మురారి మొదలగువారు శ్రీరామకథా భాష్యకారులుగా శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు చెప్పారు. తులసీదాసుని శ్రీరామచరితమానస్, కన్నడంలో రామాయణ దర్శనము, తమిళంలో కంబరామాయణము, మైథిలీ చరణ్ గుప్తాగారి "సాకేత్" మొదలగునవి వైలక్షణ్యం కోసం అవతరించినవే.

కావ్యము కాంతా సమ్మతము. లౌకిక జీవనముచే కలుషితమైన మనస్సు సత్కావ్యపఠనము ద్వారా, సంగీతశ్రవణముద్వారా సాత్త్వికమైన రసానందము ననుభవించి ఉత్తమసంస్కారమును పుట్టించును. మానవత్వమునకు కావల్సిన మంచిసంస్కారము కావ్యపఠనము ద్వారాలభించును. లవకుశులు సంగీత మాధ్యమముననే రామాయణ కావ్యమును గానము చేసిరి. ఆ గానము శ్రీరామచంద్రుని కూడా ఆనందపరవశుని చేసినది. తెలుగువారు రామాయణమును భక్తికావ్యముగా, కామితార్థ కల్పతరువుగా భావించారు. రామాయణ వాఙ్మయ ప్రభావము ద్వైతాద్వైతవిశిష్టాద్వైత తత్త్వములను ప్రక్కనపెట్టి భక్తిరూపమున అవతరించి, ఆంధ్రదేశమున నలుమూలలా శ్రీరామ భక్తసంఘములు, శ్రీరామ భక్తిసమాజములు, కూటములు, మందిరములు, ఆలయములుగా వెలసినవి. అతి విస్తారమగు శ్రీరామకథా వాఙ్మయము తెలుగువారి ఆర్ద్రహృదయమును కొన్ని కోణములలో పదునుపెట్టి జీవితములోని లోతుపాతులను త్రవ్వి, ఆదర్శదాంపత్యము, ఆదర్శ జీవనమార్గమును చూపినది. నేటి సమాజమునకు ఇది

చాలా అవసరము. ఆదర్శము కేవలము మాటలలోనేకాక నిజజీవితమున నడచుకొనేటట్లు నేర్పినది. అందువల్లనే ఆనాటివారు దానిద్వారా అనేక సత్ఫలితములను సాధించిరి. ఆదర్శ వాఙ్మయాధ్యయనముచే మనలను మనమే సంస్కరించుకొనుట అలవడును. అలా సంస్కరించుకొనుటలో అంతర్ముఖదృష్టి, జీవిత స్వరూపలబ్ధి, పురోగమనము, ఇంద్రియ నిగ్రహము మనకు కల్గి మంచి ప్రతిఫలితములను పొందగలుగుచున్నాము. శ్రీమద్రామాయణము సర్వాలంకార శోభితమైన మహాకావ్యము, అనేక రసములకు నిలయమైన ఆదికావ్యము. ముఖ్యముగా ఇందులో సీతాపహరణము ద్వారా శ్రీరాముని విప్రలంభ శృంగారమును, శూర్పనఖావృత్తాంతము, త్రిజటాస్వప్నవృత్తాంతములు, హాస్యమును, దశరథ దశగ్రీవమరణములు శోకమును, అహల్య యందు కరుణ, లక్ష్మణుని మూర్ఛ, శివధనుర్భంగము వీరమును, రావణవధ రౌద్రము, తాటక మారీచాది దర్శనము భయానకము, కబంధ - విరాధవధ, లంకాదహనాదులు భీభత్సమును, రామ రావణయుద్ధము అద్భుతము, శబరీ వృత్తాంతము శాంతముగా వర్ణించిరి. శ్రీరామకథ జన్మసాఫల్యకారి అనేనమ్మకము వలన గ్రంథ సంఖ్య తెలుగువాఙ్మయమున విస్తృతమగుటకు ఒక కారణము.

శ్రీరామకథ భారతీయ సనాతనకుటుంబమునకు, సమాజమునకు ఆదర్శ ప్రాయమనుటలో అతిశయోక్తి లేదు. శ్రీరాముడు సకల కళ్యాణ గుణాభిరాముడు "రామో విగ్రహవాన్ ధర్మః" అని వాల్మీకి ప్రతిజ్ఞ. మాహాత్మ్య, ధైర్య, కీర్తి, సంపత్, భక్తి జ్ఞాన వైరాగ్యములకు ప్రతీకగా వైదికులు కొలిచెదరు. భారతీయ గృహజీవితము రామాయణమువల్లనే విశదము. అలా సమగ్రముగా చిత్రించే కావ్యము ఇంకొకటి నేటికీ లేదు. కావ్య నిర్మాణము కవియశస్సును, కీర్తిని, వ్యవహారజ్ఞానమును, అమంగళనాశమును ఇచ్చును. దశరథుని పుత్రప్రేమ, శ్రీరాముని మాతా పితరుల యందు గౌరవము, సీతాదేవి పాతివ్రత్యము, భరతాదుల సౌభ్రాతృత్వము, లక్ష్మణుని సేవా దీక్ష, హనుమంతుని భక్తిప్రపత్తి, సుగ్రీవుని మిత్రకార్యసిద్ధి, విభీషణుని, గుహని శరణాగతి, విశ్వామిత్రుని అనేక శస్త్రాస్త్రప్రదానము ప్రజాధర్మము, రాజ ధర్మము మొదలగునవి నేటికీ, కావలసిన మానవతా ధర్మములు. నేటి తరమునకు కావల్సిన సందేహములకు అనేక సమస్యలకు రామాయణంలో పరిష్కార మార్గాలు ఎన్నో కలవు. వాల్మీకి మరెవరికోసమో రామాయణం వ్రాయలేదు. అనేక సమస్యలకు పరిష్కారరూపమున శ్రీరామకథను మనకోసం వ్రాసాడు.

శ్రీరామచంద్రునికి శ్రీమద్రామాయణ కావ్యమునకు శ్రీరామనామమునకు తెలుగుదేశంలో విదేశములలోని తెలుగువారలలో ఆంధ్రవాఙ్మయమున ఉన్న

ప్రచారము భారతదేశమున భారతీయ భాషలలో మరెచటనూ లేదు. ఆంధ్రదేశమున శ్రీరామ భక్తి పల్లెలోని మారుమూలప్రదేశములకుకూడా విస్తరించినది. తెలుగు కవులలో శ్రీరామభక్తులు చాలామంది కలరు. కృతులలో శ్రీరామస్తుతి చేసినవారు చాలామంది కలరు. తెలుగు వాఙ్మయమున సాహిత్యప్రక్రియలన్నింటిలోనూ శ్రీరామకథ రచనజరిగెను. ఇందులో ప్రధానముగా ఇతిహాస పురాణరూప విపుల కావ్యములు, ప్రబంధములు, లఘుకావ్యములు, ద్విపదకావ్యములు, చిత్ర కావ్యములు, శుద్ధాంధ్రకావ్యములు, అనేకార్థకావ్యములు, ఖండ కావ్యములు, శతకములు, దండకములు, ఉదాహరణ కావ్యము, యక్షగానములు నాటకములు, గేయములు, వచనకావ్యములు, హరి కథలు, జానపదములు, బుర్రకథలు, స్త్రీల పాటలు, కథలు, వ్యాసములు, విమర్శలు మొదలగు వాటితో రామాయణ కథా వస్తువు శాఖోపశాఖలుగా వ్యాపించినది. భగీరథుడు తెచ్చిన గంగానదిలో స్నాన పానాదులుచేసి మానవులు తమ తాప-పాపములు ప్రక్షాళన చేసుకున్నట్లు వాల్మీకి రచించిన రామకథను తమ భక్తి - శక్తి యుక్తులకు తగినట్లు కావ్య నాటకాదులను రచించి చరితార్థులైరి. వ్యాస- అగస్త్య - నారద, వశిష్టాది మహర్షులు ఆ కథకు గొప్పతనమును తెచ్చిపెట్టారు.

శ్రీరాముడు మన భారతీయ ఆర్ష ధర్మానికి సాకారం. శౌర్యం, సహనం, సత్యం, వాగ్వైభవం, జ్ఞానం, స్థితప్రజ్ఞత, స్వధర్మనిర్వహణలాంటి ఎన్నో సద్గుణాలను రాశిపోసిన జగదేక సార్వభౌముడు. మానవ ధర్మాలకు పరమాదర్శంగా భాసించే ధీరోదాత్తుడు శ్రీరాముడు. ఆయన నామమే తారకము. ఆయన రూపం జగదేక మోహనం, ఆయన గుణం సర్వజీవాదర్శం, దివ్యనామ, దివ్యరూప, దివ్యగుణాలతో భాసించే జగన్మంగళతత్త్వం శ్రీరామతత్త్వం. శ్రీరాముని ఎవరు చూడరో, ఎవరిని శ్రీరాముడు చూడడో అతడు అందరిచేత అన్నివిధములుగా నిందుతుడై ఉండాలి. అటువంటి అతడి ఆత్మే అతడ్ని అసహ్యించుకుంటుంది. కనుక భగవంతుని చూడనివారు, భగవంతుని చేత చూడబడనివారు వ్యర్థులు. (తను వ్యర్థముగా జీవిస్తున్నట్లు భావము) భగవంతుడు ఆత్మ స్వరూపుడు. ఆ ఆత్మే శ్రీరాముడు. జన్మించినందుకు రామదర్శనమే సార్థక్యం. ఆ దర్శనమునకు ప్రతిక్షణం ఆర్ద్రతతో ఎదురుచూడాలి. అందుకే రామకథ మనకు నిత్యపారాయణ గ్రంథం. శ్రీరాముడు మనకు ఆరాధ్యదైవం. శ్రీరామనామం మనకు దివ్యమంత్రము. శ్రీసీతారాములు మనకు ఆరాధ్యదైవాలు. శ్రీరామనామప్రభావము ఇంతని వర్ణింపతరముకాదు.

శ్రీరామనామోచ్ఛారణమే తారకము. ఇక రామకథా సాహిత్యరీతి ప్రశంసాత్మకరచన భాగ్యవిశేషమని వేరేచెప్పవలయునా? అంతో ఇంతో శ్రీరామకథను కృతిగా వ్రాయని వాడు కవికాడట. వాల్మీకితర్వాత అనేక సంప్రదాయములవారు వారికనుకూలముగా రామకథను వ్రాసారు. ఇట్టి రామ కథలు సంస్కృతమున 108 వరకూ కలవని పెద్దలమాట. రామనామస్మరణచేత మహాకవులుగాను మహాభక్తులుగాను అగుచున్నారు.

తెలుగున మొదట మహాభారతము ఆవిర్భవించిననూ తర్వాత రామాయణమునకే బహుళప్రచారము లభించింది. రామాయణాన్ని నాటినుండి నేటి దాకా కవులు, విమర్శకులు ప్రవచిస్తూనే ఉన్నారు. వాటిలో రంగనాథ రామాయణం, ఉత్తర రామాయణం, గోపీనాథరామాయణం, శ్రీమద్రామాయణం (వాసుదాస విరచితము), జనమంచిరామాయణం, శ్రీమద్రామాయణకల్పవృక్షము, జనప్రియ రామాయణం, అధ్యాత్మ రామాయణ నిర్వచనం, శ్రీకృష్ణ రామాయణం, వ్యావహారికాంధ్ర రామాయణం, అంతరార్థరామాయణం, శ్రీతారక నామ రామాయణం, ఆనంద రామాయణం మొదలగునవి కలవు. ఇలా తెలుగున రామనామామృతాన్ని ఎందరో మహాకవులు మనకుపంచిపెట్టారు. నేటికీ ఆ రామనామ సుధామృతాన్ని కొందరు మనకుపంచిపెడుతూనే ఉన్నారు. అలాంటి శ్రీరామనామ సుధామృతకావ్యాలలో శ్రీమాన్ ఉ॥వే॥ నారాయణం రామానుజాచార్యస్వామివారు రచించిన శ్రీరాఘవాభ్యుదయము ఒకటి.

శ్రీమాన్ ఉ॥వే॥ నారాయణంరామానుజాచార్య స్వామివారు సంస్కృతాంధ్రభాషలలో అనర్గళమైన పాండిత్యప్రతిభను కలిగినవారు. సమాజమునకు అత్యవసరముగా ఉపయోగపడే ఆయుర్వేద వైద్యము, జ్యోతిషశాస్త్రము, ఆగమశాస్త్రములయందు కూడా బహుముఖప్రజ్ఞను కలిగినవారు. వీరి రచనలు 15 వరకు ముద్రితమైనవి. వీరి కృతులలో శ్రీ రాఘవాభ్యుదయమే అతి పెద్దది. ఈ కావ్యమును శ్రీ శోభకృన్నామ సంవత్సర జ్యేష్ఠ బహుళ పంచమి బుధవారము నాడు (12-6-1963) ప్రారంభించినట్లు తెలియుచున్నది. ఈ కావ్యము సంస్కృతమున వాల్మీకి మహర్షి రచించిన శ్రీ మద్రామాయణమునకు పద్యానువాదము. సంపూర్తిగా వాల్మీకి మహర్షినే అనుసరించినట్లు తోచుచున్నది. 1950 సం॥ ముందు వచ్చిన రామాయణము లన్నిటినీ చదివి, ఆకవులను వారి కృతులను, వారి పాత్ర చిత్రణను, పోషణ, వర్ణనలను బాగా ఆకళింపు చేసికొని, తనదైనశైలిలోనే ఈ కావ్యరచనను చేసెను.

ప్రతిచిన్న పాత్రలనుండి ప్రధానపాత్రలవరకు వారి వారి స్వరూప స్వభావములను సహజసిద్ధముగా కళ్ళకుకట్టినట్లుగా వర్ణించెను. కథా కథనంలో వేగమున్ననూ ఎచటనూ అనౌచిత్యము, అసందర్భవర్ణనలు లేవు. ఇందు ప్రతి పద్యము అణిముత్యమే. కొన్ని పద్యములు అతి మధురములై మాటిమాటికి చదివించేవిగా ఉన్నవి. వర్ణన అతిలలితముగా ఉన్నది. ప్రాచీన పద్యవాఙ్మయముతో పరిచయమున్న వారికి కొన్ని పద్యములలో కొందరు పూర్వపు కవిశేఖరులు కనిపించెదరు. రామాయణ రచన చేయుటే సామాన్యమైనదికాదు. పద్యరచనచేసి మెప్పించుట మరీకష్టము. వీరి భాష కూడా చాలాసరళమైనది.

శ్రీ రాఘవాభ్యుదయ కావ్యమున బాలకాండ ప్రథమ భాగమున షుమారు 1019 పద్యములు కలవు. ఆటవెలది పద్యములు 121, ఉత్పలమాల పద్యములు 104, కందపద్యములు 332, చంపకమాల పద్యములు 78, తేటగీతి పద్యములు 180, మత్తేభ పద్యములు 21, సీస పద్యములు 53, శార్దూల పద్యములు 13 వచనములు 117 కలవు. ఈ భాగమున మిగిలిన వృత్తములు లేవు.

ప్రబంధమున ఉండవలసిన పదచమత్కృతి, వాక్యచమత్కృతి, రసచమత్కృతి, అలంకార చమత్కృతి, శిల్ప చమత్కృతి, భావ చమత్కృతి మొదలగునవి ఇందులో పుష్కలముగా కలవు. పూర్వకవులప్రభావం వీరిమీద చాలాఉన్నట్లు తెలియుచున్నది. ముఖ్యముగా పోతన, శ్రీనాధుడు, గోపన్న, తిక్కనల కవితా ప్రభావము చాలా ఉన్నట్లుగా తోచుచున్నది. లలితపదవైచిత్ర పోతన నుండి, సుందర సీసపద్యవర్ణన శ్రీనాధుని నుండి ఆర్తితోకూడిన శరణాగతి గోవన్న నుండి స్వీకరించినట్లు తెలియుచున్నది. "లలిత సమాస శబ్ద పద లక్షణ భావరస ప్రభేద సంకలితము" (156 పద్యము) అనే పద్యము భాగవతములోని "లలిత స్కంధము గృష్ణమూలము శుకాలాపాభిరామంబు" (1-20) అనే పద్యముతోను "శారద నీరదేందు ఘనసార పటీరమరాళ మల్లికా" అనే భాగవత పద్యమును "శారద నీరదాభయగు శారద మద్రసనాగ్రమందు" అనే 3వ పద్యములోనూ "కమ్మనికైతఁ దా రకరకమ్ముల నల్లి విరించి" అనే 20వ పద్యంలో పోతనను స్మరించెను.

**ఆంధ్రీకరణ విధానము :** శ్రీరాఘవాభ్యుదయములో వాల్మీకి రామాయణమున వలె భగవత్తత్త్వరహస్యమును భగవద్భక్తిని భగవద్గుణ విశిష్టతను విపులముగా వర్ణించిరి. శ్రీనారాయణం రామానుజాచార్యస్వామి శ్రీరాఘవాభ్యుదయ రచనకు వాల్మీకి రామాయణ వ్యాఖ్యలను, తెలుగున వచ్చిన సమకాలీన ప్రబంధములను

మూలమును ఎన్నోసార్లు నిత్యపారాయణను చేసినందున పాత్రచిత్రణను వర్ణనను, వివిధ పాత్రలను బాగా ఆకళింపుచేసుకొని ఇప్పటి సమాజమునకు అనుకూలము అవసరమగునట్లు చెప్పెను. శ్రీరాముని దివ్యమంగళస్వరూపమును వర్ణించు ఘట్టములను నవవిధభక్తిని ప్రవచించు సందర్భములలో శ్రీనారాయణం రామానుజాచార్యస్వామి నిరతిశయ భక్త్యావేశమున విశేషముగా స్పందించి గద్యపద్య రూపములలో వర్ణించిరి. శ్రీనారాయణంవారి కవితాలక్షణములలో ప్రధానముగా కనిపించే గుణములలో 1. సులలిత సరళధారాశుద్ధి, 2. ప్రసన్నగంభీరత, 3. సుకుమార మాధుర్యపద సంపద, 4. రసోద్దీపకత, 5. అన్వయసౌలభ్యము, 6. శయ్యాసౌభాగ్యము, 7. శబ్దాలంకారవైచిత్రి, 8. నిసర్గమనోహరత, 9. భక్తి భావనాబంధురత అనే తొమ్మిది లక్షణములు నవవిధ భక్తిమార్గములకు నవ రీతులుగా శ్రీరామానుజస్వామి వారు ప్రతిపాదించిరి. వీరి కావ్యకన్య సహజ సౌందర్య సౌకుమార్య సముపేతురాలు. ఈ కావ్యకన్యవిచిత్రాలంకారములతోవిరాజిల్లేసర్వాంగసుందరి. సమవిభక్తావయవములు కాంత శరీరసౌందర్యమునకు ఎట్లు ఒక హేతువులగునో అట్లే శ్రీనారాయణం రామానుజాచార్యస్వామి వారి పద్యముల యందలి పద సమాసాదులు తులలో తూచితీర్చినట్లు రసభావానురూపములై, సువిభక్తములై, రమనీయకములైఉన్నవి. సంగీతమునకు నాదశక్తి ఎట్లు జీవన హేతువో సాహిత్యమునకూడా నాదశక్తి చాలా అవసరము. యతి ప్రాస నియమము అనుప్రాసలు మొదలగునవి లయనుసూచించి నాదమును జీవింపచేయుము. ఒక్కొక్క వృత్తమునకు గమకము ఉండును. అలా చదవితేనే తెలుగు నుడికారము - సొగసు తెలియును. శ్రీనారాయణం రామానుజాచార్యస్వామి తమ పద్యరచనలో అనుప్రాసపదబంధములతో నాద తాళమును స్ఫురింపజేసిరి. సంగీతము భక్తియోగమునకు ప్రధానాంగము. ప్రబంధములతో పాటు నామ సంకీర్తన ఉద్యమములో కీర్తనలు కూడా ప్రధాన భూమికను వహించినవి. కంద పద్యములను భక్తిరసమాకందములుగా, భక్తిలలితా కందములుగా పూర్వీకులు చెప్పిరి. అందువల్ల ఈ భాగమున 1019 పద్యములలో 332 కంద పద్యములు కలవు.

పూర్వకవిస్తుతిలో మొదట 21వ పద్యమున బమ్మెర పోతనామాత్యుని, 22వ పద్యములో కవిత్రయమును 23వ పద్యమున రంగనాథుని స్తుతించిరి. (రంగనాథ రామాయణము - శ్రీ గోన బుద్ధారెడ్డి రచించినది కాదు. అనే విమర్శక వర్గమున ఈయన చేరెను.) 24వ పద్యమున శ్రీవాసుదాసస్వామిని, 27వ పద్యమున

శ్రీరామయణకర్తలను అందరిని స్మరించెను. 40వ పద్యమున శ్రీ లక్ష్మణయు తీంద్రులను 14వ పద్యమున వాల్మీకి మహర్షిని, 18వ పద్యమున కాళిదాస, భవభూతి, భాస, దండి, వాధూల రాఘవసూరిని స్మరించెను.

శ్రీరాఘువాభ్యుదయకావ్యనిర్మాణము కేవలము దైవికమని 45, 47వ పద్యములలో చెప్పెను. తన కావ్యమును శ్రీనివాసునకు అంకితమిచ్చితినని 46వ పద్యములో చెప్పెను.

శ్రీరాఘువాభ్యుదయ కావ్య సంపూర్తి బాధ్యతను సప్తగిరీశుడైన శ్రీ వేంకటేశ్వరునిపై ఉంచిరి.

శ్రీ రామావతార తత్త్వమును తెలుపమని శ్రీ వేంకటనాథుని అడుగుట దేవుని యందు తనకు ఉండే స్వాతంత్ర్యమును తెలుపుచున్నది. అనంతకోటి బ్రహ్మాండ నాయకుడైన శ్రీనివాసుడు తిరుమలలో నిలుచునే భక్తకోటిఆర్తినివింటూ తోచినంతగా వారి అర్తినిపోగొట్టుచున్నాడు. అటువంటి అయన తనవద్దకు ఏదో ఒక ఝామున రోజూ వచ్చి తన నాలుకపైఉండి ఈ కృతిని పూర్తిచేయమని ప్రార్థించుట చాలా ఆశ్చర్యముగా ఉన్నది.

తన కావ్యమును ఆదరించమని, తను ఈ కావ్యమును పాండిత్యము చూపుటకు వ్రాయలేదని, శ్రీరాముని దివ్యగుణములను తెల్పుచూ ఒక చిన్న శ్రీరామ కథను మాత్రమే వ్రాసినట్లు సహృదయులైన పండితులకు శ్రీరామచంద్రుని భక్తులకు సవినయముగా విన్నవించుకొనుచున్నాడు.

"వామే భూమిసుతా పురస్తు హనుమాన్ పశ్చాత్సుమిత్రాసుతః" అనే సంస్కృత శ్లోకమును తెలుగున సీసమున ఎంతో అందముగా చిత్రించెను. "వామాంక తలము న్వైదేహిౕక్కారు" (63) శ్రీవేంకటేశ్వరస్వామి వారి విరాట్స్వరూపమును "మహిత చరాచరాత్మకమగు బ్రహ్మాండ" అనే సీసములో (61) వర్ణించిరి.

శ్రీరాఘువాభ్యుదయమున ఈ భాగమున ఉండే 1019 పద్యములలో స్థాలీపులాక న్యాయముగా కొన్ని ముఖ్యములైన పద్యముల భావ సౌందర్యమును పరిశీలించుట ద్వారా శ్రీ నారాయణం రామానుజాచార్య స్వామివారి పాండిత్యమును కొద్దిగా తెలుసుకొనవచ్చును. కావ్యారంభవృత్తము చంపకమాల. "అనుపమదివ్య మంగళ గుణాస్పదమై భవ పద్మ సంభవా" "శ్రీ ఫణిపతిశైలనాథుపదపద్మ యుగంబుఁ దలంతు నెమ్మెదిన్" అని మొదటి పద్యమున శ్రీ వేంకటేశ్వరుని స్తుతించెను. రెండవ పద్యమున శ్రీనివాసుని పట్టపురాణిని స్తుతించెను. మూడవ పద్యమున శ్రీభారతీదేవిని

స్తుతించెను. నాలుగవ పద్యమున శ్రీవిఖనసమహర్షిని, భృగు, కశ్యప, అత్రి, మరీచి అను శ్రీవిఖనసుని నలుగురిశిష్యులను స్తుతించెను. ఐదవ సీస పద్యమున విఖనస మహర్షిని ప్రత్యేకముగా స్తుతించెను. 8వ పద్యములో ఆదిశేషుని, 9వ పద్యమున వైనతేయుని స్తుతించెను. 10 నుండి 13వ పద్యములలో "మహాప్రమోదము స్ఫురపిన మారుతాత్మజుని పాదపయోజములాశ్రయించెదన్", "ఆంజనేయుననారతంబభిను తింతు". "మహాభోగిదశాస్యపట్టణము బుగ్గి యొనర్చిన రామదాస!" "అనిశము రామచంద్రచరితామృతధారలు గ్రోలుచుండియు", "వాయులూరునందనుని భజింతునాత్మవిశదత్వ కవిత్వపటుత్వసిద్ధికై." అనుపద్యములలో శ్రీ ఆంజనేయుని స్తుతించెను. 14, 15 పద్యములలో శ్రీనివాసుని స్తుతించెను. 17వ పద్యమున వేదాంత దేశికులను స్తుతించెను. 19వ పద్యమున తన గురువులను, తన వంశస్థులను, తన జ్ఞాతులను వర్ణించెను. 19వ పద్యమున శ్రీవేంకటేశ్వర భట్టర్‌ను ఆయన పుత్రుని 20వ పద్యములో దివ్యకవిత్వశక్తికలిగిన సుందరరాజసూరిని 28వ పద్యములో శ్రీరామస్వామిని, 25, 26వ పద్యములలో శ్రీరామకథామృతమనే కావ్యమును రచించిన వెంకటప్పయ్య విద్వన్మణిని, వైఖానస ఆగమములను ప్రక్రియా భాగములతో బాగా తెలిసినదిట్ట వేంకటరామాచార్యులుగార్ని 29వ పద్యములో భక్తి పుష్పాంజలులను కోలాచన నరసింహశాస్త్రి గురువర్యులకు, 30వ పద్యములో "గీర్వాణభాషాసుధారసాబ్ధి శీతకిరణుడైన" విజయరామార్యవర్యునకు 31వ పద్యములో కరుణామూర్తియైన తమవంశమునకు మూలపురుషుడైన భరద్వాజ మహామునికి 32వ పద్యములో నిరుపమధిషణా జలనిధియగు సూర్యనారాయణ సుధికి 33వ పద్యములో తమ వంశమునకు మొదటివాడైనవాడు సూర్యనారాయణుడు అందుచే ఈ కావ్యకర్త ఇంటిపేరు నారాయణం ఐనదని చెప్పిరి. 34వ పద్యములో అఖిల విద్యాప్రౌఢుడైన అనంతాచార్యుని తన పితామహుని తాతయని, వేంకటనారాయణా చార్యుని తనకు ప్రపితామహుడని, వెంకటయోగి తాతయని, రామసూరి తండ్రియని, సీతాంబ తన తల్లి అని చెప్పెను. 37వ పద్యమున లక్ష్మీనరసమాంబను స్తుతించెను. 38వ పద్యమున ఆగమవిశారదుడైన తన పిన తండ్రియైన నరసింహదేశికుని స్తుతించెను. 39వ పద్యమున తన బామ్మగారైన వెంకమాంబను స్తుతించెను. 41వ పద్యమున వాస్తు విద్వన్మణి, వైష్ణవాగమశాస్త్రవిదుడు, గణితకోవిదశిరోమణియగు తన పెద్దన్నగారైన శేషార్యునికి 42వ పద్యమున అక్కగారైన వెంకటనరసమ్మగారికి స్తుతులను తెల్పెను. 61 వ పద్యమున ఉరగాచలనాథుని స్తుతినిచేసెను. షష్ఠ్యంత

పద్యములు ఆరు కలవు. 72వ పద్యములో శ్రీనివాసుని స్తుతిని, 64వ పద్యములో శ్రీ సరస్వతీదేవి స్తుతిని, తన పూర్వవంశీకుల స్తుతిని చేసెను. ఈ కావ్యరచనను 12-6-1963న ప్రారంభించిరి. విశ్వామిత్రుడు శ్రీరామచంద్రునికి బలాతిబలవిద్యలను ప్రసాదించే ఘట్టమును (షుమారు 661 పద్యము) 29-4-1966న రచించినట్లు, విశ్వామిత్రుడు శ్రీరామునకు భృశాశ్వతనయులను ప్రసాదించే ఘట్టము (షుమారు 798వ పద్యము)ను 30-4-1966వ తేదీన వ్రాసినట్లు కలదు. తర్వాత తేదీలు లేవు. చిత్తుగా మొదట వ్రాసి తర్వాత శుద్ధప్రతినివ్రాసి ఉండవచ్చును అనే భావన కలదు. బాలకాండ ప్రథమ భాగమువరకు మూలప్రతులు రెండుగాకలవు. అందులో మొదటిప్రతిలో 146 పేజీలు రెండవప్రతిలో 170 పేజీలు కలవు. మొత్తము బాలకాండను నాలుగుప్రతులుగా రచించిరి. షుమారు నాలుగుప్రతుల పేజీలు 716 ఉండవచ్చును.

శ్రీరాఘవాభ్యుదయ కథా ప్రారంభమున వాల్మీకి రామాయణంలో వలె నారదుడు వాల్మీకిమహర్షి ఆశ్రమమునకువచ్చి కావ్యమొకదానిని వ్రాయుమనగా కావ్యమున నాయకునికి ఉండవలసిన ఉత్తమగుణములను చెప్పి, అటువంటి ఉత్తమలక్షణములచేత శోభిల్లే నాయకుడు ఎవరున్నారని వాల్మీకి నారదుని ప్రశ్నించెను. వాల్మీకి నారదుని ప్రశ్నించిన గుణములు 16. చంద్రుడు కూడా 16 కళలు కలిగినవాడే. ఐతే నారదుడుచెప్పే 16 కళల గుణశోభితులు వేరే. ఆ గుణములు గుణవంతుడు, వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యవాక్యుడు, ధృఢవ్రతుడు, చారిత్రవంతుడు, సర్వభూతహితుడు, విద్వాంసుడు, సమర్థుడు, ఏకప్రియదర్శనుడు, ఆత్మవంతుడు, జితక్రోధుడు, ద్యుతిమంతుడు, అనసూయుడు, దేవతలకు కూడా భయమును కొల్పేవాడు. ఇటువంటి ఉత్తమగుణములు దేవతలలోనే అరుదుగా కనిపించేవి. మరి మానవులలో ఎవరుకలరని ప్రశ్నించగా శ్రీరాముని ఉదాహరణగా నారదుడు చెప్పెను. అప్పటినుంచి రాముడు శ్రీరామచంద్రుడైనాడు. శ్రీరామ చంద్రునికి చెప్పిన గుణములు పరబ్రహ్మకు కూడా వ్యంగ్యముగా సమన్వయమగును. 1వ పద్యము నుండి 6వ పద్యమువరకు వాల్మీకి నారదుని ప్రశ్నించును. 9వ పద్యము నుండి 15వ పద్యంవరకు శ్రీరామచంద్రుని సద్గుణములను వర్ణించిరి. 16వ పద్యము నుండి 85వ పద్యము వరకు సంగ్రహముగా శ్రీరామకథను వాల్మీకికి నారదుడు చెప్పెను. ఇచట శ్రీరాఘవాభ్యుదయము సంపూర్తిగా వాల్మీకి రామాయణమునే అనుసరించెను.

| శ్లోక సంఖ్య | వాల్మీకి రామాయణము | పద్య సంఖ్య | శ్రీరాఘవాభ్యుదయము |
|---|---|---|---|
| 1. | తపస్స్వాధ్యాయ నిరతం | 1. | తపమున స్వాధ్యాయమున |
| 2. | కోన్వస్మిన్సాంప్రతంలోకే | 2. | ఎవ్వండు సర్వభూతహితుండు |
| 3. | కశ్చైకప్రియదర్శనః | 3. | ప్రియదర్శనుండెవ్వడు |
| 4. | ఆత్మవాన్ కో జితక్రోధః | 4. | ఎవ్వడాత్మవంతుడెవ్వడు |
| 7. | బహవో దుర్లభాశ్చైవ | 6. | ఇట్టి గుణముల ప్రోదయై |
| 8. | ఇక్ష్వాకువంశప్రభవః | 10. | రాముండన జనవిశ్రుతఁ |
| 9. | బుద్ధిమాన్ నీతిమాన్ | 11. | నియతమానసుండు |
| | | 12. | కంబుకంఠుడు |
| 12. | ధర్మజ్ఞః సత్యసంధశ్చ | 13. | సత్యసంధుడు లోకైక |
| 17. | సచ సర్వగుణోపేతః | 18. | అట్టి సత్యపరాక్రమమున |
| 21. | యౌవరాజ్యేన సంయోక్తుం | 20. | ఆత్మవగమాని శ్రీరామునడవి |
| 22. | పూర్వం దత్తావరాదేవీ | 21. | జాయయిటుపల్క దశరథ |
| 25. | తం వ్రజంతం ప్రియో | 22. | అంత సౌమిత్రి రామునియంఘ్రి |
| 29. | గుహమాసాద్య ధర్మాత్మా | 26. | మ్రొక్కిన గుహునకు దీవన |
| 31. | చిత్రకూటమనుప్రాప్య | 27. | మరియు నానావన నదీవనంబుల |
| 32. | చిత్రకూటేగతే రామే | 30. | అట సాకేతపురంబులో |
| 35. | గత్వాతు సుమహాత్మానం | 33. | తండ్రియాదేశమున |
| 39. | నందిగ్రామే కరోద్రాజ్యం | 34. | నందిగ్రామముఁజేరె |
| 39. | గతే తు భరతే శ్రీమాన్ | 35. | సత్యసంధుడు శ్రీరామచంద్రమూర్తి |
| 41. | విరాధం రాక్షసం హత్వా | 36. | అటహరియించి దానవకులాధముఁ |
| 42. | అగస్త్యవచనాచ్చైవ | 37. | ఘటజన్మునాజ్ఞచేఁగైకొనె |
| 54. | తతస్తేనైవశోకేన | 45. | అపుడు ప్రణమిల్లిరాముని |
| 56. | సచాస్యకథయామాస | 49. | అంత ధర్మప్రచారిణియైనశబరి |
| 58. | పంపాతీరే హనుమతా | 50. | ఇంపులొలుకుచునున్న |
| 65. | పాదాంగుష్ఠేన చిక్షేప | 52. | కాలిబొటనవ్రేలి గగనపథంబున |
| 71. | సచసర్వాన్ సమానీయ | 55. | సర్వదిశలకు రఘురాము సతియ |
| 73. | తత్ర లంకాం సమాసాద్య | 57. | అట రావణ భుజపాలిత |

| | |
|---|---|
| | 58. అంతరావణులంకలో |
| 75. పంచసేనాగ్రగాన్ హత్వా | 61. ఏవురు సేనాపతుల |
| 81. తేన గత్వాపురీం లంకాం | 66. చని రఘురామభద్రుండు |
| 85. అభిషిచ్య చ లంకాయా | 70. ఇనకులేంద్రుడు |
| 86. దేవతాభ్యో వరం ప్రాప్య | 71. దైవతకోటిచే వరముదారత |

ఇలా వాల్మీకములోని సర్గకథల ఆధారముగానే శ్రీరాఘవాభ్యుదయ కథను రసవత్తరముగా నడిపిరి. సంగ్రహరామాయణమైన పిదప శ్రీరాఘవాభ్యుదయమున బాలకాండలో వాల్మీకి మహర్షి భరద్వాజునితో తమసా నదికి స్నానమునకైవెళ్ళెను. ఒక బోయవాడు పక్షిజంటలో ఉన్న ఒకదానిని బాణముతో కూల్చెను. "వాల్మీకి దానిఁగాంచి నిస్తుల క్రోధఘూర్ణితనేత్రుడౌచు" అని కోపగించెను. 87వ పద్యములో ఆ కిరాతునిశపించెను. 89వ పద్యములో తన నోటినుండి లౌకికశ్లోకము వచ్చుట మిక్కిలి ఆశ్చర్యపడెను. వైదిక ఛందస్సుతోనే పరిచయమున్న ఆ మహర్షి అన్యుల శోకము తనశోకముగాభావించి భావుకుడై ఉద్రేకపడి లౌకికఛందస్సులో శ్లోకమును రచించుట మిక్కిలి ఆశ్చర్య - అద్భుతరససమ్మేళనమే గదా! 103వ పద్యమున బ్రహ్మదేవుడు వాల్మీకి ఆశ్రమమునకు వచ్చి వాల్మీకిని ఓదార్చి తన ఆదేశమున శ్రీభారతీదేవి నిన్నుఅనుగ్రహించినది. అద్భుత భావనలతో శ్రీరాముని దివ్యగాథను రచించుమనిచెప్పెను. నారదుని వల్ల శ్రీరాముని దివ్యగాథను పూర్వమే వినెను. 104వ పద్యములో సకల వేదాంతసారము నవరస శోభితమైన శ్రీమద్రామాయణ రచనకు కావలసిన శక్తియుక్తులను వాల్మీకికి బ్రహ్మదేవు డనుగ్రహించెను. 118వ పద్యములో తన తపశ్శక్తి బ్రహ్మదేవుని ఆశీర్వాదబలములు కలసి యోగశక్తితో, శ్రీరామకథ యందు మమతను పెంచుకొని దర్శించెను. 115వ పద్యములో కావ్యపరిధి సందర్శించెను. 115వ పద్యము నుండి 155వ పద్యం వరకు యోగదృష్టిచే వాల్మీకి దర్శించిన శ్రీరామకథను వర్ణించిరి. 158వ పద్యమున కుశలవుల శ్రీరామకథాగానమాధుర్యమును వర్ణించిరి. 159 నుండి 180 వరకు లవకుశుల శ్రీరామకథాగానము మునులను, ఆటవికులను నాగరీకులను ప్రభుత్వాధికారులను, ప్రభువైన శ్రీరామచంద్రునికూడా ఆకర్షించి ఎట్లు తన్మయపరచినదో అతిసుందరముగా వర్ణించిరి. 180వ పద్యములో రాజసింహాసనము మీద కూర్చొని తన కథను వినుచు సోద్రేకమనస్కుడై ప్రజలలో తను ఒకడై తనదివ్యగాథనువినెను. ప్రపంచసాహిత్యమున మరేకావ్యమునకు అందని మహర్దశ శ్రీమద్రామాయణమునకే అందినది. ఏ కావ్యము

నాయకునిగా వర్ణించినదో ఆకావ్యనాయకుడే ఆకావ్యమును విని తనకథ ఇంత కమనీయమైనదా? అని ఆశ్చర్యపరిచే కావ్యము మరియొకటి లేదు కదా! తన పుత్రులే తన గాథను తనముందు గానము చేయుట అద్భుతము. శ్రీరామచంద్రునినే ఆనందపరచిన శ్రీమద్రామాయణ కావ్యము ఇంత గొప్పదని ఎట్లు చెప్పగలము. 185వ పద్యములో తన కావ్యమును చదివి అసూయ చెందవలదని విన్నవించెను. 186వ పద్యము నుండి 195వ పద్యం వరకు అయోధ్యాపురమహిమను వర్ణించిరి. 198వ పద్యంలో అశ్వమేథయాగమును చేసినచో పుణ్యాత్ములలో తననూచేర్చుకొన గలరని దశరథుడు భావించెను. 199వ పద్యము నుండి 201వ పద్యమువరకు తనకు పుత్రులులేరనే బాధను దశరథుడు భావించినట్లు చెప్పెను. 203వ పద్యంనుండి 231వ పద్యం వరకు పుత్రులు లేరనే బాధనుండి దశరథుని వసిష్ఠుడు ఊరడించి అశ్వమేథయాగమును చేయుమని చెప్పెను. యాగస్థల నిర్ణయము, యాగ నిర్వహణకు వివిధ విభాగములను మంత్రులకు ఆదేశించుట, భార్యలకు యాగదీక్షనుగూర్చిచెప్పుటను వర్ణించెను. ఈ వర్ణనలో 208, 213, 220, 224, 228 పద్యములు బాగున్నవి. 233వ పద్యము నుండి 239వ పద్యం వరకు ఋష్యశృంగుని సుదీర్ఘబ్రహ్మచర్యమునుగూర్చి వర్ణించిరి. 236వ పద్యమున అతని వ్యక్తిత్వమును వర్ణించెను. 241 నుండి 271వ పద్యం వరకు శాంతావివాహము, కూతురు అల్లునితో దశరథుడు అయోధ్యకు బయలుదేరుటను వర్ణించెను. 274వ పద్యము నుండి 293వ పద్యము వరకు ఋష్యశృంగునితో దశరథుడు యాగవిషయమును వర్ణించెను. 295 నుండి 297 వరకు పుత్రాకామేష్ఠియాగ వ్యూహవర్ణన కలదు. పుత్రకామేష్ఠి యాగమునకు సకల దేవగణము అదృశ్యరూపమున యాగశాలకు వచ్చిరి. వారితో బ్రహ్మదేవుడు కూడావచ్చెను. రావణాసురుని అకృత్యములను దేవతలు బ్రహ్మదేవునికి విన్నవించిరి. ఇది 298వ పద్యం నుండి 308వ పద్యమువరకు కలదు. 301వ పద్యమున దేవతల కాంతి విహీనతను వర్ణించిరి. 313వ పద్యమునుండి 315వ పద్యమువరకుగల పద్యములలో బ్రహ్మదేవుడు దేవతలను ఊరడించును. 316వ పద్యములో శ్రీహరియందు దేవతలకు ఉండే భక్తి వినమ్రతను తెలియజేసెను. 318 నుండి 334 వరకు గల పద్యములలో బ్రహ్మదేవునితో దేవతలందరూ శ్రీహరి సన్నిధికిచేరి రావణుని దుష్టచేష్టలు తమదైన్యస్థితిని విన్నవించిరి. 322, 323, 326, 329, 331, 334 పద్యములు చాలా బాగున్నవి. 336వ పద్యమునుండి 340వ పద్యమువరకు శ్రీ మహావిష్ణువు బ్రహ్మాదిదేవతలను ఊరడించెను. 337, 338,

341 పద్యములు బాగున్నవి. 342వ పద్యములో దశరథ పత్నులను దేవతలు పొగుడుట, 345వ పద్యములో రావణాసురుని సంహరించెదనని శ్రీహరి దేవతలకు అభయమిచ్చుట, 349వ పద్యమున దేవతలు దశరథుడుఇచ్చిన హవిస్సునుతీసుకొని ఆనందముగా తమ ఇళ్ళకు వెళ్ళిరి. 354, 355వ పద్యములలో అగ్నిహోత్రుని దశరథుడు ప్రార్థించుట. 356 నుండి 360 వరకు పాయసమహిమను అగ్నిహోత్రుడుచెప్పి పాయస కలశమును దశరథునకు ఇచ్చుట. 361వ పద్యములో యాగమును పూర్తిచేసిన మునీంద్రులను సత్కరించి 363వ పద్యమున పాయసమహిమను దశరథుడు తన భార్యలకు చెప్పుట. 369వ పద్యమున దశరథుడు రాజ్య విషయములను మరిచి గర్భవతులగు భార్యలతో గోష్టిని చేయుచుండెను. 374వ పద్యమున శాంత అత్తవారింటికి వెళ్ళతలచెను. పుట్టింటినుండి వెళ్ళుటకు అంతగా ఆమెకు ఇచ్చలేదు. ఐననూ వెళ్ళివస్తానని చెప్పాలి - ఈ భావనలుగల శాంత ఎట్లు నడచివెళ్ళెనో వర్ణించెను. 379వ పద్యములో శాంతను తమదగ్గరే ఉంచుకుందా మనుకున్నా బ్రహ్మర్షి నిర్ణయమును ఎవరు మార్చగలరు అని చెప్పుట. 382వ పద్యమున కొత్తగా కాపురమునకు పంపిన ఆడబడుచును ఏదోనెపముతో పుట్టింటికి తెచ్చుకొనుట ఆంధ్రుల ఆచారము. ఆ ఆచారమును ఇచట వర్ణించిరి. 384వ పద్యము శాకుంతలము 4వ అంకములో శకుంతలను కణ్వమహర్షి అత్తవారింటికి పంపేటప్పుడు అన్నమాటలను "కంఠస్థంబితబాష్పవృత్తి కలుషం చింతా జడం దర్శనం" అనే శ్లోకమును "అంత స్తంబిత బాష్పనేత్రుఁడగుచున్ హర్మ్యాంత రాళంబున" అనుట చాలా బాగున్నది. 389వ పద్యమున బ్రహ్మదేవుడు దేవతలతో శ్రీరామ చంద్రుని సేవకై మీరు వానరులుగా అవతరించమని చెప్పెను. 399వ పద్యమున జాంబవతుడు, 403వ పద్యమున వాలి, 404వ పద్యమున సుగ్రీవుడు, 405వ పద్యమున తారుడు, 408వ పద్యమున నీలుడు, 409వ పద్యమున మైదుడు, ద్వివిదుడనే వైద్యులు, 410వ పద్యమున సుషేణుడు, 411వ పద్యమున శ్రీహనుమంతుడు పుట్టెనని వర్ణించిరి. 412వ పద్యమునుండి 421వ పద్యము వరకూ వానరులందరూ ఆజన్మసిద్ధ పరాక్రమములుకలిగినవారని కవి అభిప్రాయము. శ్రీనారాయణం రామానుజాచార్య స్వామివారు బాలకాండను నాలుగు భాగములుగా విభజించి వ్రాసిరి. అసలు వారు కావ్యమును ఎప్పుడు ప్రారంభించి ఎప్పుడు ముగించిరో ఇంతవరకు తెలియదు. శుద్ధప్రతిగా నాలుగు ఎక్సర్‌సైజ్ పుస్తకములను వారే కుట్టివ్రాసిరి. మొదటి పుస్తకము అట్టపైన మాత్రమే తేదీ వేసి ఉన్నది. లోపల

మిగతా వివరములు లేవు. 423వ పద్యమున "సారోదారకవిత్వ సత్త్వధిషణా సంపూర్ణ పాండిత్య" అనేది చివరగా ఉన్నది. స్వస్తిశ్రీ శోభన నామసంవత్సర జ్యేష్ట బహుళ పంచమీ బుధవారము (12-6-1963) నాడు పూర్తై ఉండవచ్చును. రెండవ పుస్తకమున పద్యసంఖ్యను మార్చలేదు. 424వ పద్యమున దివ్య పాయసమును స్వీకరించి నందున దివ్యపురుషులు నలుగురు జన్మించగలరని మునులు ఆశీర్వదించిరి. 425వ పద్యమున మితిమీరిన సంతోషముతో దశరథుడు తన భార్యలకు తన వంశములోని పూర్వ రాజ చరిత్రలను చెప్పెను. 427వ పద్యమున "హంసయానల యాన మతిమాంద్యముంజెందె" అనే సీస పద్యములో గర్భవతుల వింతలను విశేషముగా వర్ణించెను. గర్భవతులవింతచేష్టలలో 430వ పద్యములో శ్రీహరి అంశను గర్భమున ధరించుటచే రాణులైన దశరథుని వనితలు త్రైలోక్య వంద్యులైరి అని చమత్కరించెను. శ్రీరామజననమునందు 435వ పద్యంలో జ్యోతిషశాస్త్రము గూర్చి తెల్పుతూ గ్రహములైదు ఉచ్ఛస్థితిలో ఉండి మిగతా గ్రహములు ప్రసన్నతచెంది ఉన్నవని వర్ణించెను. ఆనమయమున ప్రకృతి కూడా అమితానందముతో పారవశ్యము నొందినది. వెయ్యి మన్మథుల రూపమును కలిగినవాడు, సుగుణధాముడు, పరంధాముడు శ్రీరాముడని వర్ణించెను. 436వ పద్యంలో సర్వలోకముల "కావ" రక్షించేశక్తిగల ఆయన "కావుకావు" అని అరచిన నిన్ను రక్షించేశక్తి ఎవరికి కలదు. పసిపిల్లల రోదనమును "కావ్" అనే పదముతో కలిపి చమత్కరించెను. 440వ పద్యంలో భరతుని జననము గురించి, 441 పద్యంలో లక్ష్మణశత్రుఘ్నులు ఏకాదశి ఆశ్లేషా నక్షత్రయుక్త కర్కాటక లగ్నమందు జన్మించినట్లు వర్ణించిరి. దశరథుని పుత్రజననమహోత్సవమున ఆకాశమునుండి పూలవాన కురిసినట్లు దేవదుందుభులు మ్రోగినట్లు ఆకాశమున అప్సరసలు ఆడినట్లు శ్రీరామజననముతోనిఖిలభువనైకకళ్యాణసుఖసముదాయబీజములు మొల్కలెత్తినవి. జన్మమెరుగని శ్రీహరి దశరథుని కుమారుడైననాడు, దేవతలు రావణుని బాధలు తొలిగినవనుకున్నారు. పామరులు తమ పాపములు అదృశ్యమైన వనుకున్నారు. శ్రీరాముని అందము చూచి మన్మథుని రూప గర్వము జారెను. దివ్యనదులలో నీరు తేటవడెను. దశరథుని హర్షచంద్రికలకు హద్దులు లేకుండెను. 452వ పద్యములో శ్రేష్ఠగుణభూషితుడైన దశరథుని జ్యేష్ఠకుమారునికి రాముడని నామకరణము చేసెను. ఆయన సకల సుర రక్షణోత్సాహశక్తియుతుడు, సకల భువన మంగళధాముడు, సంపూర్ణకాముడు, కామశతవంచనోద్దాముడని వర్ణించెను. 457వ పద్యంలో ఎన్నో సంవత్సరములతర్వాత పౌరవనితలు పేరంటమునకు దశరథుని ఇంటికి వచ్చి "కఱవుదీరిన బిడ్డలు కలిగిరింక నేమికావలె దశరథ

భూమిపతికి" అని ఆనందాశ్చర్యములతో పలికిరి. సోదరుల అన్యోన్య ప్రేమను వర్ణిస్తూ 463వ పద్యంలో శ్రీరాముని చూడకుండగా ఒక నిమిషమందైనను ఉండలేరు. శ్రీరామునకు లక్ష్మణుని మీద ఎంత దాక్షిణ్యమో? భరత శత్రుఘ్నులు కూడా స్నానపానాదులయందు శ్రీరామునివిడిచి ఉండలేరని వర్ణించిరి. 471వ పద్యమున దశరథుని ఇంట రోజూ పండుగలే, పుట్టిన వారమని, పుట్టిన నక్షత్రమని, పేరుపెట్టిన రోజని చెప్పి సర్వవైభవములను జరుపుచుందురు. 474వ పద్యంలో శ్రీరాముని పాలబుగ్గలనుచూచి ఇతను క్షీరాబ్ధిలోలుడని విశాలమైన వక్షస్థలమును చూచి ఇతను శ్రీనివాసుడని కౌసల్యభావించెను. 477వ పద్యంలో ఎవరి పిల్లలు వారికి ముద్దు. కానీ శ్రీరాముని విషయములో ముగ్గురు తల్లులకు సమానమైన ప్రేమకలదు. మరి ఇది వింత కదా! 480వ పద్యంలో ధర్మార్థకామ మోక్షములకు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు ప్రతీకలు. ఋగ్యజుస్సామాథర్వణ వేదములకు కూడా వారే ప్రతీకలు. నాలుగు సముద్రములకు కూడా వారే ప్రతీకలు. పసిపిల్లలు కూర్చున్నప్పుడు దశరథుని దిగులు తీరెను. ఆ పిల్లలు తప్పటడుగులువేసేటప్పుడు దశరథుడు "ధన్యోస్మి అనుకొనెను." నడకబాగా వచ్చి పరుగెత్తేటప్పుడు తన పాపపు పుంజము పటాపంచలై ఎగసి హరించినవి అని ఆనందించెను. 479వ పద్యములో బాలల సహజలీలా మహావిశేషముల చేత దశరథునకు కాలమే తెలియకుండెను. 481వ పద్యములో పసిపిల్లల లేతపాదములకు వెండిగజ్జల కడియాలు తగిలిస్తే "ఘల్లు ఘల్లు మనుచూ కై జంటరతనాల కంకణాల రిమ్ముర్యిమురువొప్ప ఝుణఝుణ ల్పొరయజేయుచూ" మిక్కిలి ఆనందింపచేసెను. 482వ పద్యములో శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు బంగారు కొండలే. దశరథుని కుమారులు నలుగురూ రతనాల గనులే, అందరూ సురనుతచరితులే, అందరూ శతకోటి మన్మథాంగులే అని వారి ముగ్ధమోహనత్వమును వర్ణించిరి. 484 పద్యంలో తేనెలో తడిసి వచ్చే ముద్దు పలుకులను విని ఆ భూతలనాయకుడు మిక్కిలి ఆనందపడి సంప్రీతిగా కౌగిలించి లేతబుగ్గలపై ముద్దును ఇచ్చెను. దశరథుడు శ్రీరాముని పిలిచే పల్కరింపులు మిక్కిలి సుమనోహరాలు. 486వ పద్యంలో శ్రీరాముని దాగుడు మూతలు కూడా ఎంతో అందమైనవి. 490వ పద్యంలో తనయుల అదృష్ట రేఖలను గొనియాడుచూ మహామోదభరితాంతః కరుణుడై అరువదివేల ఏళ్ళకు తనకు పుత్రులు కలుగుట, వారితో తీరని మమతానుబంధము, సకల భువనములను తనలో ఇముడ్చుకొన్న శ్రీరాముడు దశరథునితో ఆటలాడుట ఎంతో వినోదముగా వర్ణించిరి. 493వ పద్యంలో చతుర్దశభువనములను కుక్షిలో దాచుకొన్న ఆ లోకరక్షకుడు, అక్షరమూర్తి అక్షరములను దిద్దుటకుపక్రమించెను. 497వ పద్యంలో శ్రీరాముడు వృద్ధాచార

పూర్వకముగా శాస్త్రచోదితమగు భిక్షను తల్లిని అడిగెను. దశరథుని పుత్రులకు ఉపనయన సంస్కారము జరిగెను. 504వ పద్యములో శ్రీరాముని విద్యాభ్యాస సమయమున "గట్టురాపట్టి చూలికి గలదొ లేదొ ఇట్టి కోదండపాండిత్య మిట్టియూహ, లిట్టి సమయోచిత జ్ఞాన మివుడటంచు" విద్యాగురువలే ఆశ్చర్యపడిరి. 507వ పద్యములో కంటికి రెప్పవలె భక్తితో లక్ష్మణుడు శ్రీరాముని వీడక శేషకళాభిమానియై ఎప్పుడూ అనుసరించే ఉండెను. అలాగే భరతుని పదసేవానిరతి శత్రుఘ్నుని నిరంతరసేవ బాల్యము నుంచే వీరికి అమరెను. 509వ పద్యములో స్నానము, సంధ్యయు సాంగముగా నేర్చి తమ్ములతో రోజూ తండ్రి వద్ద అశేష ధరాపరిపాలన క్రియా జ్ఞానమును ఆర్జించుచూఅనన్యయశోవిభవాభిరాముడైనాడు.511వ పద్యములో మునులతో శబ్ద శాస్త్రార్థచర్చ ఒకవేళ, ఒకవేళ న్యాయ తంత్రోక్త చర్చలు, సరసగానా మృతాస్వాదము ఒకవేళ, బహువిధ సుకవిగోష్టి ఒక వేళ జ్యోతిషోప న్యాసములు, ఒకవేళ దండనీతి రచనావిధానము, ఒకవేళ కావ్య కల్పనా చమత్కారము, ఒకవేళ నిగమాగమనిరుక్త చింత. ఇలా అన్ని శాస్త్రములు శ్రీరాముని మదిలో తాండవము సల్పుచుండెను. 514, 515 పద్యములలో దశరథుని మనోప్రవృత్తిని వర్ణించిరి. చాలాకాలం వరకు తనకు సంతానము కలుగలేదు. కలిగిన సంతానము అన్ని విద్యలలో పాండిత్యమును ఆర్జించిరి. ఇది దశరథుని జీవితమున ఊహకందని విచిత్ర పరివర్తనము. కోరికలు తనకు చాలావరకు ఫలించెను. పుత్రులకు దీటుగా కల కన్యల వెదికి వివాహము చేసి రాజ్యభారమంతయూ శ్రీరాముని పైన ఉంచవలెనని నిశ్చయించి ఈ విషయమును మంత్రి సామంతపురోహితాదులకు విన్నవించెను.

520వ పద్యము విశ్వామిత్రుని ఆగమనమును వర్ణించి ఆయన ధీమహితుడు, కులపతి, మునీంద్రుడు, అపరచతురాననుడు, విశ్వామిత్రుడు. ఆయన తన అస్త్రశస్త్రముల విద్యనంతయు శ్రీరామునికే సమర్పించి తను ధన్యతనొందవలెనన్న ప్రమోదముతో అయోధ్యకు వచ్చెను. శ్రీరాముడు తన చెంత ఉన్నంతకాలము తన ఆనందమునకు అవధులు లేవు. శ్రీరామునిలో పరమాత్మను దర్శించి ఆయనకే తన సర్వస్వమును ధారాదత్తము చేయవలెనని ఏదో నెపమున ఆ శ్రీరామునితో కొంతకాలము గడపవలెను అనుకొనెను. భగవానుడు కూడా భక్త పరాధీనుడు. విశ్వామిత్రుని కీర్తి ముల్లోకములకు వ్యాపించవలెనని ఆ భక్తునికి శిష్యుడాయెను. ఇచట శ్రీ నారాయణం రామానుజాచార్య స్వామి తనే విశ్వామిత్రుడై భగవంతుని అలాసేవించారేమో అనిపించేంత ఉత్తమంగా విశ్వామిత్ర పాత్ర రచన చేసారు. అనుక్షణం శ్రీరామునిలో పరమాత్మను దర్శించుచూ తాను పొందిన ఆనందాతి

రేకమును అప్పుడప్పుడు బయటకు కూడా చెప్తాడు. 521వ పద్యము శేషశేషిత్వ సిద్ధాంతమును సంక్షిప్తముగా చెప్పెను. 523వ పద్యంలో పరమవిరాగియైన కౌశికుడు రత్నవికార రాజసౌధ గోపుర ద్వారమునకు వచ్చెననెను. ఇచట విరాగులు భోగుల చెంతకు వచ్చుటలో విరాగికి కావల్సిన రత్నము ఆ భోగసౌధములో కలదు. దానిని తీసుకొని పోవుటకై వచ్చెనని ఇట చమత్కారము. 525వ పద్యములో విశ్వామిత్రుడు దశరథుని సభా మండపమునకు రాక మునుపు దశరథుడు మంత్రి సామంత భూపాల పురోహితులతో కొంతసేపు వేదాంత విజ్ఞాన ప్రమోదాంతరాత్ములై మరికొంతసేపు రత్న కంకణ ఝణా ఝణారావముల శృంగార నాట్యములను చూచిరి. కవివతంసుల కవితాగానములతో, సరససాహిత్య చతురతతో, వేదవేదాంగవేత్తల అఖిల శాస్త్రార్థతత్త్వ విచారములతో, మంత్రివర్యుల తంత్ర విచారములతో, అమరదుర్లభవజ్ర సింహాసనమున ఉండి దేశ దేశాంతర స్థితులను తెలుసుకొను చుండెను. 532వ పద్యంలో కౌశికుడు రాజగోపుర ద్వారమున ఉన్నాడని తెలిసి హర్షపరీత హృదంతరాళుడై కౌశికుని చెంతకు వెళ్ళెను. విశ్వామిత్రుని చూచుటకు దశరథుడు వెళ్ళే వర్ణన చాలా బాగుంది. 546వ పద్యములో దశరథుని దేవేంద్రునితో పోల్చి, భూమిని భూలోక స్వర్గముగా దశరథుడు చేసెనని కౌశికుడు పొగడెను. 547వ పద్యములో బ్రహ్మర్షిమూర్ధన్యుడు వసిష్ఠుడు దశరథునకు కులగురువుగా ఉన్నప్పుడు భద్రములకు అంతరాయమే ఉండదని కౌశికుడు వసిష్ఠుని స్తుతించెను. విశ్వామిత్రుని భక్తితో వినయముతో సగౌరముగా దశరథుడు మంత్రి సామంతపురోహిత మహర్షి గణముల సమక్షమున ఆస్థానమునకు తీసుకొని వచ్చి కనకాసనమున కూర్చుండబెట్టి "ఎంతయో యుల్లసముల్లసిల్ల భక్తి రసానుభూతి శోభిల్లగ" ముకుళిత హస్తములతో విశ్వామిత్రుని దశరథుడు ఇట్లు ప్రార్థించెను. మీ ఆశ్రమమున మీ శిష్య సంచయము క్షేమమేకదా! క్రూరమృగముల భయము లేక ఫల పుష్ప కందమూలములు లేక ఉన్నవి కదా! 555వ పద్యంలో చవిటి నేలలో జలముసమృద్ధిగా కలిగినట్లు, నిర్ధనునకు ద్రవ్యనిధి దొరికినట్లు, అలసినవానికి అమృతముచిక్కినట్లు, ఓ దయానిధీ! నీరాక మాకట్లున్నది. అత్మపత్నులందు అనురూపసంతతివలె, పరమయోగికి భగవద్దర్శనమువలె మీరాక నాకట్లున్నది. ఘోరసంసారపీడలసు అనుభవించుచున్న మాకు మీరాక అమృత ధారా ప్రవాహమై ఉన్నది. సకల సంయమికులవరసార్వభౌమా! దైవికంబుగా నీవు ఇచటకువచ్చినావు కానీ నీరాకకై ఎంతప్రయత్నించిననూ అది లభ్యముకాదు. బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేయగల నీవు నన్ను చూడవచ్చుట సాటి రాజులలో నాకెంతఘనత వచ్చును. అర్థకామములకై నీవెచటికిని రావు. నీ కోర్కెలను తీర్చెదను. నీవు వచ్చిన పనిని తెల్పుము అని వేడెను. 568వ పద్యములో నీవు వసిష్ఠుని

శిష్యుడవుకావున అమిత వినయముతో అర్థించుచున్నావు. ఇలలో ఎందరినో రాజన్యులను చూచితిని కానీ "ఈలలితాకారము వాఙ్మధూత్కటత కళ్యాణక్రియానిష్ట" ఇతరులకు లేదు. 571వ పద్యములో విశ్వామిత్రుడు ఒక యాగమును చేయదలచెను. దానిని రాక్షసులు విఘ్నపరచుచున్నారు. సవనదీక్షలో ఉన్నప్పుడు శపించుటచే యాగదీక్షాభంగము, దివ్యతపోవ్యయముకూడా కాగలదు. మారీచ సుబాహువులు యాగ భంగమును చేయుచున్నారు. 581వ పద్యములో కోపించినను శపించుటకు అవకాశము లేదు. "కోపగించి ధనుర్బాణములను ధరించిన జగముల్ క్షోభిల్లవే పార్థివ" పూర్వము ఎన్నో కారణములచేత తపస్సంతయు కోపముతోనే వృథా అయ్యెను. ఇప్పుడు సంపూర్ణ సాత్త్వికుడనై సాధకుడనైతిని. 583వ పద్యంలో ఈ క్రతువు పదిరాత్రులు జరుగును. రాక్షస సంహారమునకై శ్రీరాముని నాతో పంపుము. దిగ్వ్యాపక సుయశోవశునిగా శ్రీరాముని నీకు అప్పజెప్పెదను అని అనెను. 588వ పద్యంలో విశ్వామిత్రుడు యాగసంరక్షణకై శ్రీరాముని అడుగుతాడని తెలియక అడిగినది తప్పకఇచ్చెదనని విశ్వామిత్రునికి మాటఇచ్చెను. శ్రీరాముని విశ్వామిత్రునితో పంపలేక దశరథుడు తనలో పరితపించుచుండెను. ఆ సమయమున దశరథునికి ప్రపంచము మహా విచిత్రమై తోచె, శౌర్యము అణిగెను, కోర్కెలు నశించెను, శరీరము జడాకారమై ప్రాణము కంపించెనని వర్ణించెను. కొంతకాలమునకు తెప్పరిల్లి దీనాతి దీనుడై తనకు ఏదో ముప్పువచ్చెనని వికలేంద్రియుడై విశ్వామిత్రునితో ఇట్లనెను. నారామునకు ఇప్పుడు పదునారేళ్ళు. అటువంటి నా రాముడు నిశాచరులను చంపగలడా. 592వ పద్యంలో కపటమెరుగని నా రాముడు కటిక రక్కసులను చంపగలడా. నాజీవన సర్వస్వనాథుడైన శ్రీరాముని విడిచి ఎట్లుండగలను. అని శ్రీరాముని విరహమును సహించలేనని విశ్వామిత్రునితో చెప్పెను. 599వ పద్యంలో శ్రీరాముని సత్యపరా క్రమములు వసిష్ఠునకు బాగా తెలుసు. ఈ సభామండపమున ఉన్నవారిలో కొందరికి కొద్దిగా తెలుసును. 601వ పద్యంలో యాగసంరక్షణకు అభ్యంతరము ఎవ్వరూ చెప్పరు. శ్రీరాముని బలపరాక్రమములను నేను బాగా ఎఱుగుదును. 604వ పద్యంలో ప్రాణములకంటే ప్రియుడు నాకు శ్రీరామభద్రుడు. అతనితో రాక్షస సంహారమునకు చతురంగబలములతో నేను రాగలను, నా ప్రాణముల మీద ఆసక్తిని పారదోలి వారితో నేనే యుద్ధమును చేయుదును. 613, 617, 621వ పద్యములలో విశ్వామిత్రుడు రాక్షసుల వృత్తాంతమును వారి ఆగడములను చెప్పెను. 625వ పద్యంలో కరుణతో నన్ను నారాముని దయచూపుమని విశ్వామిత్రునితో దశరథుడు దైన్యముగా ప్రార్థించెను. 628వ పద్యంలో క్రోధపరవశుడైన విశ్వామిత్రుడు దశరథునితో "అంత గౌరవము ఇంతైయరి

గెనెటకొ యాగము మాత్రము అగదు, పోయివచ్చెద" మని చెప్పి వెళ్ళబోయెను. 633వ పద్యమున ఇక్ష్వాకువంశగౌరవము గూర్చి వసిష్ఠుడు చెప్పాడు. 634వ వచనంలో వసిష్ఠుడు విశ్వామిత్రుని తపోబల పరాక్రమములను చెప్పి సంశయింపక విశ్వామిత్రునితో శ్రీరాముని పంపిన శుభము కలుగునని దశరథునికి చెప్పెను. 635వ పద్యంలో "రమణీయము క్రతువు సంరక్షకుండు శ్రీరామభద్రుండు. నేను దానికి ప్రేరకుడును. యాచకుడు కౌశికుడు. దాత దశరథుడు ముల్లోక వాసులు సంతోష పడువారు" అని చెప్పెను. 637వ పద్యంలో శ్రీరామునకు కౌశికుని పరిచయము చేసి ఆ యాగసంరక్షణ కొరకు నిన్ను పంపుచుంటిని అని దశరథుడు చెప్పెను. 640వ పద్యంలో కౌశికునితో శ్రీరామలక్ష్మణులు బయలుదేరగా ప్రకృతి చల్లబడి అచటివారిని చల్లని సుగంధవాయువులతో పరవశింపచేసెను. 643వ పద్యంలో త్యక్త సంసారులైన తపశ్శాలులకుకూడాదుర్లభదర్శనుడైన శ్రీరాముడు తండ్రియాజ్ఞచే కౌశికునకు వశ్యుడైనాడు. ఆకాశమునుండి దేవతలు పౌరులు మహదానందముతో అదృశ్యము చూచిరి. 648వ పద్యంలో నీ కుమారునికి ఏ లోపము రానీయను, నీవు వ్యాకులత చెందవలదు. జయలక్ష్మితో నీ కుమారులను నీ వద్దకు పంపగలను. 653వ పద్యంలో కౌశికునివెంట శ్రీరామలక్ష్మణులు వెళ్ళుటను అందముగా చిత్రించెను. 655, 656వ పద్యములలో శ్రీరాముని విశ్వామిత్రుడు భక్తిపారవశ్యముతో పిలిచిన పిలుపు చాలా బాగున్నది. 657వ పద్యంలో బల అతిబల విద్యల ప్రయోజనమును విశదపరిచెను. 663వ పద్యంలో బలాతిబలవిద్యల ప్రతిఫలముల గూర్చి చెప్పెను. 667వ పద్యంలో శ్రీరామునకు విశ్వామిత్రుడు సుప్రభాతమును పలికెను. 673వ పద్యమున అంగదేశ నామౌచిత్యము, ఆదేశ వృత్తాంతమును చెప్పెను. 679వ పద్యమున కౌశిక శ్రీరామలక్ష్మణులకు మునులుచేసే అతిథిసత్కార విశేషములను వర్ణించెను. 685వ పద్యమున శ్రీరాముని మునులు స్తుతించుట, 688వ పద్యములో సరోవరనది ఉత్పత్తిని వర్ణించిరి. 692వ పద్యములో అడవిలోని వృక్షములను పశు పక్ష్యాదులను వాటి పేర్లతో వర్ణించెను. 693వ పద్యములోనూ, 694వ వచనములోనూ వృత్రాసురుని దేవేంద్రుడు సంహరించిన పిదప ఆ పాపప్రక్షాళన చేసిన చోటును మలద-కరూరదేశ వృత్తాంతములను వర్ణించిరి. 695వ పద్యమున తాటక వృత్తాంతమును వర్ణించుచూ ఆమె ప్రవృత్తిని వర్ణించెను. 702వ వచనమున తాటకకు రాక్షసప్రవృత్తి వచ్చినవిధి విధానమును వర్ణించిరి. 704, 706వ పద్యములలో తాటక శరీరలావణ్యమును వర్ణించిరి. 710వ పద్యంలో తాటకవధను గూర్చి ధర్మమీమాంసచేస్తూ విశ్వామిత్రుడు ఇలాఅనెను. రాజధర్మమును తెలిసిన వాడనుకనుక తాటకనుసంహరించమని చెప్పెను. 714వ పద్యంలో పురాణములలోని

స్త్రీ హత్యల గూర్చి వివరించెను. 717వ వచనములో అయోధ్యలో దశరథుడు మీ అజ్ఞనుదాటవలదని చెప్పినారు కనుక మీ అజ్ఞ నాకుశిరోధార్యమని శ్రీరాముడు చెప్పుట. 725వ పద్యంలో తాటకను వధించుటకు శ్రీరాముడు నిశ్చయించి తనధనుష్టంకారముచేసెను. 728, 729వ పద్యములలో శ్రీరాముని ధనుష్టం కారమునకు బెదరి శ్రీరామునిముందర తాటక నిలబడెను. అప్పటి అమె వర్ణనను రమ్యముగాచేసెను. 730వ పద్యంలో మనలను హింసింపవచ్చిన మగువను చంపకుండగా ఒక బాణముతో ఆమె ముక్కు చెవులనుచెక్కి అమె గర్వమును నాశనము చేసెదమని శ్రీరాముడు భావించెను. 738వ పద్యంలో తాటకి భుజములు తెగినవి. ఐననూ భీకర శబ్దములుచేయుచూ రాముని ఎదుట నిలచెను. 739వ పద్యంలో తాటకి భీకర శబ్దములు విని లక్ష్మణుడు ఖడ్గముతో దాని ముక్కుచెవులను కోసెను. తాటకి కామ రూపమును దాల్చి ఆకాశము నుండి గోలచేయనారంభించెను. అంతట విశ్వామిత్రుడు సూర్యుడు అస్తమించుచున్నాడు, తాటక మీద కృపను చూపుట మాని దానిని సంహరింపుమని చెప్పెను. 746వ పద్యములో కౌశికుడు తాటకవధకై శ్రీరాముని తొందరపెట్టును. 746వ పద్యములో శ్రీరాముడు ఒక బాణమును హృదయమున నాటగా ఓర్వలేక తాటక నేలపై పడెను. 757వ పద్యములో క్రిందపడిన తాటక గిలగిలమని కొట్టుకొనుచు పెద్ద పెద్ద అరుపులతో మరణించెను. 764వ పద్యములో తాటక మరణవార్తను విని మహర్షులతో పాటుగా దేవేంద్రుడు కూడా అచటికి వచ్చి కౌశిక శ్రీరామ లక్ష్మణులను అభినందించెను. 766వ పద్యములో దేవేంద్రుడు శ్రీరాముని స్తుతించి భృశాశ్వ పుత్రులను శ్రీరామునికిమ్మని కౌశికుని వేడుకొనెను. 770వ పద్యంలో దేవగణముతో వచ్చిన దేవేంద్రుడు, వనవాసులైన బ్రహ్మర్షులు కౌశికుని ప్రస్తుతించి శ్రీరామ లక్ష్మణులను ఆశీర్వదించి వెళ్ళిరి. 772వ పద్యంలో కౌశికుడు శ్రీరాముని తాటక సంహారము చేసినందుకు వాత్సల్యాతిశయమున స్తుతించినాడు. లక్ష్మణుని శ్రీరాముని వలె నీవునూ సర్వసంపన్నమూర్తివి కావలెనని ఆదరించి కౌశికుడు పల్కెను. 780వ పద్యంలో తృణశయ్యపై శయనించిన శ్రీరామలక్ష్మణులను కౌశికుడు చూచి వారి సౌందర్యమును ప్రమోదముతో చూచి ఆనందించెను. 783వ పద్యములో కౌశికుడు శ్రీరాముని శౌర్యమునకుమెచ్చి తను తపస్సుచే సాధించిన అనేక దివ్య శస్త్రాస్త్రములను శ్రీరామునకు ఇచ్చెను. 785వ పద్యంలో కౌశికుడు శ్రీరాముని శౌర్యబల పరాక్రమములకన్నా అమితవాత్సల్యప్రేమతో శ్రీరాముని వదలలేక తన

సర్వస్వమును సమర్పించెను. దశరథుడు చూడలేని దివ్యత్వమును శ్రీరాముని యందు కౌశికుడు ఎప్పుడో చూచెను. ప్రతిగ్రహీత శ్రీమన్నారాయణుడు. సమయ సందర్భమును చూచి కౌశికుడు తన అస్త్రశస్త్ర విజ్ఞానమంతయూ శ్రీరామునికి సమర్పించెను. 787వ వచనంలో శ్రీనారాయణం రామానుజాచార్య స్వామి తాను సాధించిన అస్త్రశస్త్ర విజ్ఞానము నంతయూ విశ్వామిత్రునివలె మనకు తెలియచేసెను. 788వ పద్యములో కౌశికుడు అనుగ్రహించిన అస్త్రశస్త్ర అధిష్ఠాన దేవతలు శ్రీరాముని సేవించి శ్రీరాముని ఆజ్ఞకై ఎదురుచూచినవి. 790వ పద్యంలో దాస భావమును చక్కగా వర్ణించిరి. 792వ పద్యములో కౌశికుడు శ్రీరామునికన్నా ఆప్తులు వేరేవారు లేరని నిశ్చయముగా చెప్పుట, ఇచట ప్రపత్తిని రహస్యముగా వర్ణించెను. 796వ పద్యములో విశ్వామిత్రుడు శ్రీరామునకు భృశాశ్వతనయులను గూర్చిచెప్పెను. 800వ పద్యములో శ్రీరాముడు అనేక శస్త్రాస్త్ర సంపాదనము చేత మహాతేజోవంతుడై ప్రకాశించుచున్నాడు. 802వ పద్యములో శ్రీరాముడు దర్శించిన శస్త్రాస్త్ర అధిష్ఠానదేవతలు ఆయన ఆజ్ఞకై ఎదురుచూచెను. సమయము వచ్చినప్పుడు మిమ్ములను స్మరించగలను. అప్పుడు మీరువచ్చి నా పనిని పూర్తిచేసి వెళ్ళగలరని వారిని శ్రీరాముడు ఆదేశించెను. 807వ పద్యములో అస్త్రశస్త్రముల ఉపదేశానంతరము కౌశికునకు శ్రీరాముడు సాష్టాంగనమస్కారములను చేసెను. 808వ పద్యములో శ్రీరామునితో కౌశికుడు నీవు నేర్చిన విద్యలను లక్ష్మణునకు ఉపదేశించమని ఆదేశించగా శ్రీరాముడు అట్లేచేసెను. 810వ పద్యములో కౌశకునితో శ్రీరామలక్ష్మణులు సిద్ధాశ్రమమునకు వచ్చిరి. ఆ ఆశ్రమమున శారికా కీరములుకూడా కావ్యములలో ఉండే సూక్తులు చెప్పుచుండగా వాటిని చూచి చాలా ఆశ్చర్యపడిరి. 817వ వచనములో సిద్ధాశ్రమమునుగూర్చిచెప్తూ ఇందు అనేక కోట్లమంది బ్రహ్మర్షులు ఘోరనిష్ఠులై తపస్సిద్ధినిపొందినందున దీనికి సిద్ధాశ్రమమను పేరు సార్థకమాయెను. 817వ వచనమున వామన చరిత్రమును సంగ్రహముగా తెల్పిరి. 818వ పద్యంలో కమలాపతి పదములు ఇచట తిరిగినందున ఈ స్థలము పరమపవిత్రమైనది. 820వ పద్యంలో ఇప్పటికి ఈ ఆశ్రమమునాదిలాగానే భావించుచున్నాను. నాకు సొంతమైనప్పుడు నీకూ ఈ ఆశ్రమము సొంతమే అని చెప్పెను. 822వ పద్యంలో మారీచ సుబాహువుల రాకనుగూర్చితెల్పుచూ వారు వచ్చునప్పుడు భూమి చలించును, క్రూర మృగములు కూడా వారి నడకను చూచి బెదురును, మౌని మండలమునకు మతి చెడును. ఇలా వారి అగడములను విచిత్రముగా వర్ణించిరి.

825వ పద్యములో ఈ మఖ రక్షణము నీ తమ్మునితో నీవు కూడా చేయవలెను అని చెప్పెను. 834వ పద్యంలో యాగారంభమును త్వరగా గావింపుమని శ్రీరాముడు విశ్వామిత్రుని కోరగా శ్రీరాముని మాటలకు కౌశికుడు సంతోషపడెను. 843 మరియు 849 వచనములలో యాగవేదిక నిర్మాణము, ఋత్విక్కుల క్రియాకలాపములు నాలుగు దిక్కులలోని వేదిక ద్వారముల అలంకరణ విశేషములను చాలా మహిమాన్వితముగా వర్ణించిరి. 850, 853వ పద్యంలో ఆరు రోజులు యాగము నిరంతరాయముగా జరిగినందున బ్రహ్మర్షులందరూ శ్రీరామలక్ష్మణులను అభినందించిరి. 857వ పద్యములో లక్ష్మణుడు శ్రీరామునితో ఇలా అన్నాడు. "కుసుమపేశలమ్ము మీ హృదయము. రాక్షసుల మీద జాలి లేకున్నచో ఒకే బాణముతో వారు మరణించరా! యజ్ఞ వినాశకులమీదా నీకు జాలి" అని అనెను. 859వ పద్యములో సుస్వర వేద మంత్రములతో ఆ ప్రాంతము చాలా పవిత్రమై వినేవార్కి చాలా ఆనందమును చేకూర్చుచుండెను. అగ్నిహోత్రుడు కూడా తన సప్తజిహ్వలతో ఆనందమును ప్రకటించుచున్నాడు. 864వ పద్యంలో మారీచ సుబాహువులు యాగమును విఘ్న పరిచేందుకు వచ్చే వర్ణన చాలా బాగున్నది. 869వ పద్యంలో మారీచ సుబాహువులు యాగశాలను పరిశీలనగా చూచి, శ్రీరామలక్ష్మణులను గుర్తించి, కట్టుదిట్టమైన రక్షణ వలయమును చూచి దిగులుచెందిరి. 871వ పద్యములో యాగము పరిసమాప్తి నొందుచున్నది. మునులను శ్రీరామలక్ష్మణులను కసితీరా మర్దించి వెళ్ళుదము అని రాక్షసులు భావించిరి. 873వ పద్యములో తాపసులను అవహేళన చేసే తీరు చాలా బాగున్నది. 875వ పద్యములో మారీచ సుబాహువులు శ్రీరామలక్ష్మణులను భయపెట్టేతీరు కూడా చాలాబాగున్నది. 882వ పద్యములో మారీచుని శ్రీరాముడు సముద్రములో పడవేయుట చూచి కోపముతో సుబాహువు శ్రీరామునితో ఇలా గద్దించాడు. 886వ పద్యంలో సుబాహువు మరణించిన తర్వాత అతని దైన్యస్థితిని వర్ణించెను. 887వ పద్యంలో లక్ష్మణుడు వాయువ్యాస్త్రముతో రాక్షస సేనను పారద్రోలెను. 889వ పద్యములో రాక్షస సంహారము చేసినందుకు ఆశ్రమవాసులందరూ శ్రీరామ లక్ష్మణులను పొగిడిరి. 891, 893 పద్యములో శ్రీరామ లక్ష్మణులు కౌశికునికి నమస్కరించగా కౌశికుడు వారిని ఆశీర్వదించెను. 895వ పద్యంలో శ్రీరామ లక్ష్మణులు విశ్వామిత్రునితో ఇట్లనిరి. మేము తమ భృత్యులము. తర్వాత కార్యక్రమమును మాకు ఆదేశింపుడు. 899వ పద్యమున విశ్వామిత్రుడు మిథిలకు

వెళ్ళదలచి శ్రీరామలక్ష్మణులను గూడా తీసుకొని వెళ్ళదలచెను. 903వ పద్యమున శివధనుర్వృత్తాంతమును చెప్పి, జనకుడు పిలవలేదనే భావన వలదని శ్రీరామ 0లక్ష్మణులకు కౌశికుడు చెప్పెను. 905, 906 పద్యములలో భువనములను ఆజ్ఞాపించే స్వామి కౌశికుని ఆజ్ఞకు లోబడి సంచరించుచుండెను అని అనెను. శ్రీరాముడు భక్త పరవశత్వమున వాత్సల్యాద్యహేయ గుణములను త్యజించడు అని చెప్పెను. 910వ పద్యమున విశ్వామిత్రుడు శ్రీరామ లక్ష్మణ మునిగణముతో మిథిలకు బయలుదేరగా సిద్ధాశ్రమమునగల కురంగ, శుక, పిక, శారిక గణము వారిని వెంటనంటిరాగా కౌశికుడు మీ నివాసములకు వెళ్ళుమనగా అవి వెళ్ళినవి. 920 వచనములలో కుశుని వృత్తాంతమును చెప్పెను. 926, 929వ పద్యమున అనిలుడు కుశనాభుని పుత్రికలకు మాయమాటలు చెప్పుట. 931వ పద్యములో ధార్మిక జీవనము చేయలేనివారు మరణించుటే మంచిది అని కుశనాభుని పుత్రికలు చెప్పుట. 939వ పద్యంలో "గొప్పవానికి అల్ప గుణము ఉదయింపరాదు. అల్పునకు అనంతవాంఛలు పనికిరావు," అని హితము చెప్పుట. 945వ పద్యములో కష్టములు వచ్చిననూ వంశ గౌరవమును వదలరాదని చెప్పెను. 947వ పద్యంలో క్షమ యొక్క గొప్పతనమును గూర్చి చెప్పెను. 948వ వచనములో వివాహానంతరము కుశనాభుని పుత్రికలకు అంగవైకల్యము పోగలదని, బ్రహ్మదత్తుడనే రాజశ్రేష్ఠునకు తన పుత్రికలను కుశనాభుడు ఇవ్వదలచెను. కుశనాభుని పుత్రికల వివాహప్రస్తావనతో బాలకాండలో ప్రథమ భాగము ముగిసెను.

శ్రీనారాయణం రామానుజాచార్యస్వామివారు రచించిన శ్రీరాఘవాభ్యుదయమునకు సంపాదకులైన శ్రీనారాయణం లక్ష్మీనరసింహాచార్యులు గారు తండ్రిగారి సంగ్రహ జీవిత చరిత్రను రచించిరి. శ్రీరాఘవాభ్యుదయమును గూర్చి ఎంతో వ్రాయవలసి ఉండగా అల్పజ్ఞతతో తోచినది ఏదో వ్రాసితిని. సహృదయులైన రసజ్ఞులు వాటిని మన్నించి శ్రీనారాయణం రామానుజాచార్య స్వామి వారి కవితా మాధుర్యము ఆస్వాదించి, ఆనంద పరవశులై మిగతా భాగముల ముద్రణకై సహకరించవలసినదిగా ప్రార్థించుచున్నాను.

తిరుపతి
వృషనామ॥ వైశాఖ
శుద్ధపంచమి -
శ్రీ శంకర జయన్తి
28-4-2001.

చతుర్వేదుల వేంకట శ్రీ శివ సుబ్రహ్మణ్య శర్మ

శ్రీరామ

## విద్వత్కవిశేఖర, పండిత

## ఉ.వే. శ్రీమాన్ నారాయణం రామానుజాచార్యస్వామి వారి

## జీవిత సంగ్రహము

శ్రీమాన్ పండిత నారాయణం రామానుజాచార్య వారి జననము శ్రీహేవళంబి నామసంవత్సర (1897) జ్యేష్ఠ బహుళ అష్టమీ బుధవారం. వీరి జననీ జనకులు శ్రీమతి లక్ష్మీనరసమ్మ - శ్రీమాన్ శ్రీరామ దేశికాచార్యులవారు. వీరి జన్మస్థలము రేపల్లె తాలూకా ఉల్లిపాలెం.

గ్రంథకర్త తండ్రిగారైన శ్రీరామదేశికులవారు సాహిత్యములోనే కాక వేదవేదాంగములలోను, వ్యాకరణ, జ్యోతిష వాస్తుశాస్త్రములోను నిష్ణాతులు. ఉపవేద సంజ్ఞగల ఆయుర్వేద వైద్య శాస్త్రాన్ని కూలంకషంగా అభ్యసించిన వైద్య శిఖామణులు మరియు శ్రీ మద్వైఖానస ఆగమశాస్త్ర సాంప్రదాయ పరిరక్షణలో దీక్షాకంకణబద్ధులు. వీరి స్వస్థలము ఉల్లిపాలెము. ఇది శ్రీసూరినేని వంశీయులైన జమీందారీ గ్రామము. అలనాడు శ్రీజమీందారుల ఆదరాభిమానమైన పోషణతో ఉల్లిపాలెం గ్రామము చతుర్వేదములలో నిష్ణాతులైన వేదపండితులతోను, సంగీత - సాహిత్య - నృత్య - నాట్య కళావిశారదులతోను విరాజిల్లుచుండెడిది.

గ్రంథకర్త తండ్రిగారైన శ్రీ రామదేశికులవారు క్రీ.శ. 1902వ సంవత్సరములో ఉల్లిపాలెం గ్రామములో "శ్రీ శ్రీనివాస దైవాగమకల్పవల్లీపాఠశాల" అనే సంస్థను స్థాపించినారు. ఈ పాఠశాలలో ప్రధానముగా శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్రమును, సంస్కృత - ఆంధ్ర భాషలలో వ్యాకరణము, ఛందశ్శాస్త్రము;, సంస్కృత కావ్యాలను, ఆయుర్వేదము, జ్యోతిషము, వాస్తు మొదలగు సర్వశాస్త్రములను బోధించుటకు అసమాన ప్రజ్ఞావంతులగు ఉపాధ్యాయవర్గము యుండెడిది. ఈ సంస్థ ద్వారా శ్రీరామదేశికాచార్యులవారు అనేకమంది విద్యార్థులను ఆయాశాస్త్రములలో పండితులుగా తీర్చిదిద్దినారు. వీరి ఏకైక సోదరులు శ్రీమాన్ నరసింహాచార్యులుగారు.

వీరి జీవితకాలమంతయు సాహితీ గోష్ఠులతోను, అతిథి - అభ్యాగతుల సమాదరణతోను గడచిపోయినది. వీరు అర్థాయుష్యకాయులై వారి 45వ ఏటనే విష్ణు సాన్నిధ్యమును పొందినారు. వీరికి ముగ్గురు కుమారులు కలరు. ఈ గ్రంథకర్త మూడవవారు.

గ్రంథకర్త తండ్రిగారైన శ్రీమాన్ రామదేశికాచార్యులుగారి జ్యేష్ఠకుమారులు శ్రీమాన్ లక్ష్మణాచార్యులుగారు. వీరు న్యాయశాస్త్రపారంగతులు, లౌకిక వ్యవహారములలో అసమాన ప్రతిభాశాలి. వీరి ధర్మపత్ని శ్రీమతి మంగతాయారమ్మ గారు. వీరికి శ్రీరామాచార్యులు - శ్రీవేంకటనరసింహాచార్యులు అనెడి పుత్రద్వయము, రామానుజమ్మ - శేషమ్మ అనే పుత్రికా ద్వయము ఉద్భవించిరి. వీరి పుత్రరత్నము లిరువురు శ్రీవైఖానసాగమ పండితవరేణ్యులు.

ద్వితీయ పుత్రులైన శ్రీమాన్ శేషాచార్యులుగారు జనకుని వద్దనే విద్యనభ్యసించి సంస్కృతాంధ్రసాహిత్యములలోను,జ్యోతిష,వ్యాకరణశాస్త్రములలోను, శ్రీమద్వైఖానస భగవచ్ఛాస్త్రములోను వంశపరంపరానుగతమైన ఆయుర్వేద వైద్య శాస్త్రములలోను అసమానపరాక్రమవంతులుగా వర్ధిల్లిన సాహితీమూర్తులు. వీరు సంస్కృతాంధ్ర ములలోను అనేక కృతులను రచించిరి. వాటిలో మకుటాయమాన మనదగు కృతి - భక్తి పురస్సరముగా వ్రాయబడిన "గేయరామాయణ కీర్తనలు", శ్రీమద్రామాయణ కథనంతయూ సంక్షిప్త గేయరూపములో అందించిన మహానుభావులు శ్రీశేషా చార్యులుగారు. వారి కీర్తనలు కొన్ని వారి సమకాలీనులైన శ్రీరామ భక్తులకు కంఠస్థము. కాల వశమున వారి రచనలేమియు లబ్ధము కాకపోవుట మా దురదృష్టము. వీరు జనకునిచే ప్రారంభింపబడిన "పాఠశాలను" సమర్థవంతముగా నిర్వహించుచుండెడివారు. శ్రీశేషాచార్యులవారు ఉల్లిపాలెం జమీందారీ సంస్థానముననేకాక శ్రీకాళహస్తి - పెదపవని - పెద్దాపురం - పుట్రేల మొదలగు అనేక సంస్థానములకు ఆస్థాన వైద్యులుగా అఖండ ఖ్యాతిని ఆర్జించినారు. సంస్థానాధీశులచే "ఆయుర్వేదకళానిధి" అనే బిరుదును గూడా పొందియున్నారు. వీరి సహధర్మచారిణి శ్రీమతి అనంతలక్ష్మీతాయారమ్మగారు.

శ్రీ శేషాచార్యులవారికి శ్రీరామాచార్యులు - నరసింహాచార్యులు - హనుమాచార్యులు అనెడి పుత్రత్రయము, శేషమ్మ - వేదవతీతాయారమ్మ - లక్ష్మీ తాయారమ్మలనెడి పుత్రికాత్రయము జన్మించిరి.

శ్రీ శేషాచార్యుల జ్యేష్ఠ కుమారులు శ్రీమాన్ నారాయణం శ్రీరామాచార్యులుగారు. జనకుని వద్ద మరియు పినతండ్రి గారైన శ్రీరామానుజాచార్యులు (శ్రీరాఘవాభ్యుదయ కర్త) గారి వద్ద సంస్కృతాంధ్రములను, శ్రీమద్వైఖానస భగవచ్ఛాస్త్రమును ఆయుర్వేద వైద్యశాస్త్రాన్ని అభ్యసించినారు. వీరు సంస్కృతాంధ్రములందు చక్కని కవితలను అల్లగలిగిన మహాపండితులు.

శ్రీ శేషాచార్యుల ద్వితీయ పుత్రులైన శ్రీమాన్ నరసింహాచార్యులుగారు సదాభగవదారాధనలో లీనమై ఆధ్యాత్మికమైన గ్రంథ పఠనతో కాలక్షేపము చేయుచు భగవత్కృపకు పాత్రులగుచున్నారు.

శ్రీమాన్ శేషాచార్యులగారి కనిష్ఠ పుత్రరత్నము శ్రీమాన్ హనుమాచార్యులుగారు. పితృదేవుని సాన్నిధ్యములో వంశపరంపరానుగతమైన ఆయుర్వేద వైద్యశాస్త్రాన్ని కూలంకషంగా అభ్యసించి అపర ధన్వంతరీ స్వరూపులుగా వెలుగొందుచున్నారు. కొల్లూరు మండలము ఈపూరులో ఆగమాచార్య శ్రీమాన్ దేవయజనం వేంకట్రామాచార్యులవారి వద్ద శ్రీవైఖానస ఆగమశాస్త్రాన్ని కర్షణాది ప్రతిష్ఠాంతము అభ్యసించిన మహామనీషి. ఆయుర్వేద వైద్య చికిత్సావిధానములో పరిశోధనలు చేసి ఉత్కృష్టమైన వైద్య సేవను అందించుచున్న వీరి కృషిని గుర్తించిన సంఘాభిమానులచే వివిధ సభలలో పురస్కారములతోబాటు "ఆయుర్వేద కళావిశారద" "ఆయుర్వేద కళాప్రపూర్ణ" మొదలగు బిరుదులతో సత్కరింపబడినారు.

శ్రీ రాఘవాభ్యుదయ కావ్యకర్తలగు శ్రీమాన్ పండిత రామానుజాచార్యులవారు శ్రీరామా దేశికాచార్యుల వారి కనిష్ఠ కుమారరత్నము. వీరు బాల్యమంతయూ సాహితీ పిపాసతో గడిపిరి.

వీరి ప్రాథమిక విద్యను మహారాజశ్రీ యల్లాప్రగడ రామస్వామి పంతులుగారి వద్ద అభ్యసించినారు. సాహిత్య గురువరేణ్యులు శ్రీశ్రీనివాస దైవాగమ కల్పవల్లీ పాఠశాల పండితులగు బ్రహ్మశ్రీ కొలచిన లక్ష్మీ నరసింహశాస్త్రిగారు. శ్రీ శాస్త్రిగారు శ్రీరామానుజాచార్యుల వారిని పుత్రవాత్సల్యముతో చేరదీసి సంస్కృత - వ్యాకరణ - ఛందశ్శాస్త్రములలోను, సంస్కృతాంధ్ర భాషలలోను తీర్చిదిద్దిన అపర హయగ్రీవ స్వరూపులు. గురువులు బోధించిన సర్వవిషయములను అలనాడు ఆదిత్య భగవానుని వద్ద మారుతాత్మజుని వలె అకుంఠిత దీక్షతో - ఏక సంతగ్రాహిగా అభ్యసించిన మహామహిమాన్వితులు శ్రీమాన్ రామానుజాచార్యులవారు. వీరి సహోదరులైన "ఆయుర్వేద కళానిధి" శ్రీమాన్ శేషాచార్యులుగారి వద్ద ఆయుర్వేద వైద్యశాస్త్రాన్ని అభ్యసించి అచిరకాలములోనే శాస్త్ర పరిపూర్ణతను పొందినారు. ఈపూరు (కొల్లూరు మండలము) వాస్తవ్యులు శ్రీవైఖానస ఆగమశాస్త్ర పండితవరేణ్యులు శ్రీమాన్ దేవయజనం వేంకట్రామాచార్యులువారి వద్ద శ్రీమద్వైఖానస భగవచ్ఛాస్త్రమును, కర్షణాది ప్రతిష్ఠాంతమును అభ్యసించి అచిరకాలములోనే ఆగమ ప్రావీణ్యతను పొందినారు. శ్రీవైఖానసాగమముతోబాటు శ్రీ పాంచరాత్రాగమము -

శైవాగమము మొదలగు వివిధ ఆగమశాస్త్రములలో సహితం పాండిత్యమును పొందిన మహామహిమాన్వితులు శ్రీ ఆచార్యులవారు.

మరియు ఉల్లిపాలెం గ్రామవాస్తవ్యులైన క్రమాంత స్వాధ్యాయపరులగు బ్రహ్మశ్రీ రాయప్రోలు పున్నావధాన్లుగారి వద్ద వేదాధ్యయమును చేసి వేదపండితులుగా మన్ననలనందినారు. శ్రీరామానుజాచార్యస్వామివారు ప్రధానాచార్యత్వముతో దేశములో నలుమూలలా శ్రీమద్వైఖానస శాస్త్ర విధియుక్తముగా శతాధిక దేవతా ప్రతిష్ఠలు జరుపబడినవి. జ్యోతిషము, ఖగోళశాస్త్రములందు అమోఘమైన పాండిత్యప్రకర్షగలిగిన మహాపండిత వర్గమునకు చెందిన "శిష్ట్లా" వారి వంశములోని బ్రహ్మశ్రీ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రి అవధాన్లుగారి వద్దమరియు వారి పుత్రులు బ్రహ్మశ్రీ కోటయ్య శాస్త్రులుగారి వద్ద శ్రీ ఆచార్యులవారు జ్యోతిషము, వాస్తు శాస్త్రాలను క్షుణ్ణముగా అభ్యసించినారు. అచిరకాలములోనే ఆయాశాస్త్రములలో గొప్ప ప్రావీణ్యతను పొందినవారుగా గుర్తింపబడినారు. వీరి సహోదరులు శ్రీమాన్ శేషాచార్యులు గారి అనంతరము శ్రీ శ్రీనివాసదైవాగమ కల్పవల్లీ పాఠశాల నిర్వహణ బాధ్యతను స్వయంగా స్వీకరించి శ్రీవైఖానసాగమ శాస్త్రము - సంస్కృతాంధ్ర కావ్యాలలో సుశిక్షుతులైన పండితులుగా అనేక మందిని తీర్చిదిద్దినారు.

ఉల్లిపాలెం గ్రామమున శ్రీభూనీళా సమేతులై వెలసియున్న "శ్రీ చెన్నకేశవస్వామి" వీరి ఆరాధ్యదైవము. శ్రీకేశవస్వామి వారి ప్రేరణవల్ల రచనను ప్రారంభించి శ్రీచెన్నకేశవ శతకము పేరిట ఒక సాహితీ ప్రసూనమును అందించినారు. ఇది 1944 సం॥లో ముద్రణ రూపములో వెలసినది. తదుపరి కలియుగ ఆరాధ్యదైవమైన శ్రీ అలమేలు మంగా పద్మావతీ సమేతులై తిరుమలలో వెలసియున్న శ్రీ శ్రీనివాస భగవానుని ప్రేరణతో "శ్రీ శ్రీనివాస శతకము"ను వ్రాసినారు. ఇది 1946వ సం॥లో ముద్రణ పొందినది.

## శ్రీరామానుజాచార్యుల సమాజ - సాహిత్య సేవ

క్రీ.శ. 1936లో రేపల్లె తాలూకా నల్లూరు గ్రామములో శ్రీమాన్ భిషగ్రాజ దీవి వేంకటనరసింహాచార్యులుగారు అధ్యక్షులుగా "శ్రీ వైఖానసభగవచ్ఛాస్త్ర గ్రంథమాల" పేరుతో ఒక సంస్థ వెలసినది. ఆనాటికి అముద్రితములైయున్న శ్రీ మద్వైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంథములను సేకరించి - పరిష్కరించి - ముద్రింప జేయుట అనే ప్రధానాశయమునకు ఈ సంస్థ రూపకల్పన చేసినది. ఈ బృహత్కార్య నిర్వాహణ బాధ్యతను తమ భుజస్కంధములపై నిలిపికొనిన మహామహిమాన్వితులు శ్రీవైఖాన

సాగమ పండితవరేణ్యులు శ్రీమాన్ దేవయజనం వేంకట్రామాచార్యులు (ఊపూరు) గారు, మరియు శ్రీమాన్ నారాయణం రామానుజాచార్యులుగారు. అనాటి మేటి శ్రీ మద్వైఖానస శాస్త్ర పండితవరేణ్యులు, బాపట్ల తాలూకా అప్పిట్ల వాస్తవ్యులు తర్కవేదాంత, మహావిద్వాన్, శ్రీమాన్ పండిత వేదాంతం జగన్నాథాచార్యస్వామి మరియు తిరుమల - తిరుపతి దేవస్థానముల ఆగమశాస్త్ర పండితులు. "వైయాకరణ పంచానన" బిరదాంకితులు అగు శ్రీమాన్ పండిత రొంపిచర్ల పార్థసారథి భట్టాచార్యస్వామి వార్ల సలహా సంప్రదింపులతోను శ్రీ మద్వైఖానస సోదరుల సహకార సంపత్తులతోను శ్రీ మద్వైఖానస గ్రంథములను ముద్రించిన ఘనత నల్లూరు శ్రీవైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంథమండలి వారిదే అనుటలో అతిశయోక్తి లేదు.

అంతకు పూర్వము ఈగావారిపాలెం(తమిళనాడు)లో శ్రీమాన్ బాలకళానిధి డి. శేషాచార్యులుగారు గ్రంథ సంపాదకులుగా శ్రీవైఖానస గ్రంథమాల వెలసినది. ఈ సంస్థకు అధ్యక్షులు ఆగమ పండిత శ్రీమాన్ రొంపిచర్ల భట్టర్ శ్రీనివాస అయ్యంవార్లంగారు (అకులమన్నాడు). శ్రీవైఖానస గ్రంథమండలి వారు కూడా చాలా వైఖానస గ్రంథములను పరిష్కరించి ముద్రించిరి. గ్రంథ పరిష్కరణ ఉల్లిపాలెం శ్రీ శ్రీనివాస దైవాగమ కల్పవల్లీ పాఠశాల, పండితులు శ్రీమాన్ దేవయజనం వేంకట్రామాచార్యులు (ఊపూరు) గారు మరియు శ్రీమాన్ ఉ.వే. శ్రీనివాస భట్టాచార్యులు (కాకులపాడు) గారల ఆధ్వర్యములో జరిగెను.

ఈగావారి పాలెం శ్రీవైఖానస గ్రంథమాల మరియు నల్లూరు శ్రీవైఖానసభగ వచ్ఛాస్త్ర గ్రంథమండలి వారు సంయుక్త కృషి ఫలితముగనే మనకీనాడు శ్రీమద్వైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంథములు ముద్రితములుగా లభించుచున్నవి.

శ్రీమాన్ పండిత రామానుజాచార్యుల వారు దేవయజనం వేంకట్రామాచార్యుల వారితో కలసి నల్లూరు గ్రంథమాలా గ్రంథపరిష్కర్తలుగా కృషి సల్పినారు.

శ్రీమద్వైఖానస భగవచ్ఛాస్త్రములోనే కాక శ్రీపాంచరాత్రాగమ శైవాగమములో గూడ నిష్ణాతులైన శ్రీమాన్ పండిత రామానుజాచార్యులుగారు తమ పాండిత్య ప్రకర్షకు పరాకాష్ఠగా "శ్రీ భగవదారాధన చంద్రిక" అనే పేరుగల శ్రీవైఖానసాగమప్రోక్త అర్చన గ్రంథమును సమకూర్చినారు. శ్రీభగవదర్చనకు సంబంధించిన విషయములనే కాక ఇతరత్రా అవసరమైన ధర్మశాస్త్ర విషయములను కాలానుగుణముగా సంభవించెడి ఆయా దోషముల పరిహరించి ఆచరించవలసిన ప్రాయశ్చిత్త పద్ధతులను ఇంకా అనేక ఉపయుక్త విషయాలను క్రోడీకరించి ఈ గ్రంథమును సమగ్రముగా

రూపొందించినారు. ఇది భగవదర్చనా విషయములో విజ్ఞాన సర్వస్వముగా (Encyclopedia) విరాజిల్లుచున్నది.

నల్లూరులో వేంచేసియున్న శ్రీలక్ష్మీనారాయణస్వామివారి పాదపద్మసేవార్చనా పరులు, శ్రీవైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంథమాలా సంపాదకులు అగు శ్రీమాన్ భిషగ్రాజ వేంకటనరసింహాచార్యులవారి కోరిక మేరకు "శ్రీ లక్ష్మీనారాయణస్తవము" అను పేరిట సంస్కృతభాషలో శ్లోకరూపములో వ్రాయుటయేకాక తెలుగు వ్యాఖ్యానమును గూడా శ్రీఆచార్యులవారే వ్రాసినారు. ఇదియే వీరి తొలి సంస్కృత కావ్యము. ఈ గ్రంథాన్ని శతావధాని అభినవ జయదేవ, కవిసార్వభౌమ బిరుదాంకితులు, పొన్నూరు శ్రీభావనారాయణస్వామి సంస్కృత కళాశాల అధ్యాపకులు అగు బ్రహ్మశ్రీ శ్రీ చల్లా పిచ్చయ్య శాస్త్రిగారు ఆంధ్రభాషలో పద్యరూపముగా అనువదించినారు.

శ్రీ రామపాదసేవాదురంధరులగు శ్రీరామానుజాచార్యులవారు అందించిన రెండవ సంస్కృతకావ్యము "శ్రీరామానందలహరి" ఈ కావ్యానికి మధురకవి సాహిత్య విద్యాప్రవీణ గుంటూరులో డా॥ కె.వి.కె. సంస్కృత కళాశాలలో సంస్కృతాధ్యాపకులుగా చాలాకాలం పనిచేసిన కీ॥శే॥ శ్రీమాన్ పండిత కోగంటి సీతారామాచార్యులుగారు, ఆంధ్రానువాదమును పద్యరూపములో వ్రాసినారు. ఈకృతి కర్తే స్వయంగా ఉపయుక్తమగు అనేక విషయాలను తెల్పుచూ "శ్రీరామానందలహరి" అనే కావ్యానికి "రత్నప్రభ" అనే పేరుతో తెలుగు వ్యాఖ్యానమును సమకూర్చిరి.

1958 సంవత్సరములో గుంటూరు జిల్లా రేపల్లెలో సాహితీ సమితి సభ్యులు కవి సామ్రాట్, కవిమార్తాండ, బ్రహ్మశ్రీ పండిత నోరి నరసింహశాస్త్రిగారు, మధురకవి శ్రీమాన్ పండిత కోగంటి సీతారామాచార్యులు గారు, ఉపన్యాస చక్రవర్తి శ్రీమాన్ పండిత దీవి శ్రీనివాసాచార్యులు (రాచూరు) గారు, సహజకవి బ్రహ్మశ్రీ పండిత పాతూరి రాధాకృష్ణమూర్తిగారు మొదలగు మహాపండితుల ఆశీస్సులతో సాహిత్య విద్యాలంకార శ్రీమాన్ పండిత నారాయణం శ్రీరామాచార్యులు గారి అధ్వర్యములో "శ్రీహయగ్రీవ విద్యాపీఠము" స్థాపించబడినది. దాదాపు దశాబ్దకాలము ఈ సంస్థ దిన దిన ప్రవర్ధమానియై విరాజిల్లి అనేక మంది విద్యార్థులను విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ ఉన్నత పరీక్షలకు తర్ఫీదు నిచ్చి ఉన్నత విద్యావంతులుగా తీర్చిదిద్దినది.

శ్రీ హయగ్రీవ విద్యాపీఠము ద్వితీయ వార్షికోత్సవ సభకు అధ్యక్షత వహించిన సికింద్రాబాద్ సాహిత్య అకాడమీ కార్యవర్గసభ్యులు - సాహిత్య సామ్రాట్ - కవీంద్ర కవిసార్వభౌమ - మహోపాధ్యాయ శ్రీ శివ శంకరస్వామి వారి అధ్వర్యములో

మహాపండితుల సమక్షమున శ్రీమాన్ పండిత రామానుజాచార్యుల వారిని "విద్వత్కవిశేఖర" అనే బిరుదుతో సత్కరించినారు.

**మహాకావ్యానిర్మాణ హేతువు**

వీరి సాహితీ వనములో ఉద్భవించిన మరొక మహాకావ్యము "శ్రీరాఘవాభ్యు దయము" శ్రీమద్వాల్మీకి విరచితమైన శ్రీమద్రామాయణ మహాకావ్యాన్ని వీరు నిష్ఠాగరిష్ఠులై నిత్యముపారాయణ చేయుచుండెడివారు. శ్రీరామచంద్రస్వామి ప్రేరణవల్ల శ్రీమద్రామాయణ మహాకావ్యాన్ని ఆంధ్రభాషలో పద్యకావ్యముగా అనువదించుటకు సంకల్పించినారు.

ఈ కృషిలో ఇతః పూర్వము మహాకవులచే ఆంధ్రీకరింపడిన "శ్రీమద్రామాయణ మహాకావ్యాలను" తెప్పించి, వానిని అమూలాగ్రముగా పఠించిన పిదప "శ్రీరాఘవా భ్యుదయ" కావ్యాన్ని ప్రారంభించినారు. శ్రీమద్వాల్మీకి మహర్షి హృదయాంతర్గతమైన భావాలలో అంతరార్థమును గ్రహించి తదనుగుణంగా సంస్కృత భాషలో యున్న శ్రీమద్రామాయణ మహాకావ్యాన్ని యథాతథంగా ఆంధ్రీకరించుట వీరి కవితా నైపుణ్యాన్ని తెలియజేయుచున్నది. ఈ కథా రచన అంతయూగంగాఝరివలె సాగినది.

వీరు సంస్కృతాంధ్రములలో అనర్గళముగా కవితలనల్ల గలిగిన బహు ప్రావీణ్యులు. వీరి మరొక సంస్కృత కావ్యము "స్తుతి కౌస్తుభము" అనెడి శ్రీకృష్ణ స్తుతి స్తోత్రము. ఈ గ్రంథానికి శ్రీమాన్ పండిత కోగంటి సీతారామాచార్యులు గారు శ్రీమాన్ పండిత నారాయణం శ్రీరామాచార్యులగారు సంయుక్తముగా ఆధ్యాత్మిక పరమైన వివిధ విషయాలను జోడించి "వైజయంతి" అనే పేరిట సమగ్రవ్యాఖ్యానము వ్రాసినారు.

శ్రీ మద్ధన్వంతరీ అష్టోత్తరశతము, సహస్రనామ స్తోత్రము, శ్రీచెన్నకేశవ సుప్రభాతము మరియు కరావలంబ స్తోత్రము, శ్రీమద్ధన్వంతరీ కరావలంబస్తోత్రము, శ్రీమద్విఖనసాచార్య సుప్రభాతము మొదలగు స్తోత్రముల సమాహారమే "స్తుతి ముక్తావళి"

1. మహాభారతము నందలి అశ్వమేధ పర్వాంతర్గతమైన బభ్రువాహనుని చరిత్రనాధారముగా చేసికొని సృష్టించిన రమణీయ దృశ్య (శ్రవ్య)నాటకము "బభ్రువాహన విజయము" 2. భాగవతము - హరివంశ కావ్యములలో సంక్షిప్తముగా నున్న ప్రద్యుమ్న - శంబరాసుర వృత్తాంతమును కథాంశము గైకొని "మాయావతి

విజయము" అను పేరిట మరొక దృశ్య (శ్రవ్య) నాటకము 3.అట్లే "సుచంద్రీయము" అనే ప్రబంధకావ్యము. క్షణదోదయ మహారాజు వృత్తాంతాన్ని తీసికొని ఆ కథా భాగమునకు అపూర్వమైన పాత్ర సృష్టి చేసి ఆద్యంతము రమణీయముగా నుండునట్లు మలచిన మరొక దృశ్య (శ్రవ్య) నాటకము "సుచంద్రీయము" వీరి రచనలే!

బాలబాలికలకు నీతి విషయాలను - సూక్తులను బోధించుటకు సులభశైలిలో వ్రాయబడిన కందపద్యముల సమాహారమే "కృష్ణశతకము" మరియు లక్ష్మీదేవిని స్తుతించుచూ ఆంధ్రభాషలో వ్రాయబడిన సీస పద్యముల సమాహారమే "పద్మను భూతి". ఇవి అన్నియు శ్రీనారాయణం రామానుజాచార్యుల వారి ఇతర రచనలు.

అనేక సంవత్సరములు ఆధ్యాత్మికమైన అకుంఠిత దీక్షతో సాగిన శ్రీఆచార్యుల వారి రచనా వ్యాసంగపు ప్రతిరూపమే ఈ "శ్రీరాఘవాభ్యుదయ" మహాకావ్యము. దీనిని బాలకాండ ఆదిగా యుద్ధకాండ వరకు సుందరమైన కావ్య రూపములో అందించినారు. వీరు ధన్యజీవులు.

వీరు దుందుభినామ సంవత్సర చైత్ర శుద్ధపాడ్యమి (26-3-1982 శుక్రవారము రేవతి నక్షత్రం) విష్ణు సాయుజ్యమును పొందినారు. వీరి నిర్యాణముతో సాహితీ లోకమున మరొక తార కనుమరుగైనది. ఉల్లిపాలెంలో సాహిత్యకౌముది వీరి కనుమరుగుతో కొద్దిగా కాంతి హీనమైనది. వీరి సహధర్మచారిణి శ్రీమతి రామశేషమ్మ గారు. వీరు భర్త అడుగుజాడలలో నడచిన మహాసాధ్వీ శిరోమణి. వీరు 1992వ సంవత్సరములో పరమపదసోపానమును అధిరోహించినారు.

వీరి వాత్సల్యపుత్రిక లక్ష్మీ తాయారమ్మగారు మరియు వీరి ఏకైక పుత్రుడు ఈగ్రంథ సంపాదకులు లక్ష్మీనరసింహాచార్యులు. నేటికీ వీరు సాహిత్యరక్షణ - పోషణను చేయుచున్నారు.

ఈ కావ్య సృష్టిచేసిన శ్రీమాన్ పండిత నారాయణం రామానుజాచార్యులు గారి జీవిత కాలములోగాని తదుపరి వారి పరమ ఆప్తులైన శ్రీమాన్ పండిత కోగంటి సీతారామాచార్యులుగారు మరియు శ్రీమాన్ పండిత నారాయణం శ్రీ రామాచార్యులు గారి హయాములోగాని ఈ గ్రంథముద్రణ చేసి వారి కరకమలము లందు సమర్పించుటకు అశక్తుడనైతిని. ఆభాగ్యము ఈనాటికి శ్రీవేంకటేశ్వరుని అనుగ్రహంతో లభించినది.

శ్లో. శ్రీశ్రీనివాస చరణాంబుజచంచరీకం
శ్రీరామదేశిక సుతం కవి సార్వభౌమం
వైఖానసాభిజన సింధు శశాంక మూర్తిం
రామానుజార్య మనిశం ప్రణమామి మూర్ధ్నా.॥

ఉల్లిపాలెం. ఇట్లు
సాహితీసదనము భవద్విధేయుడు,
ది. 7-5-2001. నారాయణం లక్ష్మీనరసింహాచార్యులు
సంపాదకులు.

**Dr. Vedantam Srivishnubhattacharya,** ✆ : Off. 20859
M.A. Ph.D., Res. 24090
Lecturer in Temple Culture,
Rashtriya Sanskrit Vidyapeetha,
(Central Sanskrit University)
Tirupathi - 517 507, Chittoor Dist. A.P.

శ్రియైనమః
శ్రీ విఖనసమహాగురుభ్యోనమః

# ప్రణామాః

భరద్వాజకులోద్భూతం విద్వత్కవిసుశేఖరం,
ఆచార్యానుజరామార్యం వందే కేశవతత్పరం

సాహిత్యవాసే విబుధైకమధ్యే
రామానుజాచార్య మహానురాగాః
సుకావ్య నిర్మాణ సమర్థశీలాః
లసంతి విద్వత్ కవిశేఖరాగ్రాః.

క్షీరాబ్ధి శ్రీరామ సుచంద్రబభ్రుః
పద్మానుభూతేః శరణాఖ్య విష్ణుః
మాయావతీ కృష్ణకథానికానాం
తేషాం చ నిర్మాణ పటో నమస్తే.

రాఘవాభ్యుదయం కావ్యం
అలంకార రసాన్వితం
రామార్యలిఖితం చైతత్
సజ్జనాన్ భువి రంజయేత్.

# చంద్రునకొక నూలుపోగు

శ్రీమాన్ దీవి రఘురామ చక్రవర్తి,M.A.,
తెలుగుశాఖ, జ్యోతి కాలేజి, విజయవాడ.

శ్లో. అనిందితాచార మనన్యభాజనం,
దాస్యైకనిష్ఠం కరణత్రయేణ
అనారతం శ్రీహరిపాదపద్మయోః
భజామి వైఖానసమాదివైష్ణవమ్.

అని స్వయముగ విశిష్టాద్వైత మతప్రచారకులగు శ్రీరామానుజాచార్యులవారు ప్రశంసించిన సనాతన వైఖానస వంశమున, శిష్టాచార కుటుంబమున జన్మించిన శ్రీమాన్ నారాయణం రామానుజాచార్యులవారు గీర్వాణాంధ్ర సంప్రదాయ విద్వత్కవులకు సుపరిచితులు. గుంటూరు జిల్లాలోని రేపల్లె పట్టణ సమీపమున గల ఉల్లిపాలెం గ్రామములోని ప్రాచీన చెన్నకేశవదేవార్చకులుగా వీరు ధన్య జీవితమును గడిపి, పరమపదగామియయిరి. ఆయుర్వేదవైద్యము, సేద్యము, వాస్తు జ్యోతిషాదిరంగములలోనే గాక, శ్రీ వైఖానసకల్పసూత్రాధ్యయ నాధ్యాపనము లందును, దేవాలయ ప్రతిష్ఠాదిక శ్రౌతక్రియా నిర్వహణము లందును పరిపూర్ణ ప్రజ్ఞాదక్షులై సుప్రసిద్ధులయిరి. శ్రీవైఖానస భగవచ్ఛాస్త్ర గ్రంథమాల (నల్లూరు) వారికి వీరు చేసిన సేవ ఇంతింతనరానిది. ప్రతి గ్రంథమును బహు ప్రయాన కోర్చి రచించి, పరిష్కరించి, సమగ్రముగ శాస్త్ర మర్మములను అధస్సూచికలందు వివరించి, ముద్రణ యోగ్యముగ వారికి అందించిన శ్రీఆచార్యులవారి కృషి అనన్య సాధ్యమయినది. ప్రతి గ్రంథము శ్రీవైఖనసాగమమునందు ఆచార్యులవారికి గల కూలంకష ధిషణాసంపత్తిని తెలుపుచున్నది. పాంచరాత్రాది అగమములందును, బహుపురాణేతిహాస ధర్మశాస్త్రాదులందును వీరికి గల వైదుష్యము అపారమయినదని ఈ కవి వ్రాసిన గ్రంథములే దీనిని నిరూపించుచున్నవి. సామాన్యముగ కవులందరు పండితులు కాలేరు. పండితులందరు కవులు కాలేరు. కానీ శ్రీరామానుజాచార్యుల వారు విద్వత్కవిశేఖరులుగా సమకాలపు వారిచే ప్రశంసింపబడిరి. ఎంత గొప్పగా కవిత్వము వ్రాసినను సమకాలపువారలుమెచ్చరని గదా చేమకూరివారు ఆవేదనపడిరి! శ్రీరామానుజాచార్యులవారు ఆంధ్రభాషలో పౌరాణిక నాటకములను, భక్తిరస నిర్భరములు, నిసర్గ కవితాఝురులు నయిన శతకములను, గీర్వాణవాణిలో ముక్తక

సుప్రభాతాది బహుస్తోత్రములను ప్రాచీనాచార్య సంప్రదాయ ధోరణిలో వ్రాసి, అద్యతన సంస్కృతాంధ్ర కవి పండిత ప్రశంసలనందిరి. రసజ్ఞ కర్ణామృతముగా వీరు సహృదయ లోకమునకందించిన 'శ్రీరామానందలహరి' అను శ్రీరామసన్తుతి కావ్యమొక్కటి పఠించిన చాలును - ఈ కవి యెంతటి సహజ భక్త కవివతంసుడో తెలియును.

శ్రీ రాఘవాభ్యుదయ మహాకావ్య రచన ఈ కవి జీవితమున ఒక మహోత్కృష్టము, పురాకృత బహుసుకృతలబ్ధమునయిన సన్నివేశముగా చెప్పవచ్చును. ఎంతో కొంత కవిత్వమునల్లుట నేర్చిన ప్రతి కవి శ్రీరాముని దివ్య చరిత్రను వ్రాసి, తన లేఖినిని పవిత్రీకరించుకొనవలెనని తపించుచుండుట లోకమున సహజము. అందువలననే ఆంధ్రకవిత్వమారంభమయిన నాటి నుండి లెక్కకు మించిన రామాయణములు తెలుగున ఆవిర్భవించుచున్నవి. "మరల నిదేల రామాయణంబన్నచో---" అని శ్రీవిశ్వనాథవారు ఇన్ని రామాయణాలు ఎందుకో చక్కగా కారణమును చెప్పి యున్నారు. "తనదైన అనుభూతి తనదిగాన" ఈ కవి గూడ రామాయణమును వ్రాసికొనిరి.వాల్మీకిరామాయణమునుయథాతథముగపద్యరూపమున హృదయముగా వ్రాసిన కవులు చాలా అరుదు. అటువంటి వాల్మీకి విధేయులలో ఈ కవి ఒకరు. ఆ వాల్మీకీయేతివృత్తములు తెలుగు రామాయణములలో చొరబడి, అసలు వాల్మీకి రామాయణములో ఉన్న ఘట్టమేదో, లేనిదేదో తెలియని పరిస్థితి ప్రాచీన కాలముననే యేర్పడినది. ఈ కవి యథాతథముగ వాల్మీకి రామాయణమును అనుసరించిరి. శ్రీరాఘవాభ్యుదయమును చదువుచున్నచో భాస్కర రామాయణమో, పోతన భాగవతమో తప్పక స్మృతిపథమున మెదలును. కవి స్వయముగ రామోపాసకు డగుట వలన ఆ రామభద్రుడే ఈ కవికలమును నడిపించినాడు. అందువలననే ఇంతటి రసభావపరిపుష్టమై, లలితశబ్దాలంకార సౌందర్య సౌకుమార్యములను సంతరించుకొని వీరి కవితాకన్యక రసజ్ఞ హృదయానందకరముగ నర్తించినది. కారణజన్ముడయిన ఏ పోతనామాత్యుని వంటి వానికో గాని ఈ మహాభాగ్యము కలుగదు. ఈ కవి తన కవిత్వముననే గాదు జీవన విధానమున గూడ సనాతన భారతీయ ఆర్షసంస్కృతిని, సదాచారమును పాటించినారు. సంస్కృతాంధ్రభాషల యందసమాన పండితుడై, ఉభయభాషలలోను నిస్తులము, ప్రశస్తము, నైసర్గికము నయిన రమణీయ కవిత్వము నల్లిన "కవి సవ్యసాచి"గా వీరిని అభివర్ణించినచో అతిశయోక్తికానేరదు. పుష్కల ప్రతిభావ్యుత్పత్తి సంపన్నుడయి, బ్రాహ్మీ

లక్ష్మీకటాక్షపాత్రుడయిన ఈ భక్తకవివతంసుడు లౌకిక ప్రచారసమ్మానాది ఆర్భాటములకు సుదూరమున నిలచి, నిరాడంబర జీవితమును గడుపుట నేటి లోకపుపోకడకలవాటు పడినవారికి అబ్బురముగనే ఉండునేమో? "ఆకులందున అణిగిమణిగి, కవితకోయిల కూయవలెనోయ్" అన్న శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రి గారి మాట గుర్తుకు వచ్చును.

"కాలోహ్యయం నిరవధిర్విపులా చ పృధ్వీ" కనుక కవిత్వము నిర్దుష్టము, నైసర్గికము నయినచో అనంతకాల వాహినిలో, విశాల ప్రపంచములో దాని విలువ దానికుండును. "న రత్నమన్విష్యతి మృగ్యతే హి తత్" అని గదా కవికులగురువగు కాళిదాసు నుడివెను. శ్రీరాఘవాభ్యుదయ కర్తయగు శ్రీమాన్ నారాయణం రామానుజాచార్యుల వారు నిరంతర భగవద్ధ్యాన తత్పరులై భగవదర్పణ బుద్ధితో కవితాకుసుమములను మాలలుగ నల్లి, వాచిక తపస్సుచేసి తరించిరి. వీరు పరమ పదమునకు చేరుకొని, లక్ష్మీ విశిష్టుడయిన నారాయణుని సేవలో నిమగ్నులయి చాలాకాలమయినది. అయినను "జయంతి తే సుకృతినో, రససిద్ధాః కవీశ్వరాః నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయం" అని భర్తృహరి నుడివినట్లు ఈ కవి యశః కాయులై ఆచంద్రతారార్కము కవిపండితమార్తాండుడై ప్రకాశించు చుండును.

ఆ మహనీయుని వ్యక్తిత్వమును గురించి గాని, కవిత్వమును గురించిగాని జడమతినయిన నావంటివాడు వివరింపబూనుకొనుట హాస్యాస్పదమని తెలిసినను, వారియందు నాకుగల పూజ్య భావప్రేరణ కారణమున సాహసించినాను. చంద్రునికో నూలుపోగు సమర్పించినట్లు ఆ సుకృతాత్ముని పదసన్నిధి నొక్క పద్య ప్రసూనమును ఉపదగ సమర్పించుచున్నాను.

సీ. వైఖానసాగమపాథోధి నెవ్వాడు
మథియించి యాజకమాన్యుడయ్యె
కేశవపాద పంకేరుహాకర్షిత
భృంగమై యెవ్వాడు వివశుడయ్యె
సంస్కృతాంధ్రోభయసత్కావ్యనిర్మాణ
దక్షుడై యెవ్వాడు ధన్యుడయ్యె
బహునైష్ఠికాచారవర్తియై యెవ్వాడు
శ్రోత్రియలోకవిశ్రుతుడునయ్యె

తే.గీ. రాఘవాభ్యుదయాది సద్గ్రంథచయము
వ్రాసెనేకులపావనప్రథితు డట్టి
పరమభాగవతోత్తమపురుషుఁడలతు
ననఘు రామానుజాచార్యనహరహంబు.

ఇట్లు
సజ్జన విధేయుఁడు
దీవి రఘురామ చక్రవర్తి
విజయవాడ.

# కృతజ్ఞత

1998వ సంవత్సరములో తిరుమల శ్రీశ్రీనివాస స్వామి దర్శనార్థమై సకుటుంబముగా తిరుమల తిరుపతి యాత్రచేసిన సందర్భమున మా అల్లుడు చిరంజీవి దీవి కమలమోహన్ ద్వారా పూజ్యశ్రీ డాక్టర్ చతుర్వేదుల వేంకట శ్రీ శివ సుబ్రహ్మణ్యశర్మ గారి పరిచయ భాగ్యము ఏర్పడినది. శ్రీ శర్మగారు సాహితీవేత్తలు మీదు మిక్కిలి స్నేహశీలురు. శ్రీవిద్వత్కవిశేఖరుని ముద్రిత కృతులనన్నింటిని వారికి నేను అందజేసితిని. సాహిత్య పిపాసులురగు వారు వాటిని ఆమూలాగ్రముగా పఠించి శ్రీరామానుజాచార్యుల వారి కవితా వైశిష్ట్యానికి ఎంతో ముగ్ధులైరి. శ్రీశర్మగారితో సంభాషించుచున్న సమయములో అముద్రితముగా నున్న ఈ "శ్రీరాఘవాభ్యుదయ" కావ్యమును గూర్చి చర్చించుట జరిగినది. గ్రంథముద్రణ విషయమై శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానములకు అర్జీ పంపు కొనవలసినదిగా సలహానిచ్చిరి. వారి సూచన మేరకు దేవస్థానపు అధికారులకు విన్నవించుకొంటిని. శ్రీశ్రీనివాసుని కృపాకటాక్ష వీక్షణములు మాపై ప్రసరించుటవల్ల కాబోలు దేవస్థానమువారు వెంటనే స్పందించి ఈ గ్రంథముద్రణకై ఆర్థిక సహాయమును జేయుటకు ఆమోదించి రూ. 17,965/- లకు మాత్రమే అనుమతి నొసంగితిరి. ఇందుకు టి.టి.డి. దేవస్థానపు పరిపాలకవర్గ మంతటికిని మాధన్యవాదములు.

శ్రీచతుర్వేదులు వేంకట శ్రీ శివ సుబ్రహ్మణ్యశర్మగారు ఈ శ్రీరాఘవాభ్యుదయ కావ్యాన్ని ఆమూలాగ్రముగా భక్తిశ్రద్ధలతో పఠించి శ్రీవిద్వత్కవిశేఖరుని కవితావైశిష్ట్యాన్ని గ్రహించిన మహామనీషులు. మేము కోరినంతనే అత్యుత్సాహముతో బాలకాండ ప్రథమ భాగమునకు "పీఠిక" (సంజీవిని) వ్రాయుటకు ఆమోదించుట మహా భాగ్యముగా నేను భావించుచుంటిని. తిరుపతిలోని శ్రీవేంకటేశ్వర విశ్వ విద్యాలయములోని ఓరియంటల్ రీసెర్చి ఇనిస్ట్యూట్‌లో ఉద్యోగరీత్యా బహు కార్యక్రమ నిర్వహణలో నిమగ్నమైయుండి కూడా మాపై ప్రత్యేక అభిమానముతో గ్రంథ ముద్రణ సమయములో అత్యంత శ్రద్ధ వహించి అక్షర స్ఖాలిత్యములు లేకుండా ఎంతో ఓర్పుతో పరిశీలన జరిపిన పూజనీయులు శ్రీశర్మగారు. వారికి మా కృతజ్ఞతాభివందనములను సమర్పించుకొనుచున్నాను.

సాహిత్యాభిలాషులు, స్నేహపాత్రులునగు, శ్రీజమ్ములమడక శ్రీహరిప్రసాద్ గారి పరిచయ భాగ్యము కూడా నాకు ఆనాడే లభించినది. శ్రీశర్మగారి వలెనే వీరు గూడా గ్రంథ ముద్రణకు అవసరమైన మేటి సలహాలను ఎప్పటికప్పుడు మా కొసంగుచూ మమ్ము ప్రోత్సహించుట మా అదృష్ట విశేషము.

శ్రీ శర్మగారు శ్రీ ప్రసాదుగారల సమష్టి కృషి ఫలితమువలననే ఈ శ్రీరాఘవాభ్యుదయ కావ్యము ముద్రణ రూపము నొందినది.

ఈ గ్రంథాన్ని సుందరమైన రీతిలో మలచుటలో శ్రీ ప్రసాద్‌గారి మేధస్సు అమోఘమైన దనుటలో అతిశయోక్తి కానరాదు. వీర్కి మా నమస్సుమాంజలులు.

డా॥ వేదాంతం శ్రీవిష్ణుభట్టాచార్యులగారికి, శ్రీమాన్ దీవి రఘురామ చక్రవర్తిగారికి వారి వారి అభిప్రాయములను పంపినందులకు కృతజ్ఞతలు.

ముద్రణ విషయమున ప్రత్యేక శ్రద్ధ తీసికొనిన వాణీ ప్రెస్ (విజయవాడ) అధిపతియగు శ్రీమాన్ అగ్నిహోత్రం రంగాచార్యులు గారికి నా కృతజ్ఞతాంజలులు.

నాలో నిద్రాణమైయున్న చిరకాల వాంఛితాన్ని వెన్నుతట్టిలేపి ఈ గ్రంథముద్రణకు మొదటి నుంచీ అత్యుత్సాహముతో అన్ని విధముల సహకరించిన సహకరించుచున్న చిరంజీవి మా అల్లుడు దీవి వెంకట కమలమోహన్‌కు శుభాశీస్సులు. శ్రీహనుమత్ సీతా లక్ష్మణ భరతశత్రుఘ్న సమేతులైన శ్రీరామ చంద్ర ప్రభువు ఈ చిరంజీవుల కుటుంబాలకు ఆయురారోగ్య భోగభాగ్యములతో బాటు సత్సంతానాన్ని అనుగ్రహించుగాత!

డా॥ నారాయణం లక్ష్మీ నరసింహాచార్యులు, H.M.M.S.
సంపాదకులు.

ఉల్లిపాలెం,
7-5-2001.

# విషయసూచిక



శ్రియై నమః

శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణే నమః

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామ చన్ద్ర పరబ్రహ్మణే నమోనమః

శ్రీ మద్విఖనసే నమః

## సకలదేవతాస్తుతిరూపమంగళాచరణము :-

చం. అనుపమదివ్యమంగళ గుణాస్పదమై భవపద్మసంభవా
ద్యనిమిషభక్తకోటి హృదయాబ్జమధువ్రత రాజరాజమై
ఘనదురితాటవీవిలయకాలమహానలమై యెలర్చు శ్రీ
ఫణిపతిశైలనాధు పదపద్మయుగంబుఁదలంతు నెమ్మదిన్.

సీ. క్షీరవారాశి యేనీరజాతాక్షికిఁ
ప్రభవకారణమౌచుఁ బరిఢవిల్లె
కుముదినీకాంతుఁడే ప్రమదాలలామకుఁ
దమ్ముఁడై ద్విజపతిత్వమ్మునొందె
మురనరకారి యే వరవర్ణినిం గూడి
సకలాబ్జజాండ పూజ్యతవహించె
పరమేష్ఠి యేమహాకరుణామయికిఁ బుత్రుఁ
డై లోకసృష్టిఁదా నధిగమించె

తే.గీ. భువన జన్మస్థితి ధ్వంసములనవరత
మే మహాదేవిలీలలై యెసఁగుచుండె
నట్టి లోకైకమాత దివ్యాబ్జజాత
శుభగుణవ్రాత ననుఁ గృపఁజూచుఁగాత.

**శ్రీ శారదా స్తుతి :**

ఉ. శారద నీరదాభయగు శారద, మద్రసనాగ్రమందు సం
చారమొనర్చుచున్ మధురశబ్ద రసార్థ విశేషభావ గం
భీరగుణాళిరీతి రుచిభేదములొయ్యనఁగూర్చి సత్కృపా
నీరధియౌచు నాకృతి ననిందితఁగాఁదగఁజేయుఁగావుతన్. 3

**శ్రీ విఖనసస్తుతి :**

సీ. జగదీశుచిత్తసంజాతుఁడై యలరారి
తచ్ఛాసనంబు నౌదలధరించి
చనుదెంచి నైమిశవనమున భృగు కశ్య
పాత్రిమరీచ్యాదిధాత్రగణము
భజియింపఁ గృపఁజేసి భగవదేకపరంబు
లౌ సూత్రరత్న దివ్యాగమముల
సకల వైష్ణవమత స్థాపకాచార్యుఁడై
పూజ్యుఁడై పదునాల్గు భువనములకు 4

తే.గీ. సత్యధర్మబలైశ్వర్యసమితిఁ గూర్చి
నట్టి, విఖనస యమికులపట్టభద్రుఁ
డిచ్చుఁగావుత మత్కృతికీడులేని
చిత్రతరభావసందోహ జృంభణంబు. 5

సీ. కైలాసశిఖరిపైఁ గాలాంబుదముమాడ్కి
నీలజటాబంధ నియతియొప్ప
శంపాలతాయుక్త, శరదభ్రములరీతి
దివ్యోర్ధ్వపుండ్రముల్దీప్తులీన
నుష్ణాంశుసఖునిలోఁగృష్ణసారముపోల్కి
పద్మాక్షమాలిక ప్రభలనింప
మిన్నువాకంగూడియున్న శోణంబోలి
కాషాయశాటిసత్కాంతిఁజెలఁగఁ

తే.గీ. గుండల బ్రహ్మసూత్ర త్రిదండశృంఖ
లాంగుళీయకహారవిరాజమానుఁ
డగుచు విఖనసమునివరుండనవరతము
మన్మనః పీఠిఁ గొలువుండి మనుచుఁగాత. 6

**విష్వక్సేన స్తుతి**

ఉ. శాంతుని, భక్త మానసనిశాంతుని! సర్వకిరీట సుప్రభా
కాంతుని, వాసుదేవపరికల్పితసైన్యపతిత్వరాజిత
స్వాంతుని, శక్తిదండధర చక్రజితప్రతివైరివీర శు
ద్ధాంతునిగొల్తు, మత్కృతి, నితాంతశుభాంతమునై వెలుంగగన్. 7

**శ్రీ శేష స్తుతి :**

ఉ. శేషుని, మౌళిభాగమణి చిత్రరుచిప్రకరోల్లసన్మహా
వేషుని, భక్తి తత్తహత విస్మృత పూర్వభవానుబంధదు
ర్దోషుని, శ్రీశభక్తి పరితోషుని, భద్రగుణానురూపసం
భాషునరోషునింగొలుతు, భావము నన్వరశబ్దసిద్ధికై. 8

**శ్రీ వైనతేయస్తుతి :**

ఉ. అండజవంశమండనుఁ దహంకృతి ఖండిత భండనక్రియా
ఖండల విక్రముండు, ఫణికాండశిరస్తటరత్నసుప్రభా
మండల మండితుండు, రిపుమర్దన పాటవవజ్రతుల్యదో
ర్దండుఁడు వైనతేయుఁడిడుతన్ మత్కృతికింజమత్కృతిన్. 9

**శ్రీ ఆంజనేయస్తుతి :**

చ. తరణికులేంద్రునాజ్ఞఁదలఁదాలిచి వారిధిదాటిలంకయం
దరసి, విదేహరాజతనయంగని, రక్కసులన్వధించి, త
త్పురముననగ్నినుంచి, రఘుపుంగవుఁజేరి, మహాప్రమోదము
న్నరపిన మారుతాత్మజుని పాదపయోజములాశ్రయించెదన్. 10

తే.గీ. కనకభూధరచారువిగ్రహుని తామ్ర
వదను, లాంగూలభూషణుఁ బారిజాత
శాఖిమూలసమాశ్రితు శ్వసనతనయు
నాంజనేయుననారతంబభినుతింతు. 11

ఉ. సాగరమొక్క గోష్పదముచాడ్పునదాటి విదేహకన్యకో
ద్వేగమనోవ్యథాగ్నిఁగొని, వ్రేల్మిడి తజ్జ్వలనంబుచే మహా
భోగిదశాస్యపట్టణముబుగ్గియొనర్చిన రామదాస! నీ
ధీగరిమంబుఁ బేర్కొను, సుధీవరులెంతటి ధన్యులో కదా? 12

**వాల్మీకి స్తుతి :**

చ. అనిశమురామచంద్రచరితామృతధారలుగ్రోలుచుండియు
న్మనమునఁదృప్తినొందక సమస్త జగంబును రామరూపమే
యని తలపోయు సాత్త్వికమహర్షివరుండగు వామలూరునం
దనుని భజింతునాత్మ విశదత్వకవిత్వపటుత్వసిద్ధికై. 13

ఆ.వె. దశరథునకు నెలమి ధరవేదవేద్యుఁడౌ
శ్రీశుఁడుదయమొందఁజెలఁగి వేద
వర్గమవతరించె, వాల్మీకి వలన, రా
మాయణాభిధానమధిగమించి. 14

**శ్రీనివాసాధ్వరి స్తుతి :**

సీ. కుండలీశ్వరువచోమండలం బెవ్వాని
భారతికావాసపట్టణంబు
గౌతమకృతవాక్యగణయుక్తులెవ్వాని
కంజభవునిరాణికందుకములు
జగతి నలంకారశాస్త్రమేమహితుని
శారదాదేవికి శయనగృహము
బాదరాయణసూత్రపంక్తి యేప్రాజ్ఞుని
నలువచెల్వకు రమ్యనాట్యశాల

తే.గీ. నిఖిలవేదమ్ములెవని వాణికి విలాస
విహరణోద్యానభూములై వెలసె నట్టి
శ్రీనివాసాధ్వరీంద్రుని చిత్తమందుఁ
జేర్చి వినుతింతు నిష్టార్థసిద్ధిఁగోరి. 15

సీ. శ్రీనివాసుఁడెవని చిత్తానువర్తియై
తలవంచి పుష్పమాలలుధరించె
భుజగాద్రినాథుఁడేపుణ్యాత్ముఁడర్థింప
భుజియించెఁ బ్రత్యక్షముగ హవిస్సు
నఖిల విమతఖండనంబునందెవ్వని
నధివసించెను వేంకటాచలేశుఁ
డపుడపుడీవెనేననుచు నేద్విజవర్యు
నలరించె వృషభనగాధిపుండు

తే.గీ. సర్వతంత్రస్వతంత్రుఁ డేనదయహృదయుఁ
డట్టి శ్రీ భాష్యకారుఁ బాపౌఘదూరు
ఘనయశోదారువైదికాగమవిహారు
వినుతిసేయుదుఁ బల్మాఱు గుణగభీరు. 16

తే.గీ. శ్రీనివాసునిఘంటాంశచే జనించి
దివ్యనిగమాగమజ్ఞాన దీప్యమాన
విగ్రహుండౌచు వెలసె నే విబుధవర్యుఁ
డట్టి వేదాంతదేశికు నభినుతింతు. 17

**సంస్కృత కవీంద్రస్తుతి :**

మ. కవితాకన్యకువన్నెపెంపునిలుపంగాఁగోరి శ్రీమన్మహా
కవిమూర్ధన్యుని గాళిదాసుని మదింగైసేసె వాధూల రా
ఘవసూరిన్ భవభూతి బాణులను హృత్కంజంబునంజేర్చి భా
రవికిన్ దండికి మ్రొక్కి మాఘకవివాక్ప్రౌఢి న్నశంసించెదన్. 18

సీ. ప్రథిత శ్రీమద్ధ్వనిప్రస్థానపరమేతి
పదపూర్వకాచార్యవరుఁడెవండు
సర్వంసహాచక్రసదనచతుష్షష్టి
విద్యాస్వయంవరవిభుఁడెవండు

నిఖిలాగమమహాంబునిధి కుమ్భసంభవు
  డని బుధుల్గీర్తింపమనెనెవండు
అఖిలవిద్వద్బృందమష్టభాషాచక్ర
  వర్తియంచనఁగఁ బేర్వడెనెవండు

తే.గీ. అట్టి వంశక్రమాగత భట్టబిరుద
యుతుని శ్రీ వేంకటేశ్వరాశ్రితుని పుణ్య
రతుని, గొల్చెదఁ దిరుమల సుతుని, లోక
హితుని, శ్రీ శ్రీనివాసదీక్షితుని, సతము. 19

ఉ. నిందకులేదు తావు గణనీయమటంచు బుధుల్వచించున
ట్లందముఁగూర్పమత్కృతికి నంచితరీతినుతించి మ్రొక్కుదా
నందము సందడిల్లఁగ, మనంబున వేమరుభక్తియుక్తి, మా
సుందరరాజసూరి వరసూనృత దివ్యకవిత్వ శక్తికిన్. 20

**ఆంధ్రకవీంద్రస్తుతి :**

ఉ. కమ్మనికైతఁ దా రకరకమ్ములనల్లి విరించిసాధ్వికిన్
సొమ్ములుగానొసంగి శ్రుతిసూక్తుల సన్నుతినల్పినట్టి, మా
బమ్మెర పోతరాట్కవి దివస్పతి నామొఱలాలకించి, చి
త్తమ్మననిల్పుఁగాత కనుదమ్ములఁగ్రమ్ము కృపారసమ్ముతో. 21

చ. నయవినయమ్ములన్నతులొనర్చి భజించు వసుంధరా కవి
త్రయమును యల్లనార్యుఁ గవిరాజశిరోమణియైన భాస్కరున్
నియతకవిత్వ సంపదభినీతయశోధను రంగనాధునిన్
స్మయరహితున్మహాసుగుణమండను వేంకట సత్కవీశ్వరున్. 22

ఉ. ధీవిభవంబునింపె దశదిక్కులలో స్వకవిత్వశక్తిచే
భావము రంగనాధు పదపంకజయుగ్మమునందుఁజేర్చి బృం
దావనవంశవార్ధి హిమధామముఁడనన్వెలుగొందె నేమహా
పావనుఁడట్టి లక్ష్మణ విపశ్చిదధీశ్వరుఁ గొల్తునిచ్చలున్. 23

తే.గీ. ఆంధ్రవాల్మీకి బిరుదంబునధిగమించి
రామచరితంబుఁదుదిముట్టవ్రాసి భువిని
ధన్యతముడైన శ్రీవాసుదాసు యశము
గణుతిసేయుదుఁ జేమోడ్చి గౌరవమున. 24

కం. శ్రీరామకథామృతమను
పేరున నొకకృతిసృజించి ప్రేమన్ జగదా
ధారుండగు గిరిశున కిడి
సారూప్యము నొందెనే విచక్షణుఁడుర్విన్. 25

ఆ.వె. అట్టి వెంకటప్పయాఖ్య విద్వన్మణి
నాత్మపీఠినిల్పి యనుదినంబుఁ
గేలుదోయి మోడ్చి కీర్తింతుఁ గవితావి
శుద్ధివృద్ధిఁగోరి బుద్ధిలోన. 26

కం. వినుతించెద శ్రీరామా
యణకర్తలనెల్ల నా హృదంతరమందున్
ఘనతరభక్తిం దత్పద
వనజంబులునిల్పి కవిత వర్ధిల్లంగన్. 27

కం. అంచితగతి వినుతించెదఁ
బంచాశద్వర్షగురుని, బ్రథమానయశో
దంచితురామస్వామ్యభి
ధాంచితు నేనహరహంబునవహితమతినై. 28

**కవివంశావళి :**

సీ. వైఖానసాభిఖ్యవంశముక్తారత్న
మని యేమహాత్ముండు ఘనతఁగనియె
వసుధదివ్యాగమవ్యాప్తి కేవిబుధుండు
పడరాని కష్టముల్పడియె సతము
శ్రీసూత్ర ధర్మవిశిష్టత నేకృతి
వివరించి చాటె నీ విశ్వమందు
స్వమతసిద్ధాంతకోశముల కే ప్రథితుండు
తన జీవితమునంకితమ్మొనర్చె

తే.గీ. నట్టి వేంకటరామార్యు నార్యవర్యు
సకలగుణధాము యాజకసార్వభౌము,
దేవయజనాన్వయాంబునిధిహిమకిరణు
నస్మదాచార్యచరణుల నభినుతింతు. 29

తే.గీ. కోలచలనారసింహాఖ్య గురువరేణ్యు
నా మనః పీఠముననిల్పి నేమమెసఁగ,
మహితతత్పాదపద్మయుగ్మమునకనిశ
మర్పణమొనర్తు భక్తి పుష్పాంజలులను. 30

తే.గీ. ధరణిగీర్వాణభాషాసుధారసాబ్ధి
శీతకిరణుని శిష్టాఘభీతిహరుని
మంత్రరత్నప్రదాతయౌ మహితయశుని
విజయరామార్యు వినుతింతు వేవిధముల. 31

కం. కారుణ్యాలంకృతవి
స్ఫారేక్షణభువనశస్తపరమగరిష్ఠా
చారునిసేవక మునిజను
భారద్వాజుం గులాధిపతిఁ బేర్కొందున్. 32

కం. నిరుపమధిషణాజలనిధి
సురుచిరతత్త్వార్థ ఖనన శోభావృతుఁడు
న్వరనారాయణసుధిపెం
పురహింపఁగ మాకు మూలపురుషుండయ్యెన్. 33

తేగీ. అందుచేఁగాదె నారాయణాఖ్యనొంది
యవనిరాజిల్లుటస్మదీయాన్వయంబు
ఏతదన్వయ జలధిపూర్ణేందుబింబ
మైన నారాయణార్యునేనభినుతింతు. 34

సీ. అఖిల విద్యాప్రౌఢుఁడగుననంతార్యుఁడే
ధన్యుపితామహుతంత్రితంత్రి
ధీరుఁడౌ వేంకటనారాయణాచార్యు
డేమాన్యవరుఁబ్రపితామహుండు

విశ్వపూజితుఁడైన వేంకటయోగి యే
ధరణీసురాచార్యవరుని తాత
వేదశాస్త్ర పురాణవిమలీకృత స్వాంతుఁ
డౌరామసూరి యే యనఘుతండ్రి 35

తే.గీ. వివిధసద్గుణ వల్లి! సాధ్వీమతల్లి!
గురుతపోవ్రత ధర్మాదిపరమనియత
చిత్తయైవెల్గు సీతాంబ చెన్నుమీర
నెన్నికంగన్న యే ప్రాజ్ఞుఁగన్నతల్లి.

సీ. అజునవతారమాయని యాగమజ్ఞులు
తడఁబడుచుందు రే ధన్యుఁజూచి
ధిషణుఁడా యని యే సుధీవరున్గనుఁగొని
సిద్ధాంతులెదభీతిఁ జెందుచుంద్రు
క్షితియందు సాక్షాద్వశిష్ఠుఁడంచునెవనిఁ
దలపోసిఁ యాజకుల్దండమిడుదు
రపరభరద్వాజుఁడౌనని నిష్ఠాత్ము
లే మహామహుని భజించుచుందు

తే.గీ. రట్టి శ్రీరామదేశికునస్మదీయ
జనకు నెదనెంచి తత్పాదజలజములకు
బ్రణతితతినర్పణముఁజేసి ప్రస్తుతింతు
మత్కృతికివన్నెఁబచరింప మహితనియతి. 36

ఉ. ఉల్లమునందు శ్రీవిభుశుభోజ్జ్వలపాదపయోజభక్తిసం
ధిల్లఁగజేసి సత్త్వగుణదీప్తివహించి రహించినట్టి మా
తల్లికి, లక్ష్మినర్సమకుదారచరిత్రకు, భక్తిమ్రొక్కుదు
త్ఫుల్లమనోబ్జమందిడి ప్రమోదభరంబునమాటిమాటికిన్. 37

ఉ. మాపినతండ్రియౌ విబుధమండను శ్రీనరసింహదేశికు
శ్రీపతిపాదపంకజ వశీకృతమానసు నార్యవంద్యు ని
ష్పాపచరిత్రు నాగమవిశారదు నాశ్రితవత్సలున్గులో
ద్దీపకునిన్ సతంబు వినుతించెద వాక్పరిశుద్ధిఁగోరుచున్. 38

ఆ.వె. కన్నతల్లి కన్న మిన్నయై సాఁకిన
తాతపాదనహజుధర్మపత్ని
వేంకమాంబయనఁగవిఖ్యాతయైన మా
పిన్నతల్లి నెపుడుసన్నుతింతు. 39

కం. లక్ష్మణ యోగికి నెనయన
లక్ష్మీపతిపాదభక్తిలక్షణుఁడౌ మా
లక్ష్మణదేశికు నగ్రజు
సూక్ష్మస్వాంతుందలంతు శుభఫలమునకై. 40

సీ. వాస్తువిద్వన్మనోవనజాకరాంతర
రాజహంసమనంగ రహిఁజెలంగి
వైష్ణవాగమశాస్త్రవార్థికుంభోద్భవుం
డని సుప్రసిద్ధకీర్తిని వహించి
వసుమతి నవరధన్వంతరియని భిష
క్కులలోనరించుమన్ననలఁగాంచి
గణితకోవిద శిరోమణియని ప్రఖ్యాతి
నఖిలదేశములందునధిగమించి

తే.గీ. వసుధ వఱలిన శేషార్యవర్యు నస్మ
దగ్రజన్ముని దివ్యపాదాంబురుహము
లాత్మపీఠంబుపైనిల్పి యనుకలంబు
భక్తి బద్ధుండనై కొల్తు శక్తికొలఁది. 41

ఉ. ప్రీతిమెయిన్ నిజాంకతలపీఠములందిడి గారవించుచు
న్మాతకుఁజాలినట్టి దయమాటికిఁజూపుచుఁ బ్రోచినట్టి స
త్పూతచరిత్రలన్, సుగుణభూషల, వేంకటనర్సమాభిధా
ఖ్యాతల సోదరీమణులనంజలిఁజేసి భజింతునిచ్చలున్. 42

కం. ఇలలో శ్రీ వైఖానస
కులమునజన్మించినాఁడ, గురుతరభక్తిన్
గొలిచెద మధుసూదనుపద
జలజంబు లనారతంబు శరణమటంచున్. 43

**కవిసంకల్పము :**

కం. రామానుజాభిధానుఁడ!
సామాన్యుఁడఁ సర్వలోక శరణుండగు శ్రీ
రాముని శుభచారిత్రము
బ్రేమన్వర్ణింప మనసు ప్రేరేపించెన్. 44

కం. ఇది కేవలదైవికమని
మదిలో నుప్పొంగి, పొంగి, మాటికి భద్రా
స్పదమగు రామచరిత్రము,
ముదమున నామూలచూడమును దలపోయన్. 45

కం. శ్రీరాఘవాభ్యుదయమను
పేరుననొకకృతినమర్చి పేర్మి ధరిత్రిన్
కారుణ్యమూర్తి వృషగిరి
శౌరికి నర్పింప మనసు సంకల్పించెన్. 46

శా. ఈ సంకల్పముఁ గల్గఁజేసినది నాకీనాఁడు భక్తావనా
భ్యాసుండైన రమావిభుండగుటచే బాధ్యుండతండేయగున్
నా సారస్వతమందునిల్చి జనితానందంబుతో నిచ్చలున్
దోసమ్ముల్లమయించి శబ్దవితతిన్ దోర్త్రో స్ఫురింపింపఁగన్. 47

కం. మందాత్ముఁడనగు నేనే
చందంబున రామచరిత సరగున వ్రాయం
గ్రందుకొని కలముఁబట్టుదు
వందారుస్తుత విలాస! వననిధివాసా! 48

కం. కరణత్రయశుద్ధిగ మీ
చరణాంబుజసేవఁజేయు జనముల కరయన్
నిత్యముఁ గరతలగతమగు
టరుదా? దుర్ఘటన ఘటనమని మొదలిడితిన్. 49

**కృతిపతిస్తుతి :**

కం. భూరేణువు మేరువగున్!
మేరువుభూరేణువగును! మేదిని యుష్మ
త్కారుణ్య వీక్షణంబున
శౌరీ! యీ కార్యమెట్లు సల్పించెదవో! 50

కం. రామావతారమున నీ
వేమేమి యొనర్చినాఁడ విల నవినాచే
ప్రేమన్ వ్రాయించఁగ నిను
వేమరువేఁడెదను భక్తి వేంకటనాథా! 51

సీ. ఆనందనిలయంబునందు వేంచేసి నీ
వనుపమభోగంబులందుచున్న
నిజభక్తులొనరించు నిత్యకల్యాణోత్స
వంబులఁజిక్కి నీ వలరుచున్న
మ్రొక్కుబడులసొమ్ము లెక్కించువారలం
బెక్కుమాఱులరసి చొక్కుచున్న
అపరాధకానుకలందుటకెవ్వేళ
నిద్రింపఁదీరక నిలిచియున్న

తే.గీ. నెట్టులైనను నీపనుల్గట్టిపెట్టి
కడకు దినమున కొకఝాముకాలమైన
వచ్చి నా జిహ్వపైనుండ నిచ్చగింప
వేని కడతేరదీకృతి వేంకటేశఁ. 52

చ. సదయుఁడవైన నీచరణ సారసయుగ్మమునమ్మి రాఘవా
భ్యుదయము నే రచింపమదినూనితి నీ భువి సాటివారిలో
ముదమలరింపఁజేసి యశమున్గొని దానునకిచ్చి మెచ్చెదో,
హృదయమునందు నిర్దయవహించి హసించెదొ వేంకటేశ్వరా! 53

**కావ్యప్రస్తావన :**

తే.గీ. ఇలను వాల్మీకిముఖ్యుల కిట్టి యూహఁ
గలుగఁ జేసినఁ జేసినఫలముగల్గెఁ,

గోరికోరి నిరక్షరకుక్షినైన
నాకొసంగితివేల? యీనాఁడు శ్రీశ! 54

తే.గీ. హాస్యమునకైనచో నెదురాడఁజాల
కాక పరిపూర్ణకృపనీకుఁ గల్గెనేని,
నెంతశ్రమఁజెందునో, భవత్స్వాంత మకట
యీ ప్రబంధముఁజెప్పి వ్రాయించుటకును. 55

ఆ.వె. కట్టఁజేతఁగాని కాంతకు నొక్కర్తు
పట్టుపుట్టమెరవుపెట్టి, పీఁటఁ
బట్టి తిరిగెనన్నభంగి కాదొక్కొ నీ
విట్టి బుద్ధి నొసఁగితిపుడు నాకు. 56

ఆ.వె. ఐనదేమొయయ్యొ నఖిలేశ! మద్వచః
పదవినిల్పి కీర్తిఁబడయుమయ్య
అస్మదీయ యత్నమణుమాత్రమైనలే
దిందు నెందుకిఁకముకుంద! జాగు. 57

తే.గీ. రాఘవాభ్యుదయంబుచే రాఁగలట్టి
మంచి చెడ్డలు నీవె, ముమ్మాటికెట్లు
పల్కఁజేసెదొనాజిహ్వాపైవసించి,
అట్లె వ్రాయుదుఁ బైననేమైనఁగాని 58

ఆ.వె. మూకమాటలాడు పీఁకతోజాత్యంధుఁ
డతివిచిత్ర శిల్పమమరఁజేయు
వంధ్య పుత్రుఁబడయు వసుమతి నీకృప
కల్గెనేని, కావ్యఘటనమెంత! 59

ఆ.వె. రామచరితఁ జెప్పి వ్రాయించి ప్రీతిమై,
నను గృతార్థుఁజేయ మనమునందుఁ
బూనియుంటివనుచు, భుజగాద్రినాథ! యీ
దినముతోఁచె నాకు దిగులు తీరె. 60

సీ. మహితచరాచరాత్మకమగు బ్రహ్మాండ
పంక్తిసృష్టి స్థితి ప్రళయ కర్మ

లెవని సహజలీల లెవ్వండఖిలజీవ
జాలరక్షాక్రియాలాలనుండు
శ్రుతిశిరస్సీమంత శుద్ధముక్తాఫల
ప్రాయుఁడక్షరుఁడప్రమేయశక్తి
మహిమానుషక్తుఁడే మహనీయుఁడార్యుఁడు
నిర్ద్వంద్వుండణురూపి నిర్వికారుఁ

తే.గీ. డమలుఁ డిచ్ఛావిహారుఁడు కమలయోని
వామదేవాదిగీర్వాణ వర్గగమ్యుఁ
డెవ్వఁడోంకారవాచ్యుఁడై నివ్వటిల్లు
నట్టి శ్రీసప్తగిరివాసు నభినుతింతు 61

కం. ఉరగాచలనాథుని స
త్కరుణామధుభరిత పాదకమలంబులపై
నిరతము నాచిత్తేందిం
దిరము దిరంబౌనుగాత తేఁకువతోడన్. 62

**సపరివార శ్రీరామస్తుతి :**

సీ. వామాంకతలమునవైదేహి క్రొక్కారు
మెఱుఁగుతీఁగంబోలి మెఱయుచుండ
నానందబాష్పపూర్ణాక్షి నీరజుఁడౌచుఁ
బవమానతనయుండు పదములొత్త
నతి నమ్రకాయుఁడై యంజలి ఘటియించి
ముదముతో సౌమిత్రి ముచ్చటింప,
భక్తి తత్పరులౌచు భరతశత్రుఘ్నులు
వింజామరల్పట్టి వీఁచుచుండ

తే.గీ. దివ్యమణిగణనిర్మిత దీప్యమాన
చారుసింహాసనాసీనుఁడౌ రఘూద్వ
హుండు సతతము మన్మనః పుండరీక
కర్ణికాంతరవానుఁడై కాఁచుఁగాత. 63

**శ్రీ సరస్వతీ స్తుతి :**

శా. నాపాండిత్యము కవిత్వబలమున్ నాధారణాశక్తియున్
బ్రాపొనంచని రాఘవాభ్యుదయమున్ వ్రాయన్గలంబూనలే
దోపద్మాసనురాణి! నీదుకృప నా యుల్లమ్ముపన్ నమ్మి, యి
ట్లీపాత్తమ్ము రచింపఁ బూనితిని, తల్లీ! యెట్లు కాపాడెదో! 64

చ. త్రికరణశుద్ధిగా జనని! దీనతమ్రొక్కినుతింతు నాదు నా
లుకకొనపైననిల్చి, ధరలో గవిలోకము సంతసిల్ల సా
ర్థకమగు శబ్దరాజిని దొరంగగఁజేయు కృపార్ద్రదృష్టిమై
సకలకలాకలాపవతి! సారసనూతిసతీ! సరస్వతీ! 65

చ. కవిగనొనర్చినను బహుకాలముఁబుచ్చక నా హృదంతరో
దవసితమందునిల్చి, గుణధాముని రాముని సచ్చరిత్రమున్
బ్రవిమలభక్తిమై నుడువు భాగ్యమొసంగి కృతార్థుఁజేయుమీ
భవజలధిందరించుట కు పాయమిదేకద? తల్లి! భారతీ! 66

**షష్ఠ్యంతములు :**

కం. శ్రీభూనీళాయుతునకు,
నాభీకుహరైకదేశనాళీకునకున్
భూభారాంతకునకు, నవ
శోభాయుతవిగ్రహునకు సురవినుతనకున్ 67

కం. వరధర్మవిగ్రహునకు,
న్గురుకరుణాలోకనునకు, గోకులరక్షా
భరణునకున్భవసాగర
తరణునకున్పన్నగేంద్రతల్పునకెలమిన్. 68

కం. అరిభీకరమూర్తికి, భవ
సరసీరుహసంభవాదిసంస్తవ్య శ్రీ
చరణాంబుజునకు, దామో
దరునకు, నిరవధికసత్యధౌరేయునకున్. 69

కం. అద్యునకఖిలోపనిష
ద్వేద్యునకహిరాజవీశవిష్వక్సేనా
దిద్యోతితవైభవునకు,
ఖద్యోతసహస్రకోటికాంతియుతునకున్. 70

కం. నిరుపమగుణ జలనిధికి
న్పరమానందస్వరూపభాగ్యున కిభరా
ట్వరదాననిపుణుకు, శ్రీ
ధరునకు, స్వార్చాపరైకదాక్షిణ్యునకున్. 71

కం. గరుడధ్వజునకు, వేంకట
గిరివరనాథునకు, వితతకిల్బిషహరణో
ద్ధురపదపంకేరుహునకుఁ
బరునకు, శ్రీ శ్రీనివాసభగవానునకున్. 72

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన రాఘవాభ్యుదయంబను మహా ప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన. 73



# శ్రీ రాఘవాభ్యుదయ కథా భూమిక

**నారదుని వాల్మీకి ప్రశ్నించుట :**

కం. తపమున స్వాధ్యాయమ్మున
నిపుణుని నారదుని గాంచి నెయ్యముతోడన్
దపసియగు వల్మీకోద్భవుఁ
డపగతరోషాత్ముఁడిట్టులని యర్థించెన్.

ఉ. ఎవ్వఁడు సర్వభూతహితుఁడిత్తఱిసద్గుణశాలియైనవాఁ
డెవ్వఁడు సత్యధర్మరతుఁడెవ్వఁడు మారసహస్రసుందరుం
డెవ్వఁడు కోపమూనిన దిగీశముఖామరులాజిభీతితో
దవ్వులకుంజనంగల రదాంభికులై మునివంశమండనా!

కం. ప్రియసందర్శనుఁడెవ్వఁడు
నయగుణగణభూషణుండనారతమహిమో
దయుఁడెవ్వఁడు కరుణారస
మయుఁడెవ్వఁడు సర్వలోకమాన్యుండెవఁడో.

ఆ.వె. ఎవ్వఁడాత్మవంతుఁడెవ్వఁడు జితరోషుఁ
డెవఁడు సచ్చరిత్రుఁడెవఁడు కోవి
దాగ్రగణ్యుఁడెవ్వఁడఖిలార్థ విశ్లేషుఁ
డప్రమత్తుఁడెవ్వఁడనఘుఁడెవఁడు.

కం. సర్వసమర్థుండెవ్వఁడు
నిర్వాపితనిరతశత్రునిచయాంతర్దు
ర్గర్వాంధకారుఁడౌచు న
ఖర్వప్రభవెల్గునట్టి ఘనుఁడెవఁడిలలోన్.

తే.గీ. ఇట్టి గుణములప్రోడయై, పుట్టియున్న
నరునిదెల్పఁగవేఁడుచున్వాఁడ నీకుఁ
దెలియఁజాలనియర్థమీ యిలనుగలదె?
సకలగుణసాంద్ర! నారదసంయమీంద్ర!

**వాల్మీకి ప్రశ్నలకు నారదుని సమాధానము :**

తే.గీ. అనిన దేవర్షిసత్తముండాత్మమెచ్చి
హర్షబాష్పాకులేక్షణుండగుచు నిట్లు
బల్కె, వాల్మీకిఁగాంచి నీ ప్రశ్నమఖిల
వనజజాండావనోద్యతంబనఁగనొప్పె. 7

ఆ. నీవు పల్కినన్ని నిఖిల దుర్లభసద్గు
ణాళితోడ మెలఁగు నట్టివాఁడు
కలఁడొకండువినుము! కమలాప్తవంశసం
భవుఁడు భవ్యుఁడ భవుఁ డవహితుండు. 8

**శ్రీరాముని సద్గుణములు :**

కం. రాముండన జనవిశ్రుతు
డై మహివెలుఁగొందుచుండె నతఁ డర్థిజన
స్తోమాభిరాముఁ డభినవ
కాముం డఖిలార్థవిదుఁడు కాకుత్స్థుండున్. 9

ఆ.వె. నియతమానసుండు నిర్జితవీర్యుండు
ధృతియు ద్యుతియుఁగల్గి తేజరిల్లు
బహుపరాక్రముండు, వాగ్మి నీతివిదుండు
రిపునిబర్హణుండు, శ్రీయుతుండు. 10

తే.గీ. కంబుకంఠుఁడు విపులాంసుఁడంబుజాక్షుఁ
డతితరాత్మహనుండు మహాభుజుండు,
గాఢవక్షుఁడునుశిరుండు, గూఢజత్రుఁ
డమితశుభలక్షణాంచితుఁడతఁడు మరియు 11

తే.గీ. సత్యసంధుండు లోకైక సౌమ్యమూర్తి
శుచియు ధర్మజ్ఞుఁడతులితశుభ్రకీర్తి
వేదవేదాంగతత్త్వ వివేకవర్తి
రణరిపుధ్వంసి శ్రీరఘురామమూర్తి. 12

తే.గీ. సాధుచరితుండుదీనుండు సర్వలోక
హితుఁడు శరణాగతావనరతుఁడు నిత్యుఁ
డార్యసమ్మతుఁడభినవశౌర్యశాలి
నిఖిలశాస్త్రార్థ విజ్ఞాననిలయుఁడతఁడు. 13

ఆ.వె. సరిదధీశ్వరుండు సాటియౌ నతని శే
ముషికి మొనసి కోపమునకు ననల
మచలరాజుసాటియనఁదగునతని ధై
ర్యంబునకు నిరంతరంబు మౌని! 14

కం. ధర సమయగు శాంతమునకు
సిరిమగఁడగు సాటియతని చేవకు రజనీ
కరుడెన సౌందర్యంబున
నరవాహనుఁడీడు వితరణమునందరయన్. 15

**సంగ్రహారామాయణము :**

తే.గీ. విను మివి యటంచు నేనెన్ని విస్తరించి
పల్కఁగలవాఁడ రాముని పరమధర్మ
సత్యశౌచాదిగుణవిశేషమ్ములోలి
కంజభవునకు వశమౌనె? గణనసేయ. 16

తే.గీ. అట్టి సత్యపరాక్రము నగ్రసుతుని
గౌనలేయుని, రాముని, గార్యదక్షు
యౌవరాజ్యాభిషిక్తుఁజేయంగఁదలచెఁ
దండ్రియైనట్టి దశరథ ధరణివరుఁడు. 17

కం. ఆయత్నంబునుగని కై
కేయి విభునితోడనిట్లు కృపణతఁబల్కెన్
శ్రీయుత! మద్వరయుగ్మం
బీయెడఁ గావలెనటంచునీర్ష్యావతియై. 18

తే.గీ. ఆత్మవగమాని, శ్రీరామునడవికనిపి
పట్టభద్రుని జేయుము, భరతునిపుడు
వరయుగము నీకు వలసిన తరుణమందుఁ
గోరుకొమ్మని పల్కవే? కోసలేంద్ర. 19

తే.గీ. జాయ యిటుపల్క దశరథ సార్వభౌముఁ
డాడితప్పగలేనివాఁడౌటవలన
ననుమతించెను శ్రీరామువననివాస
మునకుఁదోడనె జానకి చనఁదలంచె. 20

తే.గీ. అంత సౌమిత్రి రాముని యంఘ్రిపద్మ
ములకు జోహారులిడి వనమ్మునకుఁ దాను
బయనమైరాఁగ వీడిరా పట్టణమును
జానకీ రామలక్ష్మణుల్సత్వరముగ. 21

ఆ.వె. స్త్రీ తృతీయుఁడగుచు, శ్రీరాముఁడడవికి
జన నయోధ్య, మనము మనుటదెట్లు
రామవిభునిపాదరాజీవకైంకర్య
మునకు విఘ్నమిపుడు, గనుటదెట్లు? 22

ఆ.వె. అనుచు నొకరికొక్క రాయయోధ్యంగల
ప్రజలు చెప్పికొనుచు బయలుదేరి
రామువెంటఁ జనఁగ రాత్రి నిద్రాసక్త
మైన పౌరకులమునతఁడు వీడి. 23

కం. తరుణిం దమ్ముని గూడుక
నరదముపై నధివసించి యారాతిరి ని

ర్జరసరిదుపకూలంబును
నరుదారఁగఁజేరి సూతునట వీడ్కొల్పెన్. 24

కం. మ్రొక్కిన గుహునకు దీవన
లక్కజముగ నిచ్చి తత్సహాయము చేత
న్గక్కున నుడుపంబును దా
రెక్కి యొక నిమేషమునఁ దరించిరి గంగన్. 25

తే.గీ. మరియు నానా నదీ వనంబులను దాటి
చేరె ఫలపుష్ప తరుషండచిత్రితాత్మ
కూటమైయొప్పు శ్రీచిత్రకూటశైల
రాజమబలాత్సతీయుఁడై, రాముఁడపుడు. 26

కం. భారద్వాజుని వాగను
సారముగా నుటజమందు సౌమిత్రిముదం
బారఁగ నిర్మించెను సీ
తారాములకతివిచిత్రతరమగుఫణితిన్. 27

తే.గీ. అందు శ్రీరఘుకులనాథుఁడధివసించె
నిందుముఖి సీతఁగూడి యానందమొప్పఁ
దత్పదాంబుజసేవావిధానభాగ్య
భోగ్యుఁడై యుండె, సౌమిత్రిపొల్పుమీర. 28

మ. అట సాకేతపురంబులో దశరథుండాహారనిద్రాసుఖ
స్ఫుటసామ్రాజ్యమహోపభోగముల, దాపుంజేరరానీక దు
ర్ఘటమౌశోకదవాగ్నిలోనఁబడి, పుత్రా! పుత్ర! శ్రీరాఘవా
పటుదోర్విక్రమ!రామ!రామ!యనుచు, న్బాసెంజుమీప్రాణముల్. 29

తే.గీ. స్వర్గమునకేగ, దశరథ సార్వభౌముఁ
డపుడు భరతుఁడు విని యంతనంతరాత్మ
వగచి వాపోయి వామదేవాదిముఖ్యు
లెల్లబ్రతిమాలినను రాజ్యమొల్లకపుడు. 30

తే.గీ. వనమునకు వేగచని రామభద్రుపాద
వనజములఁ్రవాలి, నీవె యీవసుధకెల్ల
రాజవటునగాన ధర్మజ్ఞ! రమ్మటంచు
నార్యభావపురస్కృతుండౌచు వేడె. 31

తే.గీ. తండ్రియాదేశమున మహోదారుఁడైన
రాముఁడొల్లక తద్రాజ్యలక్ష్మినపుడు
ప్రేమమీరఁగఁ బాదుకలామహాత్ము
నకు నొసంగి మరల్చె నానగమునుండి. 32

కం. నంది గ్రామముఁజేరె న
మందగతిన భరతుఁడపుడు మణిపాదుకలన్
బొందుగ శిరమునఁదాలిచి
వందనమొనరింప సురలు వాల్మీకతనయా! 33

తే.గీ. సత్యసంధుఁడు శ్రీరామచంద్రమూర్తి
పౌరజనతాప్రవేశాదిబాధ తనకు
నిరతమును గల్గఁగలదంచు నిర్ణయించి
దండకారణ్యముంజేరియుండెనపుడు. 34

చ. అట హరియించి దానవకులాధముఁడైన విరాధుప్రాణముల్,
పటుగతితోడ నేగి, శరభంగునకాత్మపదంబొసంగి య
చ్చొటు విడనాఁడి యోగికులసోము సుతీక్ష్ణునగస్త్యసువ్రతో
త్కటచరితున్సుదర్శను, ముదంబునఁ గాంచె సతీతృతీయుఁడై. 35

సీ. ఘటజన్మునాజ్ఞచేఁ గైకొనె నక్షయా
శుగములు తూణీరయుగము నైంద్ర
ధనువు ఖడ్గము నంత మునిజనులర్థింప
సకలదుష్టాసురసంఘములను
నశియింపఁజేయు దీ నాటినుండి యటంచు
ఘోర దీక్షన్బూని కూర్మిమీఱ
భీతిఁబోనడఁచి సంప్రీతుఁడౌచు మహర్షి
వరులదివ్యాశ్రమావసథరాజి

తే.గీ. కరిగె ననుజుడు భార్యయు ననుగమింప
సంచరించుచు నొకనాఁ డసాధువృత్త
కామరూపిణి శూర్పణఖాఖ్యదైత్య
కాంతకుం గూర్చెవైరూప్య మంతనదియు.

సీ. ఖరదూషణాదిరాక్షసులఁ బ్రేరేచ వా
రవనిజాపతిఁదాకియాహవాగ్ని
శలభాయమానులై యిలఁబాసిరి చతుర్ద
శ సహస్ర సైనిక సహితులౌచు
నది విని రావణుండతిరోషితాత్ముఁడై
మారీచుసాయముగోర నతఁడు
బలవద్విరోధంబు వలదని వారింపఁ
గనులెఱ్ఱజేసి యాతని వధింతు

తే.గీ. ననుచుఁ బైకేగ మారీచుఁడతని యాన
దాఁటఁజాలక భీతితోఁ దరలిపోయి
దండకారణ్యమునఁ జిత్రతరసువర్ణ
హరిణమై సంచరించుచు నచ్చటచట. 37

కం. చేరెంగ్రమముగ శ్రీ సీ
తారాములపర్ణశాలదరికద్దానిం
గోరఁగ వసుధాసుత రఘు
వీరుఁడు ధనువంది దానివెంటంజనియెన్. 38

కం. చేఁ జిక్కినట్టులుండియు
భూజానికిఁ జిక్కకది యభూతగతులచే
క్ష్మాజముల చుట్టు ముట్టుచు
నోజం గొనిపోయె దూరమో మునిచంద్రా. 39

కం. ప్రాణముతో లేడిం దన
మానినికీఁదలఁచి యట్లమానుషతేజుం
డౌ నళినమిత్రవంశ్యుఁడు
పూనిక వెన్వెంటఁబోయిపోయి రయమునన్. 40

తే.గీ. విసిగి ప్రాణము గుతిఁజేసి విశిఖమొకటి
నాట నది కూలె, హా లక్ష్మణా! యటంచు
విని, తదారావమునకతిభీతిఁ జెంది
రాముకడకన్పె లక్ష్మణు భూమిజాత. 41

కం. ఆ తరుణంబున రావణ
దైతేయుండపహరించె ధరణీజాతన్,
పూతచరిత్రన్ ద్రిజగ
న్మాతన్ సీతన్ప్రశస్తమహిమోపేతన్. 42

కం. సీతంగానక రాఘవు
లాతతవిపినంబులెల్ల నరయుచు నొకచో
వీతబలుఁడౌచు రావణు
హేతిం దెగిపడిన యండజేశ్వరుఁగనియెన్. 43

తే.గీ. అపుడు ప్రణమిల్లి రామునకతఁడు తెల్పి
సీతఁగొనిచనె రావణుండేతదర్థ
మేను బోరాడి యిట్లైతి నినకులేంద్ర!
యనుచు నసువులు విడనాఁడె నంతమీఁద. 44

కం. ధీయుతుఁడౌ రాముండు జ
టాయువు దహియింపఁజేసి యాదశముఖుఁ దా
నీయిలఁబాయగఁ జేయుట
కై యోచనఁజేసి కదలెనతివేఁగమునన్. 45

కం. తమ్ముఁడుఁ దానును ఘనశో
కమ్మున వనములకు నేగి, కనె గర్వాంధున్
ద్రిమ్మరు రక్షోబంధున్
సమ్మదమునఁ బైకిఁగవియు, జడుని గబంధున్. 46

తే.గీ. ఒక నిమేషంబులో రాముఁడుగ్రరూపు
రూపుమాయింప శాపనిర్ముక్తుఁడయ్యె
నతని యభ్యర్థనముచేత నావనాంత
రమున శబరిని గన్గొనె, రాఘవుండు. 47

తే.గీ. అంత ధర్మప్రచారిణియైన శబరి
యర్చనముసేయఁ గైకొని యాత్మమెచ్చి
కర్మలతఁద్రెంచి స్వీయలోకమున కేగ
నాజ్ఞ సాయించి యనుజుతోఁ జోఁటుఁగదలి. 48

సీ. ఇంపులొల్కుచునున్న పంపానరస్తీర
మున విహరించుచున్ హనుమఁగాంచి
తద్వాక్యమున సూర్యతనయునితోఁగూడి
వినఁబల్కె నతనితో విస్తృతముగ
స్వీయ చరిత్రంబు శ్రీ రఘుకుల నాథుఁ
డదియెల్ల సుగ్రీవుఁడాలకించి
అగ్నిసాక్షిగ మైత్రి నా రఘురాముతో
నొనరించి తన కథ వినయ మొప్ప

తే.గీ. శోకబాష్పాకులాక్షుఁడై వీఁకఁ దొలఁగి
విన్నపముఁజేయ విని రఘువీరుఁడపుడు,
వగవఁబని లేదు, సుగ్రీవ! వానరేంద్రుఁ
డైన వాలిని జంపెద నేననుచుఁ బల్కె. 49

తే.గీ. అహరహంబును సుగ్రీవుఁడంతరంగ
మున రఘూద్వహు శౌర్యంబుఁగనఁదలంచి
నట్టివాఁడౌట, దుందుభి యస్థిపంజ
రమ్ము చెంతకుఁగొనిపోయె రామవిభుని. 50

ఆ.వె. కాలిబొటన వ్రేల గగన పథంబున
కెగయఁదన్నె రాముఁడగచరాధి
పతి గనంగ నచటఁ బడియున్న దుందుభి
యస్థిపంజరంబు నా క్షణంబ. 51

కం. నమ్మికకై యతనికి నొ
క్కుమ్మడి సాలముల నేడు నుర్వింబడ శై
లమ్మును రసాతలము నొ
క్కమ్మున భేదించె రాముఁ డతిచిత్రగతిన్. 52

సీ. అపుడు సుగ్రీవుఁడీ యతిబలుడౌ రామ
భద్రుండు వాలిని బట్టి చంపఁ
జాలు నంచును మది సంతసిల్లుచు రామ
చంద్రుతోఁ గిష్కింధఁజని సురేంద్ర
పుత్రువాకిట నిల్చి పూని గర్జించిన
విని వాలి తారను వేవిధముల
ననునయించుచు వచ్చి యనుజునితోఁబోరు
సల్పెడి వేళ ననల్పబలుఁడు

తే.గీ. జానకీజాని యొక శాతశరముచేత
వసుధఁబడఁగూల్చి వాలిని, వానరాధి
పతినిగాఁ జేయ సుగ్రీవునతఁడు వేగ
వానరులనెల్ల రావించి వరుస తోడ. 53

తే.గీ. సర్వదిశలకు రఘురామునకియజాడఁ
గాంచిరాఁబంపె నంతట, గంధవాహ
సూతి హితకరుఁడైన సంపాతి వాక్సు
ధారసముఁగ్రోలి నీరధి దాటఁదలఁచి. 54

కం. తారాతనయుఁడు భల్లుక
వారాధిపుడుం గడంగి వారిధి దాటన్
బ్రేరేచఁగ శతయోజన
దూరంబు నతిక్రమించి తోయధి మీదన్. 55

కం. అట రావణ భుజపాలిత
పటులంకాపురముఁజొచ్చి పవనాత్మజుఁడు
త్కట బలుఁడై నిరసించెన్
దిటముగఁ దత్పట్టణాధిదేవత నెలమిన్. 56

తే.గీ. అంత రావణులంకలో నవనిజాత
నరసి కాంచి యశోక వనమ్మునందు
క్షేమ వృత్తాంత మెఱుగంగఁ జెప్పి తుదకు
ముద్దుటుంగరమిచ్చెనా ముదిత కతఁడు. 57

ఆ.వె. ఆనవాలు గనిన యావల రఘుపతి
దూత యితడటంచుఁ జేతమందు
నమ్మి గుఱుతొసంగిసమ్మోదమునఁ బోయి
రమ్మటంచుఁ బల్కె రాజవదన. 58

చ. హనుమ తదాజ్ఞఁ గైకొని మహాముదమంది విదేహరాజనం
దననివసించియున్న తరుతల్లజమొక్కటిదప్ప శిష్టమౌ
వనము నొకే క్షణంబున నవారణ లీలఁబెకల్చివైచి తో
రణమును గూల్చి శత్రునికరంబు భయంపడ నార్చి పేర్చుచున్. 59

కం. ఏవురు సేనాపతుల
న్వావిరి మార్కొన్న మంత్రివరనందనులన్
బావకతేజులనేడ్వురఁ
గావించెం జిత్రవధమఖండితబలుఁడై. 60

సీ. అతి బలిష్ఠుండగు నక్షునిఁ బరిమార్చి
స్మరియించి పరమేష్ఠి వరమునపుడు
బ్రహ్మాస్త్రమునకుఁ దాబద్ధుఁడై యున్నట్లు
సకల రాక్షసవీరసముదయమును
భ్రమియింపఁజేసి రావణునకు శ్రీరామ
భద్రుపరాక్రమభంగిఁ దెల్పి
అనుగతులౌ దుర్మదాంధుల మన్నించి
జనకజ నాపదఁ గనఁగనీక

తే.గీ. రహిఁ జెలంగెడి లంకాపురంబుఁ గాల్చి
వచ్చి రాముని శ్రీ పాదవనజములకు
దండమిడి "చూచినాఁడ"నే ధరణిజాత
ననుచు సంక్షేపముగఁ దెల్పె ననిలసుతుఁడు. 61

కం. ఆ వచనము విని శ్రీరా
మావనిపాలుండు కదలి, యగచరపతి సు
గ్రీవునితో దక్షిణపా
రావారాంతికముఁజేరి, రాణచెలంగన్. 62

కం. ఆదిత్యనిభశరమ్ముల
యాదఃపతిగర్వమడఁప నతఁడతినయని
ష్పాదితవచనమ్ములతో
శ్రీదయితుఁడవీవెయనుచుఁజేసెవినతులన్. 63

ఉ. కోపమునాఁపుఁజేసి రఘుకుంజరుఁడంతట వార్ధివిన్నపం
బోపికతోడుతన్విని, యథోక్తముగా సృజియించి, సేతువున్
బాపురె! బాపురే! యని, నభశ్చరులచ్చెరువంది చూడ, లం
కాపురికేగెఁ, గీశులు వికర్తనసూతియు, వెంటనంటగన్. 64

చ. చని రఘురామభద్రుఁడు నిశాచరసేనలతోడ రావణున్
రణమునఁజంపి సీతననురాగముతోఁ గన వేగ వారలు
న్వినఁ బరుషోక్తులాడఁగ వివేకవివర్ధనశీల మేదినీ
తనయ వసించె, లోకభయదద్యుతియౌచటులానలంబునన్. 65

ఉ. అంతటఁబావకుండు, జలజాయతనేత్రను దెచ్చి, దేవ! మీ
స్వాంతమునంద సాధ్యమగుశంకకుఁదావిడ న్యాయమౌనె? సి
ద్ధాంతము లోకపూత వసుధాసుతయంచుఁ బ్రమోదమొప్ప భూ
కాంతునికేల నామె, కరకంజమునుంచి నమస్కరించినన్. 66

కం. సురదుందుభిరావంబం
బరవీధిన్మ్రోసెఁ బుష్పవర్షముగురిసెన్
ధరణిజకున్ రఘువరునకుఁ
గరమరుదుగ మోదవారికణములు దొరసెన్. 67

ఉ. పూత చరిత్రయై మెలఁగు భూసుతఁగేల గ్రహించి, రాఘవుం
డాతత సర్వదైవతగణార్చితుఁడై వెలుగొందెఁ దత్క్రియా
జాతకుతూహలాతిశయసంపదలన్నదునాల్గులోకము
ల్మాతరముంద్యజించె మునికాండము మ్రొక్కినుతించెనాదటన్. 68

తే.గీ. ఇనకులేంద్రుఁడు శ్రీ విభీషణుని లంక
కధిపతింజేసి నిర్విచారాంతరాత్ముఁ
డౌచు నెనలారె క్ష్మాతనయానుజులను
సకలకపిసైన్యముంగూడి, సంయమధన! 69

ఉ. దైవతకోటిచే వరముదారత నొంది రఘూద్వహుండు కీ
శావళికిన్ప్రబోధమరుదారనొనర్చి సుహృత్సమేతుడై,
పావనయోధ్యకున్వెడలెఁబుష్పకమందువసించి లోకనం
భావిత చిత్రముల్గనుచు, భాస్కరకోటి మహోజ్జ్వలాంగుఁడై. 70

కం. క్రమముగ భారద్వాజా
శ్రమమునకరుదెంచి ముందు, శ్వసనతనూజున్
సుమహితమతియౌ భరతుని
సముఖంబునకనిపి, రామచంద్రుండంతన్. 71

క. గత వృత్తాంతము సూర్యుని
సుతుతోడన్మెచ్చటించుచును శ్రీరాముం
డతితరవేగసమాయుత
గతితో నలరారు పుష్పకస్థితుడయ్యెన్. 72

కం. ఆ మహితుండటు నంది
గ్రామంబరుదెంచి జటలఖండితకుతుక
శ్రీమంతుఁడౌచు విప్పెను
భూమియుఁ ద్రిదివంబునేకముగజేపెట్టన్. 73

కం. భరతుఁడు శత్రుఘ్నుండను ।
గరమరుదుగ రాముపాద కమలమ్ములపై
శిరములు చేరచి మ్రొక్కిన
సరగున రాఘవుఁడొసంగి సశుభాశీస్సుల్ 74

కం. ఇరువురి యోగక్షేమము ।
లరయుచు వేర్వేర వారి నాశ్లేషించెన్
పరమామోదాశ్రువుల
క్షులవెల్వడ మేన్గగుర్ప సురుచిరఫణితిన్ 74(A)

**సంగ్రహరామయణోపసంహారము:**

ఉ. తమ్ములు చుట్టికొల్వ నవతామరసాక్షి విదేహకన్య స్వాం
కమ్ముననిల్వ, గంధవహుగాదిలిపట్టి మహాప్రమోదబా
ష్పమ్ములురాల్వ నంఘ్రిజలజాతయుగమ్మునుగేలదాల్చి రా
జ్యమ్ము వహించె, రాఘవుఁడనన్యయశోవిభవాభిరాముఁడై. 75

కం. వీరాగ్రణియగు శ్రీరఘు
వీరుఁడు రాజ్యంబుసేయ, విభవాఢ్యములై

యీరేడు జగములొప్పె
న్గారాకుంబోలి కష్టకాలము తొలగెన్. 75(A)

తే.గీ. తుష్టిపుష్టియు ధర్మంబు హృష్టి దేహ
సౌఖ్యముంగల్గి దుర్భిక్షసాధ్వసంబు,
రోగపీడయు, నెఱుఁగక లోకమెల్ల
శాంతపావనమయ్యె నశ్రాంతమహహ. 76

తే.గీ. పుత్రమరణంబుఁగాంచఁగాఁబోరు పురుషు
లతివలొందరు వైధవ్యగతి మునీంద్ర!
అగ్నిజలవాతసంభవంబగు భయంబు
త్యాజ్యమై యొప్పె రఘురామురాజ్యమందు 77

తే.గీ. క్షుత్పిపాసార్తులై జనుల్బుక్కఁబోరు,
కలుగదేరికి నెందుఁదస్కరభయంబు,
పురవరంబులు రాష్ట్రముల్నిరుపమాన
వస్తు ధనధాన్యవృద్ధిమై వఱలుచుండె. 78

కం. నిత్యమ్మును బ్రముదితులై
సత్యమ్మే జయమటంచు సకలజనంబుల్
కృత్యమ్మెఱిఁగి నటించెద
రత్యాహితదూరులౌచు నవని శ్రుతిజా. 79

ఆ.వె. వాజిమేథశతము, బహుసువర్ణక యజ్ఞ
శతమొనర్చి సురలు సంతసిల్ల
బహుళ గోసహస్రపంక్తి నసంఖ్యేయ
ధనముతోడ విప్రజనులకొసఁగి. 80

సీ. "శతగుణ రాజవంశమ్ములు స్థాపించి
ధరణిలోఁ బ్రఖ్యాతి" గరిమనించి
బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రుల స్వస్వ
ధర్మకర్మంబులం దగులుపఱచి
ప్రబలి ధర్మముచతుష్పదములవర్తింపఁ
గృతయుగమ్మునఁబోలె హితవుఁగూర్చి
వసుధనేకాదశవర్షసహస్రంబు
లేకాతపత్రతనేలి భువిని

తే.గీ. నిత్యనిరతిశయానంద నిర్వికార
సత్యధర్మస్వరూపసంస్తుత్యమాన
మైన వైకుంఠనగరికి నరుగఁగలఁడు
రాముఁడభినవనుగుణైకధాముఁడౌచు. 81

కం. పరమపవిత్రము పుణ్యం
బరుదార మహోఘనిఘ్నమఖిలశ్రుతిరా
ద్వరసమ్మితమగు నీశుభ
చరితము, పురుషార్థసిద్ధి సాధనమగుతన్. 82

కం. దురితాత్ముఁడైన దీని
న్పరమాదరవంతుఁడౌచుఁ బఠియించిన, స
త్కరుణానిధి రాముని పద
సరసిజసాయుజ్యమొందు సకుటుంబముగా. 83

ఉ. పొందుదు రగ్రవర్ణజులు పొల్పుగ వాక్పటిమంబు, క్షత్రియుల్
గందురు భూపతిత్వమతిగౌరవమొప్ప, సువణ్యసంపదం
జెందుదు రూరుజుల్పతమశేషవిశేష మహత్వ దీప్తిఁ గై
కొందురు పాదజుల్పదివి, కూరిమి నీ రఘునాథుసత్కథన్. 84

కం. ఈ సంగ్రహరామాయణ
మాసంయమధనున కబ్జజాతాత్మజుఁడెరుఁగం
జేసి తదర్చితుఁడై భువిఁ
బాసి చనె న్పారతీశుపట్టణమునకున్. 85

## వాల్మీకి మహర్షి స్నానార్థమై తమసానదికి వచ్చుట

ఉ. అంతట మౌనిచంద్రుఁడు రయంబున నాహ్నికముంబొనర్ప శ్రీ
కాంతుని స్వాంతమందిడి యఖండిత మోదముతోడ శిష్యుఁడ
శ్రాంతముఁగొల్వనేగి తమసానది చెంత కనంగఖేలనా
క్రాంతమనంబుతో మెలఁగు క్రౌంచయుగమ్మును గాంచెనచ్చటన్. 86

తే.గీ. అందుఁబుంపక్షినొక మందుఁడైన బోయ
చంపెఁ జంపిన వగఁ జెంది, స్వాత్వికర్షి
వర్యుఁడైనట్టి వాల్మీకి వానిఁగాంచి
నిస్తులక్రోధఘూర్ణితనేత్రుఁడౌచు. 87

**వాల్మీకి కిరాతుని శపించుట**

ఉ. మారవిలాసకేళిగతమానసమైన విహంగమున్నిలా
త్కారముతో వధించితటుగావున, శాశ్వతవత్సరంబులీ
ధారుణినుండఁ జెల్లదిఁకఁదక్షణమే, తనువుంద్యజించిపో
రోరి!దురాత్మ! యంచుఁ బరుషోజ్జ్వలశాపమొసంగెనత్తఱిన్. 88

**శోకము శ్లోకమగుట**

కం. అతులిత మునిశాపాక్షర
తతి, మితసమవర్ణమౌచుఁ దంత్రీలయసం
యుతమై పాదచతుష్టయ
గతమై సుశ్లోకమై జగంబునఁబరగెన్. 89

క. తన శిష్యు భరద్వాజు
న్గని మునిజనవల్లభుండు కౌతుక మొప్పన్
వినుమో వత్సా రార
మ్మని యిటుపల్కెందొడంగె నాంతర్యంబున్. 90

తే.గీ. ఈ నిషాదునిపై నల్గి యేశపించి
నట్టి దోషాక్షరంబులనంబుజాక్షు
స్తుతిపరంబైన యర్థంబుతోఁచె నొకటి
అదియు ఛందోనిబద్ధమై యలరుచుండె. 91

కం. శోకార్తుఁడనగు నా నుడి
ప్రాకటసమవర్ణలలిత పాదచతుష్క
శ్లోకాత్మకమై వెడలుట
కే కారణమో? స్మరింపదిపుడమలమతీ! 92

కం. అని వాల్మీకి మాధ్యాహ్నిక
మునుదీర్చ చనెన్, స్వహస్తమున జలకలశం
బునుబూని, భరద్వాజుఁడు
తన వెంటన్గదల నద్భుతస్వాంతుండై. 93

**బ్రహ్మదేవుడు వాల్మీకి ఆశ్రమమునకు వచ్చుట**

కం. ఈ తీరున మునివర్యుం
డేతెంచి నిజోటజమున నేడ్తెఱ యోగ
శ్రీతత్పరుఁడైనం, జల
జాతాత్మజుఁడేగుదెంచి సమ్మోదమునన్. 94

తే.గీ. మ్రోలనిల్చినఁగని లేచి, మునివరుండు
విస్మయావిష్టహృదయుఁడై వేడ్కమీరఁ
బ్రణతితతి సల్పి, సర్వప్రపంచసృష్టి
మూలభూతాయ! తుభ్యం నమో! యటంచు. 95

తే.గీ. శ్రౌతవిధిచేత నటుమీద జలజభవున
కర్చనముఁజేసి మన్నించియంతఁదదను
మతిసమాసీనుఁడై మ్రోలఁ గుతుకమొప్ప
నడిగెఁ దనమదిఁగలనందియమ్మునీఱ. 96

కం. వైరగ్రహణుఁడు పాపా
చారుండు నిషాదుఁడొకఁడు, సరగునఁ, దమసా
తీరంబున నేఁగాంచఁగ
మోఱకుఁడై చంపెఁ, గ్రౌంచమును లోకవిభూ. 97

ఆ.వె. వానిఁగాంచి క్రోధవశమానసుండనై
శాపమొసఁగ మరియు "స్వప్రయత్న
మింతలేక" శ్లోకమీతీరుగా నయ్యె
ననుచు వినిచె నజునకాతఁడిట్లు. 98

**మా నిషాద! ప్రతిష్ఠాం త్వమగమశ్శాస్వతీస్సమాః ।**
**యత్క్రౌంచమిధునాదేకమవధీః కామమోహితమ్॥** 99

## వాల్మీకికి బ్రహ్మదేవుని ఆశీస్సులు

ఆ.వె. వామలూరునుతుఁడు వనజాసనునకిట్లు
చదివి వినిచి "మానిషాద" యనెడి
శ్లోకమును తదుపరి శోకార్తుడై యుండె
మానసమునఁ గ్రౌంచి మాటఁ దలచి. 100

ఆ.వె. వగలఁ బొగులుచున్న వాల్మీకిఁ గని నవ్వి,
పద్మసంభవుండు, పలికె నిట్లు
వామలూరుతనయ! వనటఁ జెందకు మది
ననుచు, హార్దభావమునఁగడంగి. 101

ఉ. భారతి నా నిదేశమున, భవ్యతపోమహిమోన్నతుండవౌ
నీ రసనాగ్రపీఠమున నిల్చె! మహాత్మ! వచింపు, సర్వబృం
దారకవంద్యదివ్య పదతామరసుండగు, రాముసత్కథా
సారము నొక్కకావ్యముగ జాగొనరింపకు మంచు వెండియున్. 102

## రామాయణరచనను చేయుమని వాల్మీకిని బ్రహ్మదేవుడు ఆదేశించుట

చ. రవికులచంద్రుఁడైన రఘురాముని లీలలు జానకీసతీ
ప్రవిమలవర్తనంబు, శుభలక్షణుఁడై యొసలారు నూర్మిళా
ధవుని మనోజ్ఞవృత్తి, పరదర్పవిదారణకృత్యముల్సతం
బవిరళరీతి నీమనమునందు, స్ఫురించునుగాత! వాల్మికీ!! 103

సీ. అని మఱి యిటుపల్కె నంభోజసంభవుం
డవ్వాల్మికింగాంచి యతిముదమున
సత్వరగతి, రామచంద్రసీతాలక్ష్మ
ణుల రహస్యాలాపములు ప్రకాశ
సంభాషణంబులు సర్వము, నీ మనో
వీధిఁ దాండవమాడు, వేఱేల
నీవు పల్కినదెల్ల నిజమై ప్రకాశించు
ననృతము నీ వాక్కునందుఁ గలుగ

తే.గీ. దట్లు గావున రచియింపు మమలహృదయ!
శ్రీ రఘూత్తము దివ్యచారిత్రమిప్పు
డద్ది రామాయణాఖ్యచే నలరుచుండు
సకలవేదాంతసారమై జగములందు. 104

తే.గీ. నారదునివల్ల వినినట్లు, ధీరుఁడైన
రామచంద్రుని పుణ్యవిరాజమాన
దివ్యవృత్తంబు సర్వముఁ దేటతెల్ల
గను రచించి సుకీర్తిని గనుము వత్స!

మ. వనధుల్సప్తకులాచలంబులు నదీవర్గంబు వేదాంతముల్
మునివంశోత్తమ యెంతదాఁకఁ ద్రిజగత్పూజ్యంబులై నిల్చునో,
ఘనతం జెందుచు నంతదాఁక నిలువంగానోపు శ్రీరామభ
ద్రుని చారిత్రము, తావకీన రసనోద్భూతత్వముంజెందినన్. 106

కం. భూమండలమున శ్రీమ
ద్రామాయణమున్నవఱకుఁ దావనవంశ
గ్రామణి ముల్లోకములన్
సేమంబున నిల్చి సుప్రసిద్ధిం గనుమా. 107

చ. అని యిటుపల్కి పద్మజుఁడనంతరమందుఁ దిరోహితాత్ముఁడై
చన దివికప్డు వాల్మికి యసంశయమానసుఁడౌచు మానస
మ్మునఁ దలపోసెనీక్రియ సముత్సుకుఁడై యలరారి, నేనపో
ఘనుఁడను సర్వమౌనికులకాండమునందని మాటిమాటికిన్. 108

**"మానిషాద" మననము**

కం. అత్తరి మునిశిష్యులు కడ
లొత్తిన మోదమ్ముతోడ, నోహో యనుచున్
మొత్తములై పఠియించిరి
హత్తుగ నా "మానిషాద" యను పద్యమ్మున్. 109

కం. ఆ మునిసింహుఁడు శ్రీమ
ద్రామాయణమిట్టి శ్లోకరాజమ్ములచే
భూమిం దివమును బొగడఁగ
నేమంబునఁ గూర్తుననుచు నిశ్చలమతియై. 110

మ. అటు భావింపఁగ మానిషాద యనుశ్లోకార్థంబు శ్లేషార్థక
స్ఫుటమాధుర్యర సోచితంబగుచు విష్ణు ప్రాతిపాద్యమ్ముగాఁ,
దృటిలోఁ దోఁచగ స్వీయకార్యపతి తద్విష్ణుండ కానిమ్మదు
ర్ఘటమౌసత్కృతిఁబల్కువాఁడనని నిర్ధారించి లోనుబ్బుచున్. 111

తే.గీ. మును నిషాదుని గని కోపమున శపించి
నట్టి రోషాక్షరంబులిట్లయ్యె శ్లోక
మిదియు ఛందోనిబద్ధమై యిందిరేశ
పరముగాదోచె శ్లేషయుగ్భావ మలర. 112

క. కావున వనజోద్భవు స
ద్భావానుగుణమ్ముఁగాగఁబల్కెద రామ
క్ష్మావిభుదివ్యచరిత్రము
శ్రీవల్లభుఁడాతడనెడి సిద్ధాంతమునన్. 113

**వాల్మీకి యోగదృష్టిచే రామాయణమును చూచుట**

వ. అని తన మనోనిశ్చయమును భరద్వాజునకెఱింగించి, బ్రాహ్మముహూర్తంబున మేల్కాంచి, పరబ్రహ్మనుమయుండగు శ్రీరామచంద్రుని హృత్పద్మకర్ణికాగ్రంబున మహాయోగశక్తిచేఁ బ్రతిష్ఠించి యొకానొక యేకాంత ప్రదేశంబు నందు. 114

ఆ.వె. సర్గలైదునూఱ్లు, షట్కాండములు నింపు
లొలుకుచున్న శ్లోకములు, నిఱువది
నాల్గువేలు గలిగి, నళినాక్షుఁడౌ రామ
చంద్రుచరితమొప్పె, క్ష్మాతలమున. 115

తే.గీ. ఆ మహాకావ్యమందు, సర్వార్థవేది
యైన వాల్మీకి వాకొనె, నంబుజాప్త

కులశశాంకుని, దశరథకువలయేంద్రు
రాజ్యపరిపాలనాచతురత్వవిధము. 116

క. ప్రాగగ్రములౌ దర్భల
పైఁ గూర్చుని యాచమించి భవ్యతపశ్శ్రీ
యోగంబునఁ గన్గొనె నను
రాగరసావిష్టుఁడౌచు రామునిచరితన్. 117

చ. అరసి మునిప్రవర్ధనుండు హస్తగతామలకంబురీతి నా
తరణికులేంద్రు దివ్యచరితంబు విచిత్రపదానుబద్ధ వి
స్ఫురదురుభావమాధురిమసొంపు రహింప రచించి మించె స
త్వరగతి సర్వలోక పరివర్తిత కీర్తిపయః పయోధియై. 118

కం. శ్రీరాముని జననంబును,
వీరత్వము, సర్వలోకవిశ్రుతమౌ త
త్కారుణ్యరసామోద ము
దారత, సౌమ్యతయు, సత్యధర్మాభిరతిన్. 119

తే.గీ. కౌశికుని రాక నస్త్రసంగ్రహణ విధము
సవనరక్షణ, మునిసతీశాపముక్తి
హరధనుర్భంగ మవనిజాపరిణయాప్త
కౌతుకంబును, భృగురామగర్వహృతియు. 120

కం. సాకేతాగమనంబు
న్బ్రాకటరాజ్యాభిషేకభావోదయమున్
గేకయతనయా దుష్టత
శ్రీకరుఁడౌ పంక్తిరథునిచింతాకులతన్. 121

కం. కరుణామయుఁడగు రాఘవుఁ
డరుగుట వైదేహితోడ నటవీస్థలికిన్
నరపతియగు దశరథునకుఁ
బరలోకాశ్రయముఁ బౌరపరిదేవనమున్. 122

తే.గీ. పురజనవిసర్జనంబును, పరమభక్తుఁ
డగు నిషాదాధినాథు సమాగమంబు
స్వర్ణదీతరణము భరద్వాజదర్శ
నంబుఁ దచ్ఛాసనానురాగంబు కలిమి. 123

తే.గీ. క్షితిమహాధర్మకూటమౌ చిత్రకూట
మందు సంస్థితి, భరతసమాగమంబు
వసుమతీనాథమౌళినివాపకృత్య
ముచితధర్మార్థసంగ్రహోక్త్యుల్బణంబు. 124

కం. అనుజుని తన పాదుకలిడి
పనుచుటస్వాంత్వనముతోడ, భరతుండంతన్
జని నందిగ్రామంబున
ఘనమణిసింహాసనమునఁ గౌతుకమొప్పన్. 125

తే.గీ. పాదుకలనుంచి శ్రీరామపాదజలజ
భక్తిభరితాత్ముఁడౌచు సంపదల మించి
కూర్మితోడుత నుత్తరకోసలాఖ్య
దేశపాలనమొనరింప దీక్షఁగొనుట. 126

తే.గీ. రాముడంతట దండకారణ్యమందుఁ
గ్రూరుఁడైన విరాధుని గూల్చుటయును
బ్రహ్మవిత్తముఁడౌ శరభంగమౌని
వర్యసాయుజ్యమోక్షసంప్రాప్తివిధము. 127

తే.గీ. అఖిలమునిచంద్రుఁడౌ సుతీక్ష్ణాగమంబు
నవనిజాతకు నంగరాగార్పణంబు
కుంభసంభవు దర్శనసంభవంబు
నక్షయేషుధి సంగ్రహమంతమీఁద. 128

కం. పంచవటీ క్షేత్రంబు ను
దంచితగతితోడ నేగి, యట నుటజము ని
ర్మించి వసించుట సుమశర
వంచితయై దైత్యకాంత వనిఁ జేరుటయున్. 129

కం. శూర్పణఖా సంవాద మ
హర్పతివంశేంద్రుతోడ ననుజుండసిచే
నేర్పునఁగోయుట ముకుసెవు
లార్పనలవికాని వైరమది పూనుటయున్. 130

కం. ఆ రక్కసి రావణుతో
శ్రీరాముని శౌర్యధైర్య శీలంబులుఁ ద
న్నారీమణిసౌందర్యముఁ
దీరుందనభంగపాటు, తెలుఁగునుడువుటల్. 131

సీ. ఖరదూషణాది రాక్షస వీరనిధనంబు
మైథిలీరాములమంతనములు
రావణుపయనంబు, రమణీయ మృగరూప
మారీచదైతేయు మారణంబు
జనకజాహరణంబు, మనుజనాథుని విలా
పంబుఁ బక్షీశ్వరు భాషణంబు
నటుమీఁదటన్గబంధాసురమరణంబు
నంతట శబరీ కృతార్చనంబు

తే.గీ. పవనసంభవుఁ గూడి పంపాసరోవ
రంబు విడనాడి ఋశ్యమూకంబుఁ జేరి
భానుపుత్రునితో మైత్రిఁబడయుటయును
వనచరాధిపుఁడౌ వాలివధవిధంబు. 132

కం. దినకరతనయునకొనఁగుట
వనచరరాజ్యాధిపత్యవైభవముఁ దగన్
జనుటయుఁ బ్రావృట్కాలం,
బనుపమకోపాగ్ని జననమవనీపతికిన్. 133

కం. వానరవీరుల రాకయు
భానుజు సన్నిధికి భక్తిభావము తోడన్
నానాపురగిరివిపిన
స్థానవిశేషోపదేశసరణియు నటుపై. 134

ఉ. శ్రీరఘురామభద్రుఁడు, సుశిక్షితమానసుఁడైన పావనిం
జేరఁగ బిల్చి "ముద్రికను సీతకొసంగు" మటంచు నిచ్చుటన్,
ధీరవరేణ్యులౌకపులు, తెంపు రహింప స్వయంప్రభా గుహా
ద్వారము దాఁటి "డస్సి, మదిఁ దప్పి, క్షుధాతురులై చరించుటన్. 135

తే.గీ. ఋక్షబిలనిర్గమంబును బక్షిరాజ
సోదరుండైన సంపాతి సూక్తివిధము
సర్వతారోహణంబకూపారలంఘ
నంబు మైనాకదర్శనంబంబరమున. 136

తే.గీ. సింహికానామరాక్షసీ సంహరణము
పంక్తివదనుని పురవరప్రాంత లంబ
గిరిసమావతరణముఁ దత్పురవిలోక
నమ్ము నిరుపమకౌతూహలమ్ముఁగనుట. 137

చం. శ్వసనతనూజుఁడాదట, నిశాసమయంబున లంకఁజొచ్చిర
క్కసిని బరాభవించి, దశకంధరు దివ్యమహామహోన్నతా
వసథములంగ్రమంబున నపావృతసంశయుఁడౌచుఁగాంచి మా
నసమున ఖేదమొంది, జననాయకునాయికకానరామికై. 138

తే.గీ. వెదకఁదగినట్టి చోటులన్వెదకుటయును
గడకశోకవనంబునఁ గమలవదన
సీతఁ గాంచుట రాక్షసీవ్రాతతర్జ
నములు, పౌలస్త్యునాగమునమును మఱియు. 139

కం. త్రిజటాస్వప్నవిధంబును
నిజచరితము సీత వినుట, నేర్పునఁ బవమా
నజుఁడు గని మాటలాడుట
సుజనావనుఁడైన రాముసుందరితోడన్. 140

కం. సీతకు ముద్రిక నొసంగుట
భూతలపతి పంక్తిరథుని పుత్రునకై భూ
జాతయు మారుతిచేతన్
బ్రీతిం దలమానికంబుఁబెట్టుటయుఁ దగన్. 141

కం. వనభంగము ఘోరాసుర
వనితాభయవిద్రవంబు, వల్లభు కినుకన్
ఘన సేనాగ్రణమారణ
మును పావని కమలజాస్త్రమునఁ జిక్కుటయున్. 142

కం. రావణుతో రఘురాముని
భావిపరాక్రమముఁ దెల్పి భాషించుటయున్
పావని లంకాదహనముఁ
గావించి విదేహకన్యకం గాంచుటయున్. 143

చ. సెలవిడి మారుతాత్మజుని జెచ్చెరఁ బంపి మహాపతివ్రతా
తిలకమునౌ ధరాతనయ దీనశరణ్యుని రాఘవున్మదిం
దలఁచుచు సంతసించుట, సదాగతిపుత్రుఁడు వార్ధిదాటి ధీ
లలితులు నంగదాదు లలరందనతో, రఘురాముఁ గాంచుటన్. 144

ఉ. చూచితి సీతనంచు, రిపుసూదనుఁడౌ రఘునాధుచిత్తసం
కోచము మాన్పి, హర్షమొనగూర్చి, శిరోమణి నిచ్చి మ్రొక్కితా
చూఁచినయట్లు దైత్యవిభుదోర్బలమున్వచియించి భద్రతా
సూచకుఁడౌట మారుతి, యశోధనుఁ డర్కజుఁడాత్మమెచ్చుటన్. 145

ఉ. రాముఁడు, సర్వదుష్కృతవిరాముఁడు, భానుజముఖ్యమర్కట
స్తోమసమేతుఁడైచనుట, ధూతమహావృజినున్విభీషణు
న్ప్రేముడితోడనేలుట, విరించివరాగతగర్వధూర్వహో
ద్దామపరాక్రమాఢ్యుఁడగు దైత్యకులేశ్వరు నిత్యశౌర్యమున్. 146

కం. అతని మరణోపాయము
భూతలవిభుఁడరయుటయును, భూమిందివమున్
భీతిల బ్రహ్మాస్త్రంబున్
జేత ధరించుటయు గడలి చిడిముడిపడుటల్. 147

చ. గడగడలాడివార్ధి, తన కాంతలతోఁ జనుదెంచి సాధ్వసం
బుడిగి నమస్కరించుట, సముజ్జ్వల దివ్యకిరీటరత్నముల్
పుడమి స్పృశింప రామునకు భూధరముల్పెకలించి తెచ్చుట
ల్కడువడిగా సముద్రమును గట్టిముదంబున లంకకేగుటల్. 148

ఉ. లంకను ముట్టడించి యకలంకపరాక్రములైన వానరుల్
జంకక పోరొనర్చుటయు, సర్వజగంబులు మేలుమేల్భళీ
పంకజమిత్రదివ్యకులపావన! శ్రీ రఘురామభద్ర! నీ
కింకరులన్నఁ గేవలముఁ, గీశులోకో? యని సన్నుతించుటల్. 149

కం. ఘటకర్ణ వధవిధానము
పటుతరబలశాలిదేవపతిజిన్మరణం
బటుమీఁద జితజగత్త్రయ
చటులాహవుఁడైన, దైత్యజనపతిమృతియున్. 150

కం. రావణుసంహరణంబు
న్గావించిన రఘుకులేంద్రు, గగనస్థితులై
సేవించుట సురలందఱు
రావించుట సీతనపుడు, రామునికడకున్. 151

చ. అరిపురికిన్విభీషణు, నియంతనుగా నియమించి రాఘవుం
డరుదుగఁ బుష్పకంబున, ధరాత్మజతోడవసించి, రీవిగా
మరలుట, తానయోధ్యకు, సమస్తసుహృజ్జనసైన్యయుక్తుఁడై
భరతునకీశుభంబుఁదెలుప నృపమానతనూజు నంపుటల్. 152

ఉ. శ్రీరఘురామభద్రు నభిషేక విధానము, పౌరరంజనో
దారగుణానురాగపరతంత్రతసైన్యవిసర్జనంబు, సీ
తారమణీమణీసుగుణతాగరిమంబునుఁజెప్పి కావ్య మం
దారసి భావి దివ్యచరితామృతధారలుగ్రోలి పిమ్మటన్. 153

ఉ. ఉత్తలపాటు లేక, కడలొత్తిన మోదముతో మునీశ్వరుం
డత్తరి యోగనిష్ఠ నలరారుచు లోకహితమ్ముఁగోరి, తాను
త్తరకాండమందుఁ గరుణోదధిరాము, లసద్భవిష్యస
ద్వృత్తము వాకొనెం దనవివేకము మౌనులు మెచ్చికొల్వఁగన్. 154

**కావ్యగుణకథనము**

చ. లలితసమాసశబ్దపదలక్షణ భావరస ప్రభేదసం
కలితము, మాధురీగుణనికామమనోహరపాకకల్పనో

జ్వలితము, పాఠ్యగేయపరివర్ధిత కౌతుకమై తనర్చె, భూ
వరతనయారఘూద్వహుల భవ్యవిచిత్రచరిత్రమెంతయున్. 155

కం. ఆ మౌని తా రచించిన
శ్రీ మద్రామాయణంబు క్షితితలమం దే
ధీమంతులు పఠియింపఁగఁ
గామించి ముదంబుఁగూర్పఁగలరో యనుచున్. 156

కం. చింతాకులాత్ముఁడై యే
కాంతమ్మునఁనున్నమౌనికాంతుని చిత్తం
బెంతయు శాంతివహించుచు
సంతాపంబుడుగ నొక్క క్షణకాలములోన్. 157

**కుశలవుల రామకథాగానము**

సీ. శ్రుతిమధురస్వరాన్వితులు పరస్పరో
పమ తనూ నవ్యలావణ్యయుతులు
వేదవేదాంగకోవిదులమలయశోవి
రాజమానులు, మహారాజసుతులు
మునివేషధరులాత్మవననివాసులు కామ
శతకోటి సౌందర్యసారనిధులు
నిరతధర్మపథైకనిష్ఠాతు లనదృశ
ప్రజ్ఞావిచిత్రాభరణులు సతము

తే.గీ. భక్తిభరితులు సోదరుల్పరమశాంత
గుణులు, "కుశలవు"లరుదెంచి వినయమొప్ప
పాహిమాం పాహి యని మౌనిపాదజలజ
ములకుఁ బ్రణమిల్లి లేచి, యంజలిఘటింప. 158

తే.గీ. కరుణతోఁగాంచి దీవించి ఘనతనెంచి
కుశలవులచేత, వేదార్థవశగమైన
రామచరితంబుఁ ద్రిభువనక్షేమమొదవ,
గానమొనరింప జేసె నా మౌనివరుఁడు. 159

తే.గీ. శ్రీరామాయణకావ్యము
ధీరులు కుశలవులు, వాగ్విధేయముగాఁ జె
ల్వారనొనర్చినఁగల్మష
దూరుఁడు వాల్మీకిమోదతోయధిఁదేలెన్. 160

ఆ.వె. వామలూరుసుతుని వనవాణినకఖిలాగ
మార్థవిదులు మౌనులరుగుదెంచు
నపుడు రాజపుత్రులతిముదంబున మౌని
తమకు నేర్పినట్లుదారఫణితి. 161

కం. ఆమూలాగ్రము శ్రీమ
ద్రామాయణకావ్యరాజరాజము నమిత
ప్రేమంబున వినఁజేయుట
లామునితల్లజుని యాజ్ఞనలవడి యుండెన్. 162

కం. మునులొక దినమందాశ్రమ
మున సభసల్పంగ భూమిభుగ్రాట్తనయుల్
చని శ్రీమద్రామాయణ
మును గానమొనర్చి రతులమోదాత్మకులై. 163

కం. విని హర్షబాష్పపూరే
క్షణులై, గగురింప స్వాంగకములఖిలమునుల్
గణుతించిరి బాలుర నే
ర్పును విద్యాకౌశలంబపూర్వంబనుచున్. 164

కం. మునివరు శిక్షాసంపద
మనమునఁ గొనియాడి మౌనిమండలమపుడా
జనపతిసుతులకునిడె దీ
వనలం బ్రథమాశ్రమోక్తవస్తునిచయమున్. 165

సీ. వాల్మీకికృతి వైభవము భలాభలి యంచు
వినయానుబద్ధులై వినెడు వారు
రాఁబోవు కవిరాజరాజికి నాధార
మీ కావ్యరమయని యెంచువారు

గాంధర్వతత్త్వజ్ఞఘనులు వీరలటంచుఁ
బల్మారుప్రీతిమైపల్కువారు
పురుషార్థములునాల్గుఁబొసఁగింపఁజేయు నీ
యభిగీతిగీతమంచలరువారు
తే.గీ. ఇష్టపుష్టి ప్రదాయకంబీ కథాసు
ధారసంబని చెవులార, తనివి దీరఁ
గ్రోలి దాసోస్మ్యహమ్మని మ్రోలనిల్చి
వివిధరీతుల నుతులు గావించువారు. 166

కం. ఈ తీరున లోకము తమ
ఖ్యాతిం గొనియాడఁ గుశలవాఖ్యులు నగర
వ్రాతంబులు, పట్టణములు
పూతములౌమునినివాసభూములు వరుసన్. 167

కం. తిరుగుచుఁ దిరుగుచు నొకదిన
మరుదారనయోధ్యకేగి యవనీతనయా
వరతనయులు రఘుపతిశుభ
చరితము గానమ్మొనర్పఁ జత్వరములలోన్. 168

కం. చారులచే రఘువంశ
క్షీరార్ణవ చంద్రుఁడైన సీతావిభుఁడా
తీరున్విని వారిని సరి
వారిని బంపించి పిలిచి వాత్సల్యమునన్. 169

ఉ. మేనుగగుర్పఁ గౌతుకమమేయమునై వెలివార వారి, స
న్మానితులం బొనర్చి, సురమాన్యులు మీరని, కేలఁబట్టి,తా
సానుజుఁడై సభాస్థలికిఁ జయ్యననేగి, సమస్త మౌనిసం
తానము, రాజమంత్రి భట, నాగరు లాప్తులు గొఁల్వ నెంతయున్. 170

కం. కనకాసనమున రాఘవుఁ
డనుపమ సౌభాగ్యలీలనాసీనుండై
జనితాహ్లాదము తోడుత
ననుజులఁగని యిట్టులనియె నందఱు వినఁగన్. 171

చ. వయసునఁ జిన్నలయ్యు గుణవర్ధనులై యెసలారు నీ మహా
శయులు, మనోజ్ఞ రాగలయ చాతురిమించ, విపంచికాస్వరో
దయమున మేళవించి, వసుధాతనయాత్మచరిత్ర మంతయున్
నయవినయంబులన్వినుచు, నర్మిలితోడ వినుండు మీరిఁకన్. 172

కం. నాకు న్నే మాస్పదమీ
శ్రీ కలితంబవనిజా విచిత్ర చరిత్రం
బా కర్ణించుద మిత్తరిఁ
బ్రాకట యశులైన మౌనిబాలుర వలనన్. 173

కం. అని కుశలవులను గన్గొని
జననాథుండైన రామచంద్రుఁడు ప్రేరేం
చెను శ్రీమద్రామాయణ
మును గాన మొనర్ప నతులమోదముతోడన్. 174

కం. వీణాపాణులు కుశలవు
లా నరపతి చోదనమున నవహితమతులై
గాన మొనర్పఁగ, మార్గవి
ధాన శ్రీ నొందిరపుడు తతకుతుకములన్. 175

ఉ. గోకుల మాలకింప నవ కోమల బాలరసాలపల్లవా
లోకనముం దృజించి మదిలోననురక్తిఘటింపఁ గోయిలల్
రాకొమరుల్విచిత్రపదరాగనముద్భవ భావభావుకా
నీకముఁగూర్ప రామునకు నేర్పమెయిన్ శ్రుతిఁజేసె జంత్రముల్. 176

చ. శ్రుతులొనరించి వీణలకు, సోదరులిర్వురు లేచి మ్రొక్కి భూ
పతి పతియైన రాముని శుభంకర పాదపయోజ పీఠికిన్,
వితతరసానువిద్ధ పదవిస్ఫుటరాగలయాన్వితంబుగా
నతి సుకుమారగాత్రముల నర్మిలిఁబాడఁదొడంగిరయ్యెడన్. 177

కం. శ్రోత్రాశ్రయమగు గేయం
బాత్రయ్యర్థావతంసమని నుడువుటకు
న్పాత్రంబై జనమానస
గాత్రంబులకు న్సుఖమ్ముఁ గలుగఁగఁజేసెన్. 178

కం. ఆ రామాయణ గానము
ప్రారంభమ్మైన మీఁదఁ బ్రథితయశుండౌ,
శ్రీ రాఘవుఁడల్లల్లనఁ
జేరెన్పీఠంబుడిగ్గి, క్షితిపైఁ బ్రజలన్. 179

ఉ. శ్రీకరుఁడైన రాఘవుఁడు, చిత్తము రంజిల సర్వసుప్రజా
నీకముఁజేరి కూర్చుని, పునీతుఁడనైతిని నేటికంచు, శ్ర
ద్ధా కలనంబుదే వినఁగఁ దత్పరతన్గుశుడున్ లవుండు, సో
ద్రేక మనస్కులౌచు నవలీలఁ బఠించిరి కావ్య మీక్రియన్. 180



## శ్రీ రాఘవాభ్యుదయ కథా ప్రారంభము

సీ. వినుఁడు సప్తద్వీప విస్తృతమౌ ధరా
చక్రంబు తమ కైవసమ్మొనర్చు
కొని, మనుముఖ్యులౌ, జననాధుల జితులై
యనువొప్పఁ బాలింప నలరె మున్ను
వారిలో, సగరాఖ్య వసుధేశుఁడంబుధిం
దనపేర సాగరంబనుచు నెగడఁ
ద్రవ్వించె షష్టిపుత్ర సహస్రముల్వరి
వేష్టించి నిల్వఁ దావేగు చూచి

తే.గీ. సకల విధముల సాంపరాయికములందు
రిపులసమయించి, జయరమనపహరించి
క్రతువులొనరించి లోకైక హితమునెంచి
అవనిఁ బాలించి ఘనయశంబాక్రమించె. 181

తే.గీ. ఆ మహారాజ కంఠీరవాన్వయమున
నుత్తరోత్తరశతగుణాయత్తులైన
పుణ్యమూర్తులు వేనవేల్పొడమి పుడమి
నేలిరఖిలానుమోదవాక్యాళితోడ. 182

తే.గీ. శ్రీ కరంబౌచు నలరు నిక్ష్వాకువంశ
మందు రామాయణాఖ్యఁ దానధిగమించి,
అవతరించెను యీ యుపాఖ్యాన రాజ
మఖిలలోకైకసేవ్యమై యహరహంబు. 183

శా. ఆ రామాయణకావ్యరాజమును మీ రాముల చూడంబు నిం
పారన్గౌతుకముల్లసిల్ల వినఁగా నర్హాత్ము లౌనంచుగా
నారంభమ్మునకున్గడంగితి మనూయంజెందకీ గ్రంథవి
స్తారంబందుఁగలట్టి సారమును, మేధాచాతురిన్గ్లోలుడీ! 184

క. ఇటులని కుశలవు లప్పుడు
పటుతర లలితార్థ శబ్ద బంధురబంధో
త్కట రామాయణకథ వి
స్ఫుటముగ నీరీతిఁబాడి రింపుతలిర్పన్. 185

కం. కోసల దేశమున నయో
ధ్యానమభిధపురవరంబు, ధరణీతల మం
దా సరయూ తీరంబున
శ్రీసతి కావాసమనఁగఁ జెలఁగుచు నుండెన్. 186

కం. వేరే తత్పురవర మీ
తీరున భాసిల్లు ననుచుఁ దెల్పఁగ నేలా?
శ్రీ రమణుని, నిజనగరా
ధారంబగు శ్రీ కి సిగ్గుఁ దనరఁగఁ జేయున్. 187

తే.గీ. ఆ యయోధ్యను సూర్యాన్వవాయ జలధి
చంద్రుఁడననొప్పు దశరథసార్వభౌముఁ
డేలుచుండెను సురనుత శీలుఁడౌచు
వివిధ దిశలందుఁ దన కీర్తి విస్తరింప. 188

కం. ప్రియహితరతమతులార్యులు
జయశీలురు, సర్వశాస్త్రసారజ్ఞులు, ని
ర్భయదానచతురు లూర్జిత
నయ వినయాన్వితులు మనుజనాధుని మంత్రుల్. 189

తే.గీ. దేశ సౌభాగ్య ఘృష్టియౌ దృష్టి ప్రథమ
మంత్రి సత్తముఁడా రాజమండనునకు
నఖిల రిపుహంతయౌ జయంతాఖ్యుఁడెలని
సార్వభౌముని రెండవ సచివవరుఁడు. 190

సీ. సుజన రంజనుండైన, విజయుఁడు మూఁడవ
సచివావతంసుఁడా జనవిభునకు
ఇద్ధ చరిత్రుఁడౌ, సిద్ధార్థుఁడా ప్రభు
నకు నాలుగవ మంత్రి, నయవిదుండు
అర్థితార్థ ప్రదుండర్థసాధక వాచ్యుఁ
డై దవ మంత్రి యా యవనిపతికి
లోక విఖ్యాతుండశోకాభిధానుండు
జననాథు నాఱవ సచివవరుఁడు

తే.గీ. మంత్రపాలుఁడు సప్తమ మంత్రిశేఖ
రుఁడు దయానిధియగు సుమంత్రుడు మహీశ
వాసవున కెన్మి దవ మంత్రివల్లభుండు
నగుచు నుతిఁగనిరాయయోధ్యాపురమున. 191

తే.గీ. శ్రీశకైంకర్యరతులు వసిష్ఠ వామ
దేవమును లిర్వురాధరాధీశ్వరేశ్వ
రునకునర్త్విక్కులౌచుఁ దా మనుదినంబు
సంతసముఁ గూర్తు రెవ్వేళ స్వాంతమునకు. 192

తే.గీ. అహరహంబును సేనానులతిజవమున
దండధరునైన బింకానఁ దవిలి శిక్ష
సేయఁజాలిన భుజశక్తిచే సమస్త
దిశల యశము గడింతురా దశరథునకు. 193

సీ. వేదశాస్త్రజ్ఞాన విధురుఁడౌ ద్విజుఁడొక్క
రుండైన వెదకిన నుండ డచట
విలుఁబూని రణరంగముల నారి తేరని
రాకుమారుఁడు గానరాఁడయోధ్యఁ

బ్రభుభక్తి విశ్వాసపాత్రుఁడు గానివాఁ
డెవ్వాఁడు మచ్చునకేనిలేడు
అణుమాత్రైనఁ దా నన్నృతంబునకును బా
ల్పడనెంచు మనుజుఁడయ్యె దలనరుదు

తే.గీ. చక్కఁదనమున దేవవేశ్యలను గాంచి
మించి యెకసక్కెమాడని మించుబోణి
కానరాదెందుఁ గన్నులఁ గనుటకందు
లేని వైచిత్ర్య మిలలేదు లేశమైన. 194

చ. దివి దివిజేంద్రుఁడేలు పగిదిన్వ సుధాతలమున్ నిరంతర
ప్రవిమల ధర్మశాసనుఁడు పంక్తి రథుండు ప్రజానురక్తితో
నవనవహార్ద భావము లనంతములై యెసలార నేలుచున్
స వినయుఁడొచు నొక్కదివసంబునఁ జీరి వసిష్ఠ ముఖ్యులన్. 195

తే.గీ. అర్ఘ్యపాద్యాది సత్కారమాచరించి
కుశల మారసి ధర్మార్థవశగమైన
వాక్య మీరీతిఁ బల్కె నవ్వారితోడ
వినయ ధనుఁడైన దశరథమనుజవిభుఁడు 196

మ. హయమేథంబొనరింప నాదు హృదయంబాసక్తమైయుండె, ని
ర్ణయముంజేయుఁడు నేఁడు మీరు సుముహూర్తం బెప్పుడో కాంచి నన్
దయనీయుండని యుష్మదంతరములన్, దాక్షిణ్యమేపార, దు
ర్జయవాచంయములారయంచని, వివస్వద్వంశ నాథుండొగిన్. 197

కం. ఆ వాజిమేథఫలమున
భూవలయమునందుఁ గల్గు పుణ్యాత్ములలో
భావింపఁబడుదు నొకఁడని
వావిరిననపత్యదోషవర్జితమతినై. 198

**పుత్రవ్యామోహము**

ఉ. అందము చిందులాడు మొగమందున, లేనగవొప్ప వాం
ఛ్రందతిలోననుండి, కనినంతనె, తండ్రిని, పర్వు పర్వు నం

జెందిన మోదతాగరిమఁ జేతులు సాచుచు వచ్చు పుత్రుని
గ్రందుగఁ దీసి, ముద్దిడని కష్టుని జన్మము, జన్మమే భువిన్ 199

ఉ. బాలురతోడఁగూడి, బహుభంగులఁ జిత్రవిచిత్రఖేలనా
లోలమనస్కుఁడయ్యు మదిలో ననురాగమెలర్పఁ జందు
బోలిన మోముచెమ్మగిల, మ్రోలకుఁ బర్విడి వచ్చు బిడ్డసిం
గారముఁ గన్నులారఁ గనఁ గల్గని, పూరుషు పుట్టు వేటికిన్. 200

చ. తన సుతుఁడాఢ్యుఁడంచు, నయతత్పరుఁడంచుఁ బ్రయోజకుండటం
చని విబుధుల్వచింప, వినునంతటి భాగ్యకలావిశేషముల్
బెనఁగొనియున్నవాఁడు, పృథివీస్థలి ధన్యులయందు ధన్యుడై
మను నటుగాని మాదృశుఁడు మానవులందు గణింపనర్హుఁడే. 201

కం. ఈవిధిఁ బల్కిన దశరథ
భూవిభునకు ననియె మౌనిపుంగవులిటులో
ధీవిభవ! కేవలము, నీ
భావమునం గల్గు కోర్కె, ఫలవంతంబౌ. 202

## అశ్వమేధమునకు వసిష్ఠుని అంగీకారము

తే.గీ. లేనిపోని విచారముల్మాను రాజ!
చేయు హయమేధమద్దానిచే సమస్త
పాపముల్దారు సుకృతముల్దాపుఁ జేరు,
కీర్తి సమకూరు, ననపత్యతార్తి తీరు. 203

చ. అని హయమేధమున్సలువుదన్న నరేంద్రుని ముఖ్యవాక్యము
ల్మునికులనాథులెల్లఁ ననుమోదముతోడుత మాటిమాటికి
న్మనములఁ బ్రస్తుతించి, వినుమా! మనువంశసుధాబ్ధిసోమ! స
ద్వినయవిశాలధామ! పృథివీశలలామ! యటంచుఁబ్రీతితో. 204

తే.గీ. ఆ విభుని జేరి యిటువసిష్ఠాదిముఖ్య
మునులు, హయమేధఫలము నీవనుభవింప
దనయులుదయింపఁగలరు, సిద్ధాంతమింత
యనుచుఁబల్కిరి తన్మహీశాధిపునకు. 205

ఉ. రాహువిముక్త చంద్రుఁడన, రాజిలు తద్వదనంబు నందు సం
దేహము లేని చిఱ్ఱగవు, నిస్తులహర్షపరీతసుప్రభా
దోహదముం బొనర్ప, సకుతూహలతన్వినయానురాగసం
దోహమునందడిల్లఁగని, తోయజమిత్రకులేశుఁడిట్లనెన్. 206

చ. మునివరులార! మీనుడులమోఘములౌనటుగానమన్మనం
బునఁగలసంశయంబణఁగిపోయెఁ, గృతార్థుఁడనైతి, మా విక,
ర్తనకులభూపతుల్ఘనతరంబగు కీర్తి గడించిరింక నే
మని పలుకంగలాడ నిపుడధ్వరఘోటకమున్విడుండొగిన్. 207

## అశ్వమేధ యాగస్థల నిర్ణయము

కం. సరయూనదికి నుదీచీ
ధరణిక్రతుశాల విధివిధానముతో స
త్వరమున విరచింపఁగఁ దా
మరుదారననుజ్ఞనొసఁగుడతివత్సలతన్. 208

మ. అని యర్థించిన భూమిపాలకునితో హర్షాత్ములై మౌను లో
జననాథాగ్రణి! వాజిమేధసవదీక్షన్నూని, నీవన్న రీ
తిని నిర్మింపుము యజ్ఞశాల, సరయూతీరంబునన్ శీఘ్రమే
యని నన్మంత్రులఁగాంచి, భూపతి మహాహర్షాత్ముఁడై యిట్లనెన్. 209

తే.గీ. లక్షణవిశిష్టయజ్ఞతురంగమిప్పు
డరయఁ బడుఁగాక మఱి మనసరయువునకు
నుత్తరంబున మఖశాలలుచితరీతి
నేర్పరుపఁబడుఁగాక మీనేర్పుకలిమి. 210

తే.గీ. యజ్ఞసంభారమెల్ల నాయత్తపఱచి
లలితసాకేతనగరమలంకరించి
దేశదేశాధిపతులకుఁ దెలియనంపు
డీశుభోదంతమెంతయు నింపుమీర. 211

కం. రావింపుఁడు బంధువులను
గావింపుఁడు తత్తదుచితఘనమర్యాదల్

సేవింపుఁడతిథిచయమును
భావింపుఁడు దుర్యశంబుపైఁ బడకుండన్. 212

కం. క్షుద్రాంతరాత్మ లెడనెడ
ఛిద్రంబులు వెదకుచుంద్రు క్షితిపై ధర్మో
న్నిద్రములగు నీదృగ్విధ
భద్రంబుల వేదశాస్త్రపారగులయ్యున్. 213

కం. క్రతువున నే విధమౌ నూ
క్నృతరంబగు లోపమైననంధిలకుండన్
జతనంబునఁ జూడుం డవ
హితమతులౌ మీరలస్మదిష్టాప్తికినై. 214

కం. ఉత్తలపడుచును బ్రాయ
శ్చిత్తంబుల నెఱిఁగియుండి, చేయించఁగఁ దా
జిత్తంబునఁ దలపెట్టక
మత్తిల్లుచునుండుటయును, మౌఢ్యాన్వితుఁడై. 215

కం. గ్రహింయింపఁ దగనిదానము
గ్రహియించుచు జీవనమ్ముఁ గడపుటయుఁ దగన్
మహిలోఁ జేయింపఁగఁ దగి
రహినొప్పని యాజ్ఞికానురక్తుండగుచున్. 216

కం. సలుపుట నీ గుణములు మూఁ
డలవడి చరియించిరేని యగ్రకులీనుల్
పలురకములైన శాస్త్రము
లిలవేదచతుష్టయార్థమెఱిఁగియు మదిలో. 217

తే.గీ. అట్టి విద్వాంసులకు జీవయాత్రముగియ
రాక్షసత్వము శిక్షగా రవితనూజుఁ
డొసఁగు వారలె బ్రహ్మరాక్షసులనంగఁ
దిరుగుచుందురు జన్మముల్ జరుగుచోట్ల. 218

మ. అతి సూక్ష్మంబగు లోపమైనను సరే, యజ్ఞంబులందున్నమా
పతితంబయ్యెనయేని, కర్తలకు సంప్రాప్తింపఁగా జేసి దు
ష్కృతమున్మృత్యువుఁ గూర్చుచుందురిల, నాకీనాథులత్యుగ్రులీ
క్రతువున్మీరెటు పూర్తిసేయఁగలరో, రానీక యే లోపమున్. 219

కం. ఎంతటి యాజకులకుఁ దమ
స్వాంతమ్ములఁదోఁచనట్టి స్వల్పతమంబౌ
మంతువు నధ్వరమును గని
నంతనె గను బ్రహ్మరాక్షసావళి పృథ్విన్. 220

**యాగనిర్వహణకు మంత్రుల అంగీకారము**

కం. కావున నందఱు మఖము
ప్రోవంగావలయు నిపుడు పూర్వోత్తరముల్
భావించుచు ననిశంబన
భూవరునకు ననిరి మంత్రిపుంగవులిటులన్. 221

కం. తలపై నిడి మీ యానతి
సలలితమగు పుష్పమాలచాడ్పున ధరలో
పలఁ జరియించుట సతమిన
కులనాయక! మాకు సహజగుణమగుఁ గాదే? 222

కం. దాసులకు మీరు వేరిఁక
శాసనముం జేయనేల? జననాయక! యే
దోసము పొసఁగక కాచెద
మీసవనము ముగియువఱకు నెంతయుఁ బ్రీతిన్. 223

కం. అన విని హర్షాత్ముండై
జననాథుఁడు వారికపుడు, చయ్యన సవర
క్షణచణములగు నుపాయము
లను ముఖ్యములైనవెల్లనాదేశించెన్. 224

కం. ఈ విధి మంత్రులకాజ్ఞన్
గావించిన పంక్తిరథుని, గని మునివర్యుల్

దీవించి చనిరి తమ తమ
తావులకున్మరల వచ్చెదముగా కనుచున్. 225

తే.గీ. పార్థివోత్తమునాజ్ఞను బడసి విప్ర
వర్యులెల్లరు స్వీయనివాసములకుఁ
జనిరి పిమ్మట జనపతి సచివవరుల
హర్ష పర్యాకులేక్షణుండౌచుఁ జూచి. 226

కం. గురువర్యులానతిచ్చిన
సరణిం జఱిగింపవలయు సవనము నాచేఁ
గరమరుదారఁగ మీరీ
భరముం దలఁదాల్చి ప్రాణబంధువులగుటన్. 227

చ. ఇటులని నేఁటికీ సభముగించుదమింతటనుచుఁ బల్కుచున్
జటుకున సింహపీఠిదిగి క్ష్మా విభుఁడొయ్యనశంఖకాహళ
స్ఫుటమధురధ్వనుల్విజయసూచక నైగమఘోషసర్వది
క్తటములునిండఁ గోసలసుతావసథంబును డాసె నాదటన్. 228

## భార్యలకు దశరథుడు యాగదీక్షను గూర్చి చెప్పుట

కం. పూజితుఁడై దారలచే
నాజగతీవల్లభుండహర్పతివంశో
త్తేజుఁడు దశరథుఁడవెని
ట్లా జలజాక్షుల సమక్షమందుత్కలికన్. 229

కం. సుతులకు నై నేనిఁకనొక
క్రతువొసరింపంగలాడఁ గావున దీక్షా
యుత చిత్తలగుఁడు మీరన
నతివలుమోదాబ్ధినోలలాడిరి వరుసన్. 230

కం. అంతం గొన్ని దినంబులు
సంతసమున జరుగనొక్క సమయమునం దే
కాంతమ్మున దశరథభూ
కాంతుని మ్రోలన్వసించి, కౌతుకమొప్పన్. 231

తే.గీ. మంత్రిసత్తముఁడైన సుమంత్రుఁడిట్టు
లనియెనో మహారాజ! రాజాధిరాజ!
మఖవిధానముఁదెల్పి రా మౌనివరులు
కాని మఱియొక విషయంబు కలదు వినుము. 232

వ. సకల భవిష్యద్వృత్తాంతవేత్తయుఁ దపోనిధి యునగు సనత్కుమారుండు, దేవరపుత్రోత్పత్తిం గూర్చి యొకానొక కథ నానతిచ్చెనని మహర్షివర్యులను కొనుచుండందొల్లినే వినియుంటి నది యెట్లంటినేని. 233

తే.గీ. పరమధర్మ స్వరూపి విభండకాఖ్య
మునికులేంద్రుఁడు కాశ్యపు నను(గునుతుఁడు,
నిరత సురనుతకీర్తి సన్నియమవర్తిఁ
కలఁడటంచును విదితమేకద? ధరిత్రి. 234

**ఋష్యశృంగుని సుదీర్ఘబ్రహ్మచర్యము**

కం. కలుగం గలండతనికి భూ
వలయంబున బ్రహ్మచర్యవాస్తవ మహిమో
జ్జ్వలరూపంబగు కొమరుఁడు
చెలువారఁ దపస్వి ఋశ్యశృంగాఖ్యుడొగిన్. 235

కం. స్త్రీపుంభావము లెఱుఁగం
దేపల్లెలకైనఁ బోవఁడెప్పుడు తండ్రిం
దాపసులను వెనువాయం
డాపరమర్షి ప్రధానుఁ డవిరళభక్తిన్. 236

వ. మఱియు నగ్నిశుశ్రూషాతత్పరుఁడై ప్రాథమిక బ్రహ్మచర్యముఁ గడుపుచుండఁ గొంతకాలమ్మున కంగదేశాధీశ్వరుండగు రోమపాదుం డధర్మానువర్తియగుటచే, నాదేశంబున సకల ప్రాణిపీడాకరంబగు ననావృష్టిదోషముత్పన్నంబై చిరస్థాయికాఁ గలదు, అందులకా రాజేంద్రుఁడెంతయుం జింతించి యనావృష్టి రూపంబగు తన పాపోపశాంతికిందగునుపాంయబారసి యనుగ్రహింపుఁడని, వేదశాస్త్ర విచక్షణులగు భూసురోత్తములం బ్రార్థించిన వారు విభండకముని కుమారుండగు ఋష్యశృంగునిట కెవ్విధినైన రప్పించి, బహూపకారపూర్వకముగా నా పరమర్షివర్యునకు నీ

కుమారికయగు శాంతను నిర్విచారముగనొసంగమని యానతిచ్చినవిని, అస్ఖలిత బ్రహ్మనిష్ఠుండగు నమ్మహాత్మునిటకుఁ దోడితెచ్చు నుపాయంబెద్దియని యడుగు నంతం బ్రాహ్మణోత్తములు, రాజేంద్రా! అందులకు నిరపాయంబైన యుపాయంబు కలదద్దానింజెప్పెద మాకర్ణింపుము, అతండెల్లప్పుడు దపమొనర్చుచును, వేదాధ్యయనముఁ జేయుచుండునే గాని, లౌకిక విషయములేవియు నెఱుగడు, ఇట్టి వానినాకర్షించి వశ్యునిం గావించి యిప్పట్టణమునకుఁ దోడితేఁగలవారు కాంతలేగాని మఱియొకరు కానేరరు. కాన సాటిలేని శృంగారవతులగు వేశ్యాంగనల నటకుం బయనమ్ము సేసి పంపవలయు ననిన, భూపాలుండందులకు సమ్మతించి యట్లకావించిన నవ్వారాంగనలు, తత్తపోవనముంజొచ్చి యేకాంతమ్మున నమ్మునిం సందర్శనమొనర్చి, తమ తమ శృంగారచతురవాక్య కలాపములచే వశ్యునిం గావించుకొని తోడి తెచ్చిన, రోమపాదుండతిహర్షమ్మున నమ్మహాత్మునెదుర్కొని, వినయవినమ్రుఁడై శ్రౌతోక్తవిధానమ్మునం బూజించి, శుభముహూర్తమ్మునఁ గుమారికయగు శాంత నొసంగి పరిణయంబుఁ గావింపఁగలండు. అంత నా దేశంబునంద నావృష్టి దోషం బదృశ్యంబు కాఁగలదు. ఋశ్యశృంగుఁడు, తన ప్రియ పత్నియగు శాంతంగూడి, తద్దేశమునకు గల్పపాదపంబునాఁ బ్రసిద్ధి వహించి తత్పురంబునందధివసించఁ గలండని, మఱియు నమ్మహాత్ముండగు సనత్కుమారుండుతెల్పిన ప్రియవృత్తాంతముందేటతెల్లఁగఁ దెల్పెద నాకర్ణింపుఁడని యిట్లనియె. 237

తే.గీ. అవని నిక్ష్వాకుకులమందు నవతరింపఁ
గలఁడు సుజనానువర్తి యగణ్యకీర్తి
నిరతసత్యవ్రతాచారనియమమూర్తి
శత్రుసమవర్తి దశరథచక్రవర్తి. 238

ఉ. వానికి రోమపాదజనవల్లభుతో ఘనమైత్రి కల్గు సం
తానవిహీనుఁడై దశరథక్షితిపాలుఁడు యజ్ఞమొండు తా
బూని యొనర్పనిచ్చఁగొని, పూర్వజపుత్రు వసిష్ఠునాజ్ఞ స
న్మానముతోడ మౌళినిడి మంత్రులతోఁ గను నంగభూపతిన్. 239

కం. కని యనపత్యతఁ బాయన్
మనుజేశ్వర నేనొనర్చు, ముఖమునకిపుడే
మన శాంతాపతి రావలె
ననుచుండిరి మౌనివర్యులతిహర్షమునన్. 240

**శాంతావివాహ నిశ్చయము**

కం. కావున నీ మునిపుత్రు
న్పావకసమతేజునిపుడు, భార్యాసహితున్
గావించి పంపవలయును
మా విన్నపమాలకించి మనుజాధీశా! 241

తే.గీ. ఇటుల యాచించి యటనుండి యింతితోడ
మునివరేణ్యుని దశరథమనుజవిభుఁడు
చెలఁగి సాకేతపురికిఁ దేఁగలఁడు వాని
వలనఁ గ్రతుఫలమొందఁగాఁ గలఁడతండు. 242

కం. కలుగుదురా దశరథునకు
నలువురు సుతులఖిలలోకనాథులు నిత్యో
జ్జ్వల మతులు వంశకర్తలు
చెలువారఁగననుచుఁ జెప్పె క్షితితలనాథా. 243

కం. కృతయుగమునాఁటి కథ యిది
మతిమంతుఁడ వింటిఁగాన, మౌనులసభలో
హితమతి సనత్కుమారుం
డతిమోదముతోడఁ బల్కెనని మనుజేశా. 244

చ. స్వయముగ నంగదేశ పరిపాలునియొద్దకు నేగి శాంతతోఁ
బయనమొనర్చి వేగమ, విభండకపుత్రుని ందోడితెమ్ము దు
ర్జయజయశీల! యోనృపలలామ! యటంచు సుమంత్రుఁడెంతయో
భయవినయమ్ములన్పలికె, భానుకులాగ్రణితోడనాదృతిన్. 245

మ. అమితానందములతోడ పంక్తిరథుఁడాయామాటలన్ప్రీతినం
భ్రమయుక్తుండయి శ్రద్ధతో విని మహాభాగ్యంబుచేకూరె మా

కమలాప్తాన్వయరాజమండలికి నీకాలంబునంద
య్యమినాధుంగొని రాఁదలంచి యటకత్యంతాభిలాషాత్ముఁడై. 246

**అంగదేశమునకు పరివారముతో దశరథుడు వెళ్ళుట**

మ. స్వకులాచార్యుఁడు నౌ వసిష్ఠముని కీ సందర్భమున్భక్తిపూ
ర్వక వాక్యంబుల విన్నవింపఁ గరుణాపారీణుఁడై యాతఁడో
సకలక్ష్మాతలనాధ! చిత్రరథుఁ డీషన్మాత్రమున్సంశయిం
పక పంపంగలఁడా మహాత్ము నిటకున్పత్నీ సమేతంబుగా. 247

ఉ. కావున నంగరాజసముఖంబున కేగి వధూజనంబుతో
భూవర! మంత్రిభృత్యహిత భూసురవర్గముతోడఁ గూడి నీ
వీ విధియజ్ఞకర్తవగు టెల్లను దెల్లముఁగాఁ దెల్పి నం
భావితమానసుండవయి మౌనికులేశ్వరుఁదోడి తెమ్మిఁకన్. 248

కం. అని యాశీస్సులనిడి యతఁ
డనిపిన నజరాజతనయుఁడఖిలార్థంబుల్
గనినటుల మదిఁదలంచుచు
జనెనంతఃపురికి హర్షసంభ్రమవశుఁడై. 249

కం. అంచితముగ నిటుచని రా
ట్పంచాననుఁడాక్షణంబ పయనమొనర్చెన్
మించిన కౌతుకమున నల
రించుచుఁదా నంతిపురపుస్త్రీతతినెల్లన్. 250

కం. అటు మీఁదట సచివులతో
భటవర్గముతోడ ముఖ్యపత్నులతోడన్
త్రుటిలోనఁబయనమై చనెఁ
బటుశాసనుఁడైన యంగపతిపురమునకున్. 251

ఉ. ఈవిధిఁ గోసలేశ్వరుఁడహీన ముదమ్మునవచ్చుచున్న నం
గావనినాధుఁడీ విషయమంతకుమున్నె యెఱింగి మంత్రిభృ
త్యావళి చేరి కొల్చుచు రయంబున రా వెనువెంటఁ దా, నుహ్వా
ద్భావముతో నెదుర్కొనె నపారముదశ్రుపరీతనేత్రుఁడై. 252

చ. ఇటు లెదురేగి కోసలమహీధవునుత్కట గౌరవంబుతో
జిటుకునఁ గౌఁగిలించి, నృపశేఖర! చూచితినిన్నినాళ్లకి
ప్పటికిని యంచనామయశుభంబులఁ బ్రశ్నమొనర్చి ప్రీతి
స్ఫుటతరభాషణమ్ముల నపూర్వకుతూహలముప్పతిల్లఁగన్. 253

కం. పరివారసహితుఁడౌ నిన
కులనాథుని దోడితెచ్చి కొమరొప్పఁగ నా
ధరణీపతి తన గృహమున
నరుదారఁ బ్రవేశపెట్టె నతి వినయమునన్. 254

**ఋష్యశృంగునికి చిత్రరథుడు దశరథుని కోర్కెలను విన్నవించుట**

ఉ. అంతట ఋశ్యశృంగుకడకా వసుధాపతి భక్తియుక్తుడై
యెంతయు నమ్రభావమున నేగి ప్రణామమొనర్చునంతలో
జెంతకు వచ్చి యల్లునకుఁ జిత్రరథుండిటుచెప్పెఁ బావన
స్వాంత యితండు, కోసలనృపాలుఁడు! మా నిజ మిత్రుఁడంచొగిన్. 255

తే.గీ. మఱియు మా సుత శాంతకీమహితయశుఁడు
జనకపిత! నీకు మామగారనఘచరిత
యని సహర్షాకులేక్షణుండౌచు మౌని
గౌరవించెను, తగురీతిగ దశరథుని. 256

చ. సునిశిత శేముషీవిభవశోభితుఁడౌ నజరాజసూతి, త
జ్జనపతిసేయు భోగమనిశమ్ము గ్రహించుచు నా నృపాలుతోఁ
దన సవనోత్సుకత్వమునుదారతఁ జెప్పి యొకానొకప్పుడీ
మనవిని జిత్తగింపు సూరమాన్య! యటంచును బల్కెనీక్రియన్. 257

కం. కూఁతుని నల్లుని మాతో
నీతరుణమునందుఁ బంపవెంచఁగవలయున్
భూతలనాయక స్వజన
వ్రాతముతో మీరు కూడ రాఁదలఁపవలెన్. 258

కం. ఇదినీ మిత్రుని యాచన
మదినుంచి కృతార్థుఁ చేయుమా! యని వేడన్

హృది< బొంగి యతడు విను నా
యదికాదే? మీదుకృత్యమనుచిట్లనియెన్. 259

కం. అల్లు<డు< గూ<తురు మీతో
వెళ్లెడు నపుడేగుదెంత్రు విధిగా మఖమం
దుల్లసిలు నిన్ను<గాంచగ
నిల్లాంద్రం గూడివత్తు నేనటుమీ<దన్. 260

కం. ఈ మాటలు విని దశరథ
భూమీశ్వరు<డాత్మమెచ్చిపొల్పార<గ నా
ధీమహితునింట నటుపై
నేమముతో నొక్కదిన మునివసించితగన్. 261

ఉ. వారమురోజులయ్యె జనవల్లభ! మేమిటు వచ్చి యేమిం
దీరిక లేదు రేపరుగుదెంచవలెన్ స్వపురం బటంచు ని
ర్ధారణ చేసి పైనము ధరాపతి పల్కిన రోమపాద భూ
పాలు<డు సమ్మతించిము నిపాలునితోడ వచించె నీవిధిన్. 262

ఉ. ఓముని చంద్రమా! యాపుడయోధ్యకు నేగి సతీయుతంబుగా
శ్రీమదహస్కరాన్వయనరిష్మని సత్క్రతువుగ్రమస్థితిన్
బ్రేమము మీఱ మీరునెరవేరిచి రండిది లోకసమ్మతం
బౌ మహనీయ! యంచన<గ నట్టియొనర్తునవశ్యమే ననెన్. 263

కం. అని ఋశ్యశృంగు<డంతట
దనపత్నీసుతల<గూడితరలు దశరథా
వనిపాలుతోడ< బయనం
బును సుస్థిరపఱచుకొనియె మోదమెలర్పన్. 264

సీ. ఆరాత్రి సూర్యాన్వయక్షీరవారాశి
చంద్రు<డౌ దశరథ చక్రవర్తి
ఇష్టసంభాషణతుష్టుడై యంగాధి
పతిచేత వీడ్కోలు వడసి, సపరి

వారు(డై యవరోధవనితాజనముతోడ
మౌనితో శాంతాకుమారి తోడ
ఆయుధపాణులై యష్టదిక్కుల నిండి
వేడ్క రక్షకభటుల్వెడలినడువ

తే.గీ. వందిమాగధగీతముల్పందడింప
జయజయారావముల నాకసము చలింప
బ్రాహ్మణస్వస్తి ఘోషముల్ప్రస్ఫుటింప
జేరి సాకేతనగరోపసీమలకును. 265

చ. స్వపురమలంకరింప భటవర్గమునంపివిభుండు ముం
నుపచితకౌతుకంబున, సముజ్జ్వలతేజుని ఋశ్యశృంగునిం
దపనశతాభమంజుల రథంబున నుంచి సతీయుతంబుగా
గపురవుహారతుల్విబుధకాంతలొసంగగజేరెఁ దత్పురిన్. 266

తే.గీ. దివ్యమంగళ నిలయమై తేజరిల్లు
చున్న శ్రీ యయోధ్యాపురీశోభఁ గనుచు
రాజసౌధముఁ జేరె నారాణ్మహేంద్రుఁ
డల్లుని గూఁతునిం గూడి యుల్లమలర. 267

కం. శాంతాకాంతను దశరథ
కాంతలు గైకొనుచుఁ జనిరి కౌతుకమున శు
ద్ధాంతమునకు నామెయు వి
శ్రాంతిగ నటనుండెఁ బ్రమదసల్లాపములన్. 268

ఉ. అల్లుని తోడఁ గూడి సరసాన్నములన్భుజియించి వేడ్కసం
పల్లలితాత్ముడైన జనపాలకుఁడా నిశినిర్విచారుఁడై
మెల్లగ నిద్రవోయెఁ దన కోరికలెల్ల ఫలించినట్లుగా
నుల్లములోన నెంచి కరుణోజ్జ్వలుఁడీముని ముఖ్యుఁడంచొగిన్. 269

కం. అల్లునిఁ గూఁతునిఁ గాంచుచుఁ
బెల్లుబ్బిన మనముతోడఁ బృథ్వీపతి శో
భిల్లుచుఁ గొన్ని దినంబులు
వెళ్లించెను లెక్కపెట్టి వేచుచు శుభమున్ 270

కం. అంతట సంప్రాప్తించె వ
సంతము సుమనోజ్ఞలీల సకలారణ్యా
భ్యంతరయుగపద్వికచ ల
తాంతామోదానుమోదితాశాంతమ్మై. 271

ఉ. ఆవిధి నవ్వసంతము సమాగమైన వసుంధరావిభుం
డావహిలప్రమోదము, మహర్షివరేణ్యువసిష్ఠుఁగాంచి సం
భావన పూర్వకంబుగ నమస్కృతి సల్పి వచించె నిట్లు మీ
ధీ విభవంబుచే, మఖవిధిజ్ఞులఁ బేర్కొనుఁడంచు మాటికిన్. 272

చ. అది విని భూపతీ! వినుమటంచును బల్కె వసిష్ఠుఁడిట్లు నీ
మది ననుమానమొందకు, సమస్తభరంబును నిర్వహించెదన్
సదయుఁడు ఋశ్యశృంగముని సాయమొనర్పఁగ జాలియుండె నీ
యదనుననిర్విచారకుఁడవౌచు సుఖింపుము మాటలేటికిన్. 272

**యజ్ఞ విషయమును దశరథుడు ఋష్యశృంగునికి నివేదించుట**

చ. అన విని హర్షమొంది వసుధాధిపుఁడాదట ఋశ్య శృంగునిన్
గని గురునాజ్ఞచేత నొక ఘస్రమునందు వినమ్రుఁడౌచు నో
యనఘ చరిత్ర! సాంగ్రహణి యాగమొనర్పఁగఁ "చైత్రపూర్ణిమా
దినము" శుభప్రదంబని, పదింబది బల్కుచునుండె వేదముల్. 274

తే.గీ. కానఁ దత్పుణ్యదినమునఁ గరుణతోడ
నస్మదభిలషితంబైన యశ్వమేధ
యజ్ఞమునకంగభూతమై యలరు "సాంగ్ర
హణి" యొనర్పఁగఁజేయు "బ్రహ్మత్వమొంది". 275

మ. అని ప్రార్థించిన ఋశ్యశృంగుని నతండాభూవిభుం గాంచి మో
జననాథాగ్రణి! సమ్మతించితిని, మత్సాహ్యంబు చేకూరు నీ
కనిశమ్మున్ సవనంబునందు; విడుఁడీ, యశ్వోత్తమంబున్నడిన్
జనమున్మెనుల విప్రబాంధవ సుహృజ్జ్యానాధులంబిల్వుఁడీ. 276

ఉ. భానుకులేంద్ర! త్వత్కృత సవంబెనలారు సమస్తలోక క
ల్యాణదమై మహాత్మ, పరమర్షివరేణ్య వసిష్ఠునాజ్ఞసం

ధానమొనర్చు వస్తుసముదాయమునెల్ల నికేల జాగనన్
వీనులవిందొనర్చితి వభీష్టమునేఁడెఫలించెనంచాగిన్. 277

చ. వినయవినమ్రుఁడౌచుఁ బృథివీవిభుఁడామునిముఖ్యువీడి, చ
య్యన స్వనికేతనమ్మునరుదారఁగఁ జేరి వసిష్ఠమౌనికి
న్వినిచి యుదంతమెల్ల, జనవిశ్రుతులౌ సచివాగ్రగణ్యులన్
బనిచె మహామునీంద్రుల నపారకృపాళురఁ దోడితేరఁగన్. 278

తే.గీ. చని సుమంత్రుఁడు మొదలగు సచివవరులు
సకలమునిపుంగవుల సమక్షమున కపుడు
వసుమతీశ్వరుప్రార్థనా వచనములను
విన్నపముఁ జేసి రెంతయొ వినయమొప్ప. 279

చ. కనులఁ బ్రమోదబాష్పములు క్రమ్మగ సర్వమునాలకించి యా
ముని జనముఖ్యులెల్లరు నపూర్వకుతూహలమగ్న చిత్తులై
జనపతిఁ గాంచవచ్చునెడఁ జయ్యనఁ బంక్తిరథుండును న్మహా
వినయముతో నెదుర్కొని, నివేశమునందుచితాసనంబులన్. 280

ఆ.వె. కూరుచుండఁ జేసి, కొమరొప్ప సేమంబు
లరసి శ్రౌతవిధి సమర్చనంబు
సలిపి వారితోడ, సదమలమానసుం
డగుచుఁ బల్కె నిట్లు హర్షమొసఁగ. 281

కం. యజ్ఞమునారంభింప న
నుజ్ఞం గృపసేసి యిపుడనూన ప్రేమన్
విజ్ఞులు మెచ్చఁగఁబాల్గొని
ప్రజ్ఞాబలమెల్లఁ జూపఁ బ్రార్థింతుమిమున్. 282

మ. అని ప్రార్థించిన భూవరుండు, జనితాహ్లాదంబుతో మౌను లి
ట్లని రో పార్థివవంశమౌళిమణి! నీ యాగంబునిర్విఘ్నతన్
గను, మేమందరమున్ సహాయకులమై, కార్యంబు సాధింపఁగా
మనమందున్ దలపెట్టి వచ్చితిమి, నేమం బొప్ప నీ చెంతకున్. 283

కం. అని దశరథుతో మునివరు
లని శాంతా ప్రాణనాథు, నటుమీఁద వసి
ష్ఠుని గని వినయముతో నతు
లనివారణఁజేసి కుశలమారసిరంతన్. 284

కం. వారున్న చోటునకు రఘు
వీరుఁడు చనుదెంచి వినయ వినమితుఁడై శ్రీ
మీర శుభాసనమునఁజెలు
వారన్వసియించి యిట్టులనియె మృదూక్తిన్. 285

చ. పిలిచితి బంధువర్గమును, బిన్నలఁ బెద్దల విప్రవర్యుల
న్గులగురునాజ్ఞనొదలనకుంఠితభక్తి వహించి ప్రేమమై
యిలఁ గల రాజమండలమునెల్ల మదీయమఖంబుఁ గాంచఁగా
వలసిన సర్వవస్తు సముదాయముఁ గూర్చినవాఁడనెంతయున్. 286

కం. సురుచిరమఖశాలలు మన
సరయూనది చెంత నుచిత సన్నాహముతో
విరచితములయ్యె నగరము
నరుదారనలంకరించి రతిమోదమునన్. 287

కం. అన విని ముని లిట్లనిరో
మనుజాధిప! మఖమొనర్ప మనకాలస్యం
బణుమాత్రమైన లేదిఁకఁ
గనుమీ! శుభపాళి ననుచుఁ గరుణాన్వితులై. 288

కం. సంతసమునొంది దశరథుఁ
డెంతయు వినయమ్ముతోడ నేడ్తెఱ స్వీయ ని
శాంతమ్మునకున్ జనె ముని
కాంతులతో నమరలోక కాంతుఁడువోలెన్. 289

చ. దశరథరాజమౌళికి నుదారతనధ్వరదీక్షనిచ్చిరా
నిశితతపోధనాగ్రణులు నిష్టమెయిన్ సవనాశ్వరాజమున్
దశదిశలం జరింప వసుధాపతి వీడెఁ బ్రమోదియై యహ
ర్నిశము యశమ్మువోలెనధినేతలతోఁ దిరుగాడె నద్దియున్. 290

ఉ. హాయనముంజరించి భువి నశ్రమ లీలఁ బురంబుఁ జేరఁగా
ధీయుతులౌ మునీశ్వరులధీశ్వరుచే హయమేధ యాగమున్
జేయఁగఁ జేసి రొక్క మొగి, జేయని వేల్పులు పుష్పవృష్టిచే
నా యవనీశు పట్టణమునంతయు నించిరి కౌతుకంబునన్. 291

ఉ. అంతట భూధవుండు సముదంచిత కౌతుక ముల్లసిల్లఁగా
నెంతయు నమ్రభావము వహించి విభండకపుత్రుఁ గాంచి మీ
స్వాంతమునందు నన్ను జరితార్థునిఁ జేయఁదలంచి యిట్లు మా
ప్రాంతమునేగుదెంచితి మహాత్మయటంచును మాటిమాటికిన్. 292

ఉ. సన్నుతిఁ జేసి నేఁటికిటు సప్తి మఖంబు సమాప్తమయ్యె వి
ద్వన్నుత నాకుఁగల్గు ననపత్యతఁ బాయఁగఁజేసి వంశమ
భ్యున్నతిఁగాంచఁ జూడుము, తపోధననాథ! మహ ప్రభావసం
పన్నుఁడ నీవుగాన, సదుపాయము నిందులకై స్మరించుమా. 293

**దశరథునకు పుత్రకామేష్టియాగమును గూర్చి ఋష్యశృంగుడు చెప్పుట**

కం. అని దశరథుఁ డతి వినయం
బున వేడిన మునివరుండు, పొడమిన ప్రేమన్
మనమున నీషత్కాలము
ఘన యోచనఁజేసి ధరణి కాంతుని తోడన్. 294

ఉ. భానుకులాబ్ధిచంద్ర సదుపాయము! తోఁచె మనంబులోనసం
తానముగల్గు నీకిది యథార్థము నమ్ము ధర్మమంత్రసం
మానితమైన యిష్టి సలుపం దగు నిత్తరి పుత్రసౌఖ్యసం
ధానమొనర్చు నయ్యది, విధానముఁ దెల్పెద నాలకింపుమీ. 295

సీ. ఇట్లని పుత్ర కామేష్టి విధానంబుఁ
బరిపూర్ణముగఁ దెల్పి పరమయోగి
పుంగవుండగు ఋశ్యశృంగ మహాముని
కోసలేశ్వరునకుఁగుతుక మొప్ప

సల్పింపఁ బుత్రీయ సవనంబునందు వా
ణీశ గౌరీశ సురేశ ముఖ్య
సురులు మౌనులు యక్షవరులు విద్యాధర
గరుడ గంధర్వ కిన్నరులదృశ్య

తే.గీ. కాయులై యందుఁ దమకురాఁగల హవిస్సుల
గొఁనఁగ నరుదెంచి, కువలయేశుని యదృష్ట
గరిమకునుమెచ్చి తలలూఁచి, గారవించి
నిండి మఖశాల యెదుటఁ గూర్చుండి రంత. 296

చ. అనుపమ హేమపీఠమున, నాత్మవిదుల్భజియించుచుండ నా
వనజభవుం డపూర్వ గుణవర్ధనుఁడై చెలువొంద దేవతా
గణ మతిభక్తిభావపరికల్పిత నమ్రశరీరులై మహా
వినయముతో నమస్కృతులు, వేమరుసల్పి వచించిరిట్లుగిన్. 297

**రావణుని అకృత్యములను దేవతలు తెల్పుట**

కం. ఆలింపుమయ్య మా మొఱ
నేలింపఁగ జూడఁబోకు, మీలోకములన్
జాలిఁబడి రాక్షసులచే
వేలుపులకుఁ బెద్దవయ్యు వేదాధారా. 298

చ. కలఁడుగదా పులస్త్యజుఁ డఖండిత దుష్టపథానువర్తనుం
డలఘుపరాక్రముం డతని, యాజ్ఞకులోఁబడి సర్వలోకముల్
మెలఁగఁగవచ్చె నే మనుచు, మీకు వచింపఁగనేర్తుమయ్య మా
కలుషము పండిపోయె నిఁకఁ, గానము ముందటి త్రోవ యెట్టిదో. 299

వ. నిరపరాధులందండింపఁ బూనుటెంతయు విషాదకరంబగు చుండె నని మఱియు
300

చ. కలహములందుఁ దావిలయకాలభవాగ్నిని వజ్రివజ్రమున్
వరుణునిపాశము న్మనుజవాహనుకుంతముకాలదండమున్
సరకుఁగొనం డతండమిత సాహసవంతుఁడు, దానికేమి? యం
దులకెపుడెట్టి కష్టమునుదోఁచదు మా మది భారతీపతీ! 301

ఉ. అన్నిఁటికన్నమిన్న హరునంతటి వానినిలెక్కసేయఁ డా
పన్నులమైనమమ్ము సురవల్లభ! నీ వెటు లేలుకొందువో
పన్నుము దీని కొక్క సదుపాయమునిప్పటికైనఁగాని మే
మెన్నని విన్నవింతు మసురేశ్వరు దుష్కృతకృత్యముల్ ప్రభూ!

ఆ.వె. వ్రణముపైనఁ దెచ్చి, లవణముంచినయట్లు
కాదె? రావణునకుఁ గల్గినట్టి
వరబలంబుజూడ, సురవర మా యెడ
ననుచు వగచుచుంటి, మనవరతము. 303

ఉ. అప్పటి కప్పుడెట్లొ ముదమంది మహాకఠినాత్ముడైన యా
ముప్పులమారి రావణుని, మోనముఁ జిత్తమునందలంపకే
తప్పుడు కోర్కిఁ గోరినను దానికి నెల్లసరేయటంచు మా
తిప్పలుగాన కిచ్చితివి దేవ! వరంబులు వానికెన్నియో. 304

ఆ.వె. పెద్దయాశతోడఁ బెనఁగులాడుచు నుంటి
మింతదనుక మే మనేకవిధుల
మా మొఱాలకించి, మనుజాశనేశ్వరుం
డడఁగు మార్గమిప్పు డరయుమయ్య, 305

కం. అని దేవతలీ తీరున
వినయముతో మొఱలువెట్ట, విని యా చతురా
ననుఁడనె వారలకిటు లో
దనుజాంతకులార యనియుదారతతోడన్. 306

ఉ. పెద్దతనమ్ముచేత వ్యథపెట్టెను ధాతయటంచు నన్ను మీ
రెద్దియుఁ దూవిపల్కకుఁ డనేక విధంబులఁ జూచిచూచి యే
యద్దనుజేశ్వరుండడిగినట్లు సరేయనియంటిఁగానియే
కొద్ది యుపాయముండినను, గోరినయట్లు వరంబులిత్తునే

ఉ. అతఁడు కోరినట్లు వరమప్పుడొసంగకయున్న లోకముల్
కాతరమొంది భగ్గుమని, కాలకయున్నె? తపోనలంబుచేఁ
జేతగునంతలోఁ దెలివి చేతనె యోచనఁచేసి చేసితిన్
భీతిలఁబోకుడింక నరిభీషణులార తొలంగుఁగష్టముల్.

## రావణుని అకృత్యముల నుండి రక్షణకై దేవతలు బ్రహ్మదేవుని ప్రార్థించుట

కం. తెలియును నాకిదివఱకే
పలురకముల లోకములను బాధించెడి దు
ష్కలుషాత్ముఁడైన రావణు
బలము చలంబిట్టిదనుచుఁ బలుకఁగనేలా? 309

కం. అనియూరకొన్న నజునకు
మనపైఁబొడనూపెఁ గినుక, మాననమునసం
చని భయచలితాత్మకులై
యనిమిషవరులెల్లఁతిట్టు, లనిరవుడెలమిన్. 310

ఉ. జాలిగలాఁడవై తగువిచారణసల్పి మనంబులోనమ
మ్మేలుటకై యుపాయము నెదేని ఘటింతువటంచు నెంతయో
కాలమునుండి మేము నినుఁ గన్నులఁగాంచి నమస్కరించి మా
వాలకమంతయుం దెలుప, వాంఛిలుచుంటిమనేకభంగులన్. 311

ఆ.వె. అట్టివాంఛతీరు, నవసరమియ్యెడఁ
గడలుకొనెను గాన కనకగర్భ!
చనవుచేతననిన సమయోక్తులకు నిట్లు
కినుక నొందఁదగునె? మనమునందు. 312

## దేవతలను బ్రహ్మదేవుడు ఊరడించుట

వ. అని నమస్కరించుచున్న యనిమిషుల కంబుజాసనుండిట్లనియె. 313

ఉ. కోపములేదు మీరిటులఁ, గుందుచునుండిరటంచు నా మన
స్తాపమెకాని యిప్పుసురసత్తములార గతించెనెన్నఁడో
పాపపు రాక్షసాధముని, ప్రల్లదమంచును శాంతినొందుఁడా
శ్రీపతియేకలండు మనసేమములారయనెందునేనియున్. 314

కం. అని పద్మజుఁడనిమిషులకు
మనములఁగల వగలడంచు మాటలతోడన్
జనవిభుమఖశాలాంగణ
మున గూర్చునియున్నతరుణమున దైవాఱన్. 315

ఉ. శ్యామలదివ్యకాంతులుదిశల్పది నిండమనోహరంబులై
శ్రీమహనీయమౌ తనుపరిమళముల్లసిలంగ నా పరం
ధాముఁడు దానవారి వినతాసుతవాహనుఁడై నిరంతర
ప్రేమముతోడవచ్చెఁ బృథివీపతివల్లభు యజ్ఞవాటికిన్. 316

చ. చకచకలేచి యందఱు విశాలముదమ్మున భక్తినమ్రులై
యొక మొగి దండవత్ప్రణతులొప్పగసల్పిరి సర్వలోక నా
యక నిజభక్తకల్ప, భుజగాధిపతల్ప నమో నమోస్తుతే
వికచనవాబ్జనేత్ర పృథివీభరహరయటంచు మాటికిన్. 317

## దేవతలను శ్రీహరి ప్రశ్నించుట

ఆ.వె. సురలనపుడుచూచి, పురుషోత్తముండు తాఁ
గరుణరసము కనులఁ, గడలుకొనఁగ
మోమునందగించు, ముసిముసినగవుల
నిట్టులనియెఁ బ్రేమ ముట్టిపడఁగ. 318

ఉ. అందఱకున్ శుభంబె? వనజాసనముఖ్యసుపర్వులార మీ
చందముఁజూడ నెద్దియొ విచారమహంబుధిమున్గినట్లు నా
డెందమునందుఁ దోఁచెను నిలింపులకెయ్యది వాంఛనీయమో
సందియమేమిలేక గతసాధ్వసులై వచియింపుఁడిత్తరిన్. 319

కం. అని హరి పల్కిన విని యా
వనజాసనుఁడపుడు సల్పి వందనశతమి
ట్లని విన్నపంబొనర్చెను
దనుజాంతకు మ్రోలనిచ్చి, తద్దయుభక్తిన్. 320

ఉ. దేవ! మహానుభావ! భవదీయుఁడనైననునున్ క్షమించి యీ
దేవతలన్గృపన్గనుము, దీనశరణ్యదయాపయోధి యే
త్రోవ గనంగరాదిపుడు, తోయజనేత్ర! రమాకళత్ర! స
ద్భావ! భవాబ్ధిపోత! వరధర్మవివర్ధన! దైత్యమర్దనా! 321

## రావణుని అకృత్యములను దేవతలు శ్రీహరికి విన్నవించుట

ఉ. చేసితి గొప్పతప్పు సురశేఖర యేమని విన్నవింతు నా
దోసముసిగ్గులేకిపు డధోక్షజ! నీసముఖమ్మునందు, రా

కానులతేఁడు రావణునఖండతపమ్మున కేనుమెచ్చి పై
మోనమెఱుంగకిచ్చితిని, మూర్ఖుఁడనౌచు వరంబులెన్నియో. 322

ఉ. ఆ వరగౌరవంబున సురాసురపన్నగ సిద్ధసాధ్యర
క్షావళికిన్ నిరంతరమసాధ్యబలుండయి విక్రమించుచున్
గేవలదుష్టవృత్తి గమకించి నిశాటకులాధినాథుఁడౌ
రావణుఁ డేపు మీరఁగ విరాజిలుచుండె బ్రపంచవైరియై. 323

ఉ. ఎన్ని మహాపరాధముల, నెట్టెటులాతఁడొనర్చియుండెనో
యన్నిఁయునెన్నిపల్కదరమౌనె? మహామహ యేరికేనియున్
అన్నెము పున్నెముం దెలియ కా యసురాధమువీటనీసురల్
మన్ననఁ జూపఁగావలసె, మాధవ! నేటికి దాసదాసులై. 324

చ. తమతమ ధర్మముల్విడిచి, దాస్యమొనర్చుటయే ప్రధానకృ
త్యము గద? యీ సురాళి కసురాధమువీట నిరంతరంబు, నే
సమయమునం దురాగ్రహవశంబున వీరిని దిట్టికొట్టుచున్
శ్రమపఱచంగలాఁడొయని, స్వాంతమునందలపోయుచుండుదున్. 325

మ. ఇహమున్గానక పారలౌకికము నెంతేనిం బ్రశంసింపకన్
స్పృహయాళుండగుచున్పరాంగనలపై, స్వేచ్ఛా విహారంబులన్
బహుఘోరంబులుగా నొనర్చు నతఁడో, పద్మాక్ష! లోకాళికిన్
గ్రహచారంబెటులున్నదో తెలియ దేలాకాచెదో మమ్మికన్. 326

చం. అమరులలెక్కసేయఁ డిసుమంతయునైనను నేను నీ యుమా
రమణుఁడు తప్ప తక్కిన సురప్రతినిత్యమెదేని వంకచే
నమితదురాగ్రహుండయిన, యాతనిచేఁబరిభూతులై మన
స్థిమితమువాసి గుండెలఅచేతులలోనిడి సంచరింత్రహో. 327

చ. పరమపతివ్రతామణుల పాలిటి మృత్యువనన్ ద్రిలోకముల్
వరుసను సంచరించుఁగద, వాఁడొనరింపని పాపమేది, యో
వరద! దయానిధీ! సుగుణ వత్సల! సాధుశరణ్యమూర్తి! యీ
కరణిని బ్రత్యహంబుఁ గడగండ్లకులోబడె నన్నిలోకముల్. 328

ఉ. అంద్రనుబిడ్డలన్విడిచి యాకలముల్దిని కానలందు నా
తంండ్రి! భవత్పదాబ్జము లుదారతతో భజియించుచున్న పె

క్కంద్రను వెంబడించి పలుగాకులువానిభటుల్పరోషులై
గంద్రతనంబుఁ జూపుదురు, కాలము నేమనవచ్చు శ్రీహరీ! 329

చ. మునుల తపోవ్రతంబులు సమూలముగా నశియించె సాధుస
జ్జనహృదయంబులందమిత, సాధ్వసముద్భవమయ్యె నంగనా
మణుల సుశీలతాగరిమ, మంటఁబడెన్ నిగమాగమక్రియా
చణుల యవస్థ లెంతయొ విచారముఁ గూర్చుచునుండె నామదిన్. 330

ఉ. ఇంకిటులెట్లు విన్నపములెన్నని జేయఁగలాఁడ లోకముల్
పంకజనాభ! సౌఖ్యమెడబాసి కృశించి గతింపనుండె నే
వంకనునైన రావణునిబట్టి వధించుము వేయునేల? తా
ర్క్ష్యాంకశుభంకరుండవగు మందఱకన్ని విధంబుల న్హరీ! 331

కం. సురగరుడోరగవిద్యా
ధరులకు నీకభవునకును, దానేవేళన్
బొరిగొనఁగ నసాధ్యుం డై
వఱలఁగఁ గొనియుండె నొక్కవరము మహాత్మా! 332

ఆ.వె. వరముఁ గోరునపుడు, నరులను మనమున
సరకుగొనక కోరె సురవిరోధి
సురలచేతఁదనకు మరణములేకుండు
నట్టులిదియథార్థమంబుజాక్ష! 333

కం. ఆ కారణమున వానికి
నేకతముననైన మృత్యు విలమర్త్యునిచే
శ్రీకాంత! తప్పదిఁక నీ
లోకములను గావ నెట్లు లోదలఁచెదవో. 334

**దేవతలను శ్రీహరి ఊరడించుట**

కం. అన నిట్లనె హరి సురలను
గని చిఱునగవాననమునఁ, గడలుకొనంగన్
మనుజాశనుమడియించుట
మనుజునిచే నైన నౌను, మహితలమందున్. 335

ఉ. అంతటిమానవుం దరుదటంచును మీరెఱుగంగరానిదే
శాంతివహించి కష్టములుసైచుచు భావి శుభంబెదుర్కొనుం
డింత విచారమేల? సురలందఱకీయెడ నేదొయుక్తి యో
చింతము చింతమానుఁడని, శ్రీహరిపల్కిన సంతసించుచున్. 336

ఆ.వె. భరసమర్పణంబు సరసిజదళనేత్ర!
యేమొనర్చినార మింత మీఁద
భవదనుగ్రహంబు భక్తులయెడ నెట్లు
పరిణమింపఁగలదొ యెఱుఁగమయ్య. 337

చం. అన విని వాసుదేవుఁడనె సబ్జజముఖ్యసురాళితోడనే
యనువున సంహరింపఁదగు నాయసురాపశదున్ పులస్త్యనం
దనునియటంచుఁ జిత్తముల దైవతసంచయమెల్లగూడి యో
చనమునుజేసి తెల్పిన నసంశయచిత్తుఁడనై యొనర్చెదన్. 338

ఆ.వె. అనిన వెల్లివిరియు హర్షాంబునిధిలో
నంతనంత నోలలాడియాడి
సురవరేణ్యులపుడు పరవశమానసు
లైరి రెండు గడియ లంతమీఁద. 339

చ. సరసిజసంభవుండు సుర సత్తములందఱ ముందుఁజేరి తాఁ
గరయుగళిమ్మొగిడ్చి కడగన్గవమోదజలమ్ములొల్క గ
గ్గురుపొడసూప మేనఁదన కోరికతీరినయట్లు గద్గద
స్వరముననిట్లు విన్నపమునల్పె నధోక్షజుమ్రోలనమ్రుఁడై. 340

## శ్రీరామావతారమును గూర్చి శ్రీహరిని దేవతలు ప్రార్థించుట

కం. స్వామీ వినుమీ దశరథ
భూమీశుఁడు సుతులకొఱకుఁ, బొల్పారఁగఁ దా
నేమమ్ము తోడ జన్నముఁ
బ్రేమన్గావించుచుండెఁ బ్రియపత్నులతో. 341

కం. హ్రీయును శ్రీయును గీర్తియు
నా యలివేణులకు సాటి యగుదురు ధరణీ
నాయకుఁ డఖిల విదాంవరుఁ
డో యబ్జదళాక్ష శుభగుణోజ్జ్వలుఁడరయన్. 342

కం. నలు విధములవారికి నీ
విలపైఁ బుత్రత్వమొంది యేడ్తెఱ దనుజా
వళినాధుఁడైన రావణుఁ
బొలియించి శుభమ్ముఁగూర్పు భువనమ్ములకున్. 343

## శ్రీహరి దేవతలకు అభయమును ఇచ్చుట

చ. అని పరమేష్ఠివేడ హృదయమ్మున శ్రీహరిసమ్మతించి తా
ననిమిషవర్యులన్మునుల నందఱఁగాంచి వచించె నిట్లు మీ
మనములఁ గాతరంబు ననుమానములేక త్యజించి హర్షముల్
బెనఁగొని సర్వసౌఖ్యములఁ బేరిమినొందుచునుండుఁడంచొగిన్. 344

చ. భయమును బోనడంచుఁడిఁక భద్రపరంపరగూడు మీకసం
శయమిది లోకకంటకు నిశాచరనాధు దశానున్ జడున్
నయవినయైకదూరుని వినాశమొనర్చెదఁ బుత్రపౌత్రసం
చయములతోడఘోరతర సంగరమందు జయాభిలాషినై. 345

ఉ. ఈ రఘువంశనాధునకు, నే నుదయించి చతుర్విధమ్ములన్
బోరవధింతునో త్రిదశపుంగవులార! దశాస్యముఖ్యదే
వారులనెల్లఁ బొండు స్వగృహంబులకంచని మాటిమాటి కిం
పారఁగజూచియేగెవికచాబ్జదళాక్షుఁడు తా నదృశ్యుఁడై. 346

కం. అంతట సురలందఱు తమ
స్వాంతమ్ములఁ జింతలుడిగి సకలవిధములన్
సంతసమొందిరి భాషా
కాంతుండును గనె నపూర్వ కౌతుకమెలరన్. 347

వ. తదనంతరంబ, 348

చ. తమతమ యజ్ఞభాగము లతంద్రతఁగైకొని వేల్పులాత్మగే
హములకునేగ నాదటసమంచితరీతి మహామునీంద్రులా
గమరసికుల్మఖాగ్నులను, గారవమొప్పగ శేషమంత్రరా
జములఁబఠించి వేల్చిరి విశాలకుతూహలముప్పతిల్లగన్. 349

## యజ్ఞకుండము నుండి అగ్నిహోత్రుడు ఆవిర్భవించుట

చ. అపుడు ప్రధానమై వెలయు నాహవనీయమునందు నిర్జరా
ధిపుఁడనఁజాలితోఁచె నొకదివ్యమహాపురుషుండనూనకాం
త్యుపచితమూర్తి శైలసముఁ డున్నతబాహుబలుండు కృష్ణర
క్తపటవిరాజితుండు నిరతప్రియచిత్తసమున్నతుండొగిన్. 350

సీ. దుర్లంఘ్యదృప్తశార్దూలవిక్రమశాలి
రక్తాననప్రభారాజితుండు
తామ్రసటాచ్ఛటాధారి నిస్తులరత్న
కాంచనమయభూషణాంచితుండు
ఉజ్జ్వలద్వహ్నిశిఖోపముఁ డాదిత్య
సముఁడు మహాదంష్ట్రుఁ, డమరహితుడు
భయద గదాపాణి, భక్తవత్సలుఁడార్తి
హరణుఁడు దోర్బలాభరణుఁ డగుచు

తేగీ. హస్తయుగమునఁ దాలిచి, యమృతతుల్య
దివ్యపాయసపూర్ణమై, తేజరిల్లు
తప్తగాంగేయ పాత్రముదారలీల
నైంద్రజాలికుఁడనవొప్ప నాతఁడెలమి. 351

తే.గీ. జనపతిని గాంచియపుడిట్లులనియె నాత
డోమహారాజ! సూర్యాన్వయోదధిశశి
పరమపావన భూతలాభరణ నిరత
సత్యసంకల్ప దశరథ సార్వభౌమ! 352

కం. ప్రాజాపత్యనరుండని
యో జనపతి నన్నుఁదెలియు, ముచితజ్ఞయనన్

తేజఃక్రాంతుఁడు దశరథ
భూజాని వినమ్రుఁడౌచు, ముదమలరారన్. 353

**అగ్నిహోత్రుని దశరథుడు ప్రార్థించుట**

తే.గీ. స్వాగతము నీకు నోమహాభాగ! యుష్మ
దాగమనమున నైతిఁ గృతార్థజీవి
నిపుడు నాకేమి యానతి నిడుదు తండ్రి!
మౌళిఁదాల్చెద నద్దాని మాల్యమట్లు. 354

చ. అనుచుఁ బునఃపునఃప్రణతులర్పణసేయుచుఁ బల్కుచుండు త
జ్జనపతిఁగాంచి యిట్టులనె, శాంతవచస్సుల నగ్నిసంభవుం
డినకులనాథ నీవు యజియించితి విత్తరి దేవతాతతిన్
మునుకొని యజ్ఞయుగ్మమున, మోదముతోడ నమోఘశాసనా! 355

**అగ్నిహోత్రుని ఆదేశము**

చ. జనవర తృప్తులై యనిమిషప్రవరుల్మది మెచ్చి నీకు ని
మ్మనుచును జెప్పి యిచ్చి రమృతాత్మకమౌ ఘనపాయసంబు దీ
నినిగొను మెద్దికోరి యవనిన్గ్రతురాజమొనర్చినాడవో
కొనియెదుకాక తత్ఫలమకుంఠితహర్షవివర్ధనుండవై. 356

కం. ఈ పాయస మవనీశ్వర!
పాపాపహమఖిలదేవపతినిర్మితమై
యేపారుచుండె నాయుః
ప్రాపక మనవద్య మఖిలభవ్యదమగుచున్. 357

తే.గీ. ధన్యమారోగ్యదము మహీధవ! ప్రజాక
రమ్ము సుమ్మిప్పుడిప్పాయసమ్ము వేగ
సమ్మదమ్మున నీ ప్రియసతులకిమ్ము
భక్షణముఁ జేసి సుతులను బడయఁగలరు. 358

చ. అని వచియించి పాయసము హాటకపాత్రముతో నొసంగ నా
జనపతి భక్తిమైగొని విశాలకుతూహలముప్పతిల్లగా

వినయవినమ్రుఁడౌచుఁ బరివేశమొనర్చి నమస్కరించె న
య్యనుపున నమ్మహాపురుషుఁ డగ్నినదృశ్యతనొందె గ్రక్కునన్. 359

మ. తన నత్యంతకృతార్థుఁగాఁ దలఁచుచున్, ధాత్రీశ్వరాధీశుఁడౌ
యినవంశోత్తముఁడంతఁ దక్రతుసమాప్తింజేసి శాస్త్రోక్తరీ
తిని మౌనీంద్రుల గౌరవించి సుమహత్తేజోధికుండై పురం
బునకున్ బోవఁ బ్రయాణమయ్యెఁ బెలుచన్ భూపాలకుల్వెంటరాన్. 360

**అయోధ్యలో ధశరధుడు తన భార్యలకు పాయసము నిచ్చుట**

తే.గీ. అఖిలవైభవములతోడ, నమరవిభుని
బరిభవించుచుఁ బార్థివవల్లభుండు
అధ్వరాలయముననుండి, యాత్మసదన
మునకు నేగెను లోకముల్గణుతిసేయ. 361

వ. అంత నాతరణికులోద్ధారకుండగు, దశస్యందనుండపరిమితానందమ యస్వాంతుం డగుచు, దేవదత్త పాయసపరిపూర్ణం బైచెల్వారు హైరణ్మయ కలశంబును సభక్తికంబుగా శిరంబున నిడికొని, కౌసల్యాదిపత్నీ సమేతంబుగా నిజాంతః పురంబున కరిగి, శారదరాకానిశాకరుండంబరంబుమాడ్కి, మహానంద కాంతి పుంజమ్ముల నెంతయునయ్యంతఃపురంబు బ్రకాశింపఁ జేయుచు, దైవచోదిత మాననుండై యమృతోపమానంబగు నప్పాయసంబుం గ్రమక్రమంబుగా విభాగించుచు సహధర్మచారిణులగు, కౌనల్య సుమిత్రాకైకేయిలం బ్రేమ పురస్సరంబుగా వీక్షించియిట్లనియె. 362

కం. సుతదాయక మీ పాయస
మితరులకునలభ్య మిందిరేశునికృపచే
మతివతులగు మిమ్మియ్యది
వెతకుచునరుదెంచె నెంత వింతయొ జగతిన్. 363

వ. మఱియు, దైవానుగ్రహరూపంబగు నిప్పరమాన్నమును భక్తియుక్తంబుగా ననుభవించి యనురూపసుతులం బడయుండని పల్కి. 364

**పాయసవిభాగము**

కం. సగమిడెఁ గౌసల్యకు నా
సగమున సగమొసఁగెఁ బ్రీతి, సముదంచితుఁడై
విగతశ్రముఁడు సుమిత్రకు
మొగి శేషము రెండుభాగములగ నొసర్చెన్. 365

కం. అందొక భాగంబును దాఁ
గందళితానందుఁడౌచుఁ, గైకేయికిడెన్
క్రందుగ రెండవ భాగము
నిందు నిభాస్యకు సుమిత్ర కిచ్చెన్ మరలన్. 366

వ. ఇట్లు జ్యేష్ఠా కనిష్ఠాది విచారణ పూర్వకంబుగా నొసంగిన యమృతాన్నమును మహానందాబ్ధిందేలియాడునుల్లంబులు పల్లవిల్ల నప్పల్లవాధరలు సభక్తికంబుగాఁ గైకొని భుజియించి రంతఁ గొండొక కాలంబుననిన నయ్యమృతాన్న భక్షణ మహాప్రభావంబునంజేసి యమ్మత్తకాశినులు ముప్వురుంగూడ, దీప్తానలా దిత్యసంకాశంబులగు గర్భంబులు ధరియించి, సౌఖ్యానందములంబెనగొనిన మానసంబులతో విరాజిల్లుచుండిరంత. 367

ఉ. ఆ రఘువంశమౌళిమణియైన యజాత్మజుఁ డాత్మకాంతలం
దారసి గర్భలక్షణము లంతములేని ముదంబుతోడఁ జే
కూరఁగఁజేసె దైవమనుకూలము నేటికి నాకటంచుఁ బెం
పారు మనఃప్రసన్నత నపాశ్రయసంశయుఁడై యెలర్చుచున్. 368

ఆ.వె. విస్మరించి రాజ్య విషయంబులన్నియు
సతులతోడ గోష్ఠి సల్పుచుండె
సూర్యవంశజలధిసోముఁడు దశరథ
చక్రవర్తి కెంత సంతసంబొ. 369

కం. ఈ రీతిన్ దారలతోఁ
దారలతోఁగూడియున్న తారాధిపతిన్
సారెకుఁ గేరుచు ముదమల
రారఁగఁ గారుణ్యమూర్తియైచెలువారెన్. 370

### యాగమునకు వచ్చిన వారిని సత్కరించుట

వ. ఇట్లు కొన్నిదివసంబులుగడచిన పిదప, 371

తే.గీ. రాజబంధులు సామంతరాజవరులు
సవనముంగాంచవచ్చిన సర్వమాన్యు
లైన దేశాధిపతులందరాత్మదేశ
ములకుఁ బయనించిరతిమోదమునఁగడంగి. 372

వ. అంత నారాజన్యలోకంబంతయు దశరథమహీమండలాధిపునిచే యథార్హ సత్కారసత్కృతంబై, నానావిధ పారితోషిక గ్రహణాధిగత మహా సంతుష్టాంతరంగులై యున్న బలంబులంగూడి, బ్రహ్మర్షి పుంగవుడగు వసిష్ఠునకు నమస్కరించి, తదాజ్ఞానుసారంబుగా నిజనివాసంబులకు యథేచ్ఛం జనియె. అంత రోమపాదునిచే దూతముఖంబున నాహూతుండైన బ్రహ్మర్షిమూర్ధన్యుండగు ఋశ్యశృంగ భట్టారకుండు, ధర్మపత్నీ సమేతంగా నంగదేశంబునకుం బోవనుద్యుక్తుండై దశరథునకెఱింగించిన నమ్మహీకాంతుండందులకు నమ్మతించి, శాంతా సహితుండగు నమ్మహాత్మునసేక విధంబులం బూజించి సంతుష్టాంత రంగుంగావించె, తదనంతరంబ. 373

### శాంతతో ఋష్యశృంగుని తిరుగు ప్రయాణము

చ. తనువువడంకఁ జిత్తమునధైర్యవిహీనతదందడింపఁగాఁ
గనుఁగొనలంబుపూరమునఁ గ్రమ్మఁగ నంఘ్రులుతొట్రిలన్మహా
వినయముతోడ శాంత జనవిశ్రుతశాంతగుణాఢ్య బెంగతోఁ
దనరుచు మెల్లమెల్లగను, తల్లులపాలికి నేగె నాజ్ఞకై. 374

వ. అంతఃపురంబున సుఖాసనోపవిష్టలై బహువిధ పరిచారికాజనంబులం గూడియున్న కౌసల్యాసుమిత్రా కైకేయిలచే సబహుమానంబుగా నాదరింపఁబడి యొక్క సముచితాననంబునందన్నియోగంబుచేఁ గొంత సుఖాసనాసీనయైయుండి, శుభసల్లాపావకాశంబునంగౌసల్యాదిమాతృ దేవతలం గాంచి 375

ఉ. ఎల్లి ప్రయాణమైచనఁగనెంచి ప్రయత్నముసల్పుచుండె మీ
యల్లుఁడు, పోయివచ్చెద మహర్ముఖమందు ననుజ్ఞనిండు, మీ

రెల్లరునంచు గద్గదిక నేడ్తెఱఁబల్కి నమస్కరించె నా
పల్లవపాణి తల్లులకభంగురభక్తిలతానువిద్ధయై. 376

ఉ. మ్రొక్కిన శాంతనప్పుడు ప్రమోదభరమ్మున లేవఁదీసి పెం
పెక్కిన ప్రేమలన్గవుఁ గిలించుచుఁ "దల్లిరొ! వెళ్లి రమ్మ" నీ
వక్కఱపట్ల నెన్నిపనులైననుమాని మముం గనంగ రాఁ
దక్కకుమంచు దీవనలుదారతనిచ్చిరి తల్లులందఱున్. 377

వ. అనంతరంబతిరమణీ యపుష్పగంధ మాల్యాంబరాభరణాది దివ్యవస్తుసముదాయముచే నలంకృతంగావించి విరహవ్యథా పీడ్యమానమానసలై బాష్పాంతరిత నేత్రలగు కౌసల్యాదులామెం గాంచి. 378

ఆ.వె. ఇంకఁ గొన్నిదినములిచ్చట నుందురం
చనుచుఁ దలఁచినార మాత్మలందు
బ్రహ్మవేత్తయైన పరమర్షి సంకల్ప
మెట్లు మార్పనలవి? యింతిమాకు. 379

**శాంత అత్తవారింటికి వెళ్ళుట**

కం. కావునఁ బతితోఁ బయనముఁ
గావింపుమనశ్యమచిరకాలములోనే
రావలె మరలనటంచని
వేవిధములఁ జెప్పి రాత్మవిశ్వాసమునన్. 380

వ. ఇట్లతివాత్సల్యంబునం బల్కుచున్న కౌసల్యాదులం గాంచి శాంతాకాంత యిట్లనియె.

ఉ. తప్పకవచ్చెదన్ మరలఁ, దమ్ములఁ జూడఁగ నాకు మాత్రమీ
రప్పటికప్పుడే యెవరినైనను బంపుఁడు తల్లులార! మీ
రిప్పటికాజ్ఞనిండనిన నెంతయుఁజిత్తములందుఁ గౌతుకం
బొప్పఁగ వారువీడ్కొలిపి రూర్జితశాంతను శాంతనత్తఱిన్. 383

వ. ఇట్లు తల్లులయాజ్ఞం బడసి వీడ్కొని శాంతాకాంత మందగమనంబున సఖీజనసమేతయై యంతఃపురంబును వీడి. 383

శా. అంతస్తంభితబాష్పనేత్రుఁడగుచున్ హర్మ్యాంతరాళంబునం
జింతన్గుందుచుఁ బుత్రికావిరహితన్ జీకాకుగానున్న భూ
కాంతున్ దండ్రిని జేరి దండమిడి యక్కాంతాలలామంబు, త
త్స్వాంతమ్మున్ వ్యథవెట్టుఖేదమునుబోవంజేసి ధైర్యోక్తులన్. 384

శా. చింతన్గుందకు నన్నువీడితనుచుం జేడ్పాటుతో సర్వదా
చెంతన్ నేనువసించియుంటెననియే చిత్తంబులో నుంచి నీ
సంతాపంబుడుగంగఁజేసికొనుమో సర్వజ్ఞ! మా పట్టణం
బెంతో దూరమునందు లేదుకద? తండ్రీ! రాకకున్ బోకకున్. 385

చ. జనములఁ గాంచఁగాఁ దిరిగి చయ్యన వచ్చెద నాజ్ఞనిమ్ము నా
కని పలుమారువేడ వసుధాధిపుఁడెంతయు సంతసిల్లుచున్
మనమున ఖేదమున్విడిచి మాటికిమాటికి బుజ్జగించి శాం
తను సదనాంతరమ్మునకుదారతనంపె శుభోక్తి పంక్తులన్. 386

వ. అంత నమ్మఱునాఁడవనీశ్వరుండు, వసిష్ఠవామదేవసుమంత సామంతాది సమేతుండై, శాంతా ఋష్యశృంగులను, మనోజవంబులగు నుత్తమాశ్వంబు లబూన్చిన రత్నతోరణాద్యలంకృతంబగు సువర్ణస్యందనంబుపై, స బహుమానంబుగా నధిరోహింపఁజేసి, సాయుధ పాణులగు రక్షకభటులతో నంగదేశంబునకనిపె. తదనంతరంబ. 387

కం. పరిపాలించుచు దశరథ
నరపతి భూతలమునెల్ల న్యాయముతోడన్
సరిపోల్చఁదగి సురేంద్రుని
వీరగుణవారాసి యనఁగ వర్ధిలుచుండెన్. 388

## శ్రీరాముని సేవకై దేవతలు వానరులుగా అవతరించుట

చ. అతఁడటులుండ నొక్కదిన మందు సరోజభవుండు సర్వదై
వతతతిఁగాంచి యిట్లనె నవారణకౌతుకముల్లసిల్ల ఁగా
శ్రితజనరక్షకుండయిన, శ్రీపతిదాశరథిత్వమంది యా
క్షితినుదయింపనుండె నవిచింత్య విశేషగుణాభిరాముఁడై. 389

కం. కావున దేవతలందఱు
శ్రీవరునకు సాయమాచరించుచు నిలపై
రావణసంహారంబు
న్గావింపఁగఁ జేయఁదగిన, కాలంబొదవెన్. 390

శా. మీ మీ యంశములన్ జనించి యిలపై, మేల్మేలటంచున్ జన
స్తోమంబెల్లనుతింప నా దశరథక్షోణీశ్వరాపత్యమై
భూమిన్ బుట్టఁగలట్టి శ్రీహరికి నింపున్ సొంపు దీపింప మీ
సామర్థ్యంబెసలారఁ దోడ్పడుఁడు విశ్వశ్రేయమర్థించుచున్. 391

చ. అన విని భాగ్యమంచు సురలందఱు మ్రొక్కి సరోజసూతికి
న్గనుఁగొనలన్ముదశ్రువులు, గ్రమ్మఁగ దేవరలానతిచ్చిన
ట్లినకులనాథుఁడైన హరి, కేము సహాయులమౌదు మంచు స
ద్వినయముతోడఁ బల్కిరి భవిష్యదనూన సుఖాభిలాషులై. 392

వ. అనంతరం బతి సంతుష్ట మానసుండగు చతుర్ముఖుండు, సకల దేవర్షి సమేతులగు నమరులంగాంచి యిందొక్క విశేషంబు గల దద్దానిందెల్పెద సావధానమతులై యాకర్ణింపుఁడని యిట్లనియె. 393

**చతుర్ముఖుండు దేవతలను వానరభల్లూకాకారంబులం దాల్చి క్షితింబుట్ట నాజ్ఞాపించుట.**

చ. దశరథరాజశేఖరుని దారలయందుదయించి దుష్టులౌ
దశవదనేంద్రజిత్ప్రముఖ దైత్యులఁద్రుంచి దివంబుఁగావఁగా
నిశితమహాప్రతిజ్ఞఁగని నిల్చిన శ్రీహరికెల్లవేళలన్
వశులయి దాసదాసులయి వర్తిలఁగావలె భూతలంబునన్. 394

తే.గీ. వరము నను గోరునప్పుడా సురవిరోధి
నరుల వానరులను మది నరకుగొనఁడు
కాన నరవానరులచేతఁ గలుగు నతని
కిపుడు మృత్యువు తప్పదా నెపము చేత. 395

కం. ఆకారణమునఁ గాదే
శ్రీకాంతుఁడు మనుజుఁడగుట క్షితిపై సురలున్
ప్రాకటముగ వానర భ
ల్లూకానీకములుకాఁగ లోఁదలఁచుఁడిఁకన్. 396

సీ. కపటరాక్షసయుద్ధకార్యాంతరములందుఁ
గామరూపములొందఁ గల్గువారి
ఆశ్చర్యశక్తి రహస్యజ్ఞులై మనో
వాయువేగంబులన్ వఱలువారి
నయవినయమ్ములన్ జయరమాచుంబిత
విక్రాంతియుతులౌచు వెలయువారి
అఖిలలోకములందు నజితులై హరితుల్య
నిత్య శౌర్యమ్ముచే నెగడువారి

తే.గీ. చతురుపాయమ్ములందతి చతురులౌచు
ఘోరశస్త్రాస్త్ర గుణముల న్గేరువారి
అమృతరసపానతృప్తిచే నలరు చుండి
మీరి లోకైక విజయంబుఁగోరువారి. 397

వ. ఇంక ననంతగుణసంపద్వరిష్ఠులగు, వానరగోలాంగూలభల్లూక శ్రేష్ఠులను, విద్యాధరగరుడ గంధర్వకిన్నరకింపురుషాప్సరః కామినులందును, భుజంగభల్లూక భామినులందును, స్వాంశమ్ములచే వేర్వేఱు సృజింపుడని పల్కి వెండియు నిట్లనియె.

తే.గీ. పాడమినాజృంభణమున మున్పుదమి లోన
వాసిఁగనుచుండెఁగద జాంబవంతుఁ డనఁగఁ
అతఁడసాధారణప్రజ్ఞుఁ డతిబలిష్ఠుఁ
డచ్ఛ భల్లాధినేత నాయంతవాఁడు. 399

చ. అని యిటులబ్జజుండు సురలందఱితో ననభక్తినమ్రులై
విని తదనుజ్ఞ మౌళినిడి వేగమె కిన్నర సిద్ధ సాధ్య చా
రణగరుడోరగప్రముఖ రాజనిభాననలందుఁ భీతిమై
వనచరులన్ సృజించిరనివారిత శౌర్యరమావిశాలురన్. 400

కం. పర్వతసన్నిభగాత్రులు
దుర్వారబలాఢ్యులహిత దుస్తరతేజుల్
ఖర్వీకృతదైత్యాయు
ర్గర్వోన్నతులా వలీముఖప్రముఖులిలన్. 401

**వానరులకు జన్మతః ప్రాప్తించిన పరాక్రమములు**

వ. ఇట్లత్యుత్కట తేజః క్రాంతదిగంతులై యలరారుచున్న వానరవీరులందు 402

కం. లీలన్ శక్రుఁడు రణజయ
శాలిన్ సృజియించె నిరత సదమలతేజో
మాలిన్ శాత్రవజనవన
కీలిన్ గీనాశహననకేళిన్ వాలిన్. 403

తే.గీ. కమల బాంధవునంశచేఁగలిగె లోక
వినుతసద్గుణసంపన్నుఁ డనతిలంఘ్య
వీర్యసాహసవిజ్ఞాన ధైర్యఘనుఁడు
గళితదోషుడు సుగ్రీవ కపివరుండు. 404

కం. ధీరుఁడు తారుఁడు పరమో
దారుఁడు స్వయశఃప్రకాశ ధవళీకృత ది
గ్వారుఁడు వీరుఁడు గుణమం
దారుఁడు జనియించె దేవతాగురునంశన్. 405

కం. కిన్నరపతియంశమ్మునఁ
జెన్నుగ లోకమ్ములన్ని జేజేయనఁగన్
గ్రన్నన జననమ్మొందెను
మన్ననలకుఁదగుచు గంధమాదనుఁడుర్విన్. 406

కం. బలశాలి దైత్యజీవన
విలయుఁడు భువనప్రశస్తవీరుఁడు కరుణా

నిలయుఁడు నలుఁడతి తేజః
కలితాత్ముఁడు పుట్టి విశ్వకర్మాంశమునన్. 407

కం. కీలికిఁ బుట్టెను రిపుకుల
కాలుఁడు నిఖిలామరాళిగణనీయమహా
శీలుఁడు భువనత్రయశుభ
లోలుఁడు నీలుండు ప్లవగలోకాధ్యుఁడిలన్. 408

కం. మైందద్వివిదులు శ్రీమ
ద్బృందారకవైద్యులకును బ్రియపుత్రకులై
క్రందుగ జననమ్మొంది ర
మందానందాత్ములౌచు మహితలమందున్. 409

ఉ. జలపతి యంశమ్మున స
ద్బలశాలి సుషేణుఁడు ధృవమ్మొందెఁ గులా
చలసన్నిభుఁడౌ శరభుం
డిలఁబర్జన్యాంశసంభవించెన్ ద్రుటిలో. 410

ఉ. అంతసమీరునంశమున నచ్యుత ధర్మపథ ప్రవిష్ట ధీ
మంతుఁడు నీతిమంతుఁడభిమానిత శౌర్యరమానుకూలసు
స్వాంతుఁడు బుద్ధిమంతుఁడతి శాంతుఁడుదాంతుఁడునైన శ్రీహను
మంతుఁడు పుట్టె సర్వసురమౌనిచరాచరలోకమాన్యుఁడై. 411

కం. సురగరుడోరగవిద్యా
ధరచారణసిద్ధ సాధ్య తతియంశములన్
గరమరుదుగఁ బొడమిరి కపి
వరులతి బలదర్పశౌర్యవంతులు ధరణిన్. 412

తే.గీ. ఇట్టు దైవాంశములఁ బుట్టినట్టి కపుల
నచ్ఛభల్లాదివరులననంతబలుల
నరసి లెక్కింప నెవ్వాని కలవియగున
టంచు లోకమ్ములన్ని నుతించె నపుడు. 413

కం. ఏ దేవత కే రూపమొ
యా దేవతనంశమూని యలరెడు వానిన్

బాదుకొని యుండె నేమియు
భేదములే కట్టి రూపవేషప్రతిభల్. 414

చ. కులగిరిసన్నిభుల్విబుధ కుంజరగాత్రులు వజ్రసారు ల
త్యలఘుమతుల్మహాత్ములు విహంగమరాజ జవుల్ద్విషత్కుల
ప్రళయకరుల్ప్రతాపపరివర్ధితదైత్యభయంకరప్రభా
కలితులు కామరూపులు నికామరణోత్సుకులైనవారొగిన్. 415

వ. తరుపాషాణ నఖదంష్ట్రాయుధులై యదృచ్ఛా విహారంబు సల్పుచు. 416

తే.గీ. త్రోవనెదురైన సింహశార్దూలనాగ
శరభములఁబట్టి గిరగిర మొరయఁద్రిప్పి
విసరి యట్టిటువైచుచు వెనుకఁదిరిగి
చూడకయ పోవుచుందురా శూరవరులు. 417

సీ. వేగంబుచే బుద్ధి భోగంబుచేఁ గూడ
శరనిధిలంఘింప శక్తులౌచు
బలిమిచే నెడఁదపెన్గలిమిచేఁ గులపర్వ
తావళింబెకలించు చేవగల్గి
శక్తిచే ఘనతపోశక్తిచే బాలేందు
మౌళిని నిరసించు మహిమమూని
నేర్పుచే వెలలేనియోర్పుచే నెడనెడ
హరితోడఁ దులఁదూఁగు పరువునొంది

తే.గీ. యుద్ధకర్మవిశారదులుగ్రతేజు
లవని యూనిన చందాన నఖిల దిశల
నప్రమేయపరాక్రములౌచు నిండి
మెండుకొని యుండిరపుడు ప్రచండగతుల. 418

ఉ. కొందఱు వానరోత్తములకుంఠిత విక్రమశాలి వాలినిన్
గొందఱు సూర్యపుత్రు మరికొందఱు తారనళాదివీరులన్

గొందఱు మారుతాత్మజుని గొందఱు భల్లుకనాథుఁగొల్చుచున్
ముందరముఖ్యశైలవనమధ్యపదంబులనుండిరాఢ్యులై. 419

కం. ఈరీతి రామవిజయ
ప్రారంభోత్సవమునల్పఁ బ్రతినిమిషమునం
దారయు చుండిరి సమయము
వీరని మౌనులకుఁ దోఁచె విశ్వాసమునన్. 420

తే.గీ. వసుధభల్లూకగోపుచ్ఛవానరులను
వాలి యేలికయై సతంబేలుచుండె
తండ్రియౌ వృత్రవైరియుదారభంగి
లీలసురచక్రవాళంబు నేలినట్లు. 421

వ. అంత నిచ్చట నయోధ్యాపురంబునం బంక్తిరథుండనయ వినయ సత్యపరాక్రమాది శుభగుణసంపన్నుడై ప్రజాపాలనంబొనర్చుచుఁ దనమనంబున,

శా. సారోదారకవిత్వసత్త్వధిషణాసంపూర్ణపాండిత్య వి
స్ఫారత్వమ్మున మించుఁగాక సకలాశాలోకసమోద్మదకృ
న్మారందోపమితార్థశబ్దరుచిమద్ధారైకమౌఁ గాకెటన్
శ్రీరామాంకితముంబొనర్పనికృతిశ్రీయెందు రాణించునే? 423

సీ. సవవైభవంబు వా సవవైభవముకంటె
హెచ్చని మును మునుల్ మెచ్చుటయును
సురసంచయంబు భూసురసంచయముతోడ
వహ్నిశుశ్రూషలన్వఱలుటయును
దేశపాలకులు విదేశపాలకులౌచు
నంచితంబుగ నందడించుటయును
నాకిబృందముతోఁ బినాకియు నరుదెంచి
హవిరంశమున్నూని యరుగుటయును

తే.గీ. దిశలనిండించు దీప్తితో దివ్యపురుషుఁ
డగ్నినావిర్భవించి దివ్యాన్నమొసఁగి

పుట్టు శ్రీహరిమీకని గుట్టుఁదెల్పి
తానదృశ్యతనొందుటల్ దలఁచి తలఁచి. 424

కం. మితిమీఱు కౌతుకమ్మున
సతులకుఁ దన పూర్వరాజచరితములెల్లన్
వితతముగఁజెప్పి వినుచుచు
సుతజన్మోత్సవము కొరకుఁజూచుచునుండెన్. 425

## గర్భవతుల వింతలు

కం. అంతంతన దశరథభూ
కాంతుని కాంతలకు గర్భగౌరవమొదవెన్
ఎంతయుఁ బృథులములై యా
వంతంతలు నడుములలరె నలివేణులకున్. 426

సీ. హంసయానల యానమతిమాంద్యముంజెందెఁ
గోరికలెన్నియో కోట్లుపొడమె
గండయుగ్మములందుడిండీరరుచినిండె
నిట్టూర్పులంతంత నెగడసాగె
వాలుకన్గవలందు వలగొనిజూపట్టెఁ
దెలి దమ్మిరేకుల తేటఁదనము
గండుతుమ్మెదడాలుఖండింపఁ గలసొరు
చూచుకంబులనొంది సొంపుమీఱె

తే.గీ. మృదులనల్లాపమత్యంతమృదులమయ్యెఁ
బాలుమాలిక పొదమి మైఁ బ్రబలుచుండె
భూషణావళి బరువౌచు బుద్ధిఁదోచెఁ
గార్భ్యదేహంబులభినవకాంతిఁదొడిగె. 427

కం. కాంచీదామంబులు త
త్పంచాననమధ్యలైన పడఁతులకెలమిన్
కొంచెములయ్యెన్గాను ల
కించనభావములువీడి కెరలుచునుండెన్. 428

కం. పరిపూర్ణగర్భవతులౌ
సరసిజనేత్రలకుఁ బ్రసవసమయముడాసెన్
నరపతి సంతోషం బతి
తరమై లోకమ్ములన్నిదాటెన్ వరుసన్. 429

తే.గీ. తొగలరాజును గర్భమందున ధరించి
వెలయు ప్రాగంగనామణివలె మనోజ్ఞ
విశదరుచిఁ దాల్చిరాకమొగి దశరథేశు
వనితలప్పుడు త్రైలోక్యవంద్యలగుచు. 430

తే.గీ. అంతఁ కౌసల్యయందు నత్యధికములగు
ప్రసవచిహ్నమ్ములేర్పడి ప్రబలసాగె
భూతలాధిపుఁ డప్పుడ భూతహర్ష
పారవశ్యముఁ గాంచెను బహువిధముల. 431

**శ్రీరామ భరతలక్ష్మణ శత్రుఘ్నుల జననము**

ఆ.వె. సవనమైనపిదప నరిగ ఋతువులాఱు
మహిని జరుగఁ జైత్ర మాసశుక్ల
నవమి నదితితార ననువొప్పఁ గర్కట
లగ్నమేచిరాఁగ లలితగతుల. 432

ఆ.వె. ఆకసమ్ము నడిమి కబ్జబాంధవుఁడే గ
నమరగురుఁడు సోమునంటివెలుఁగ
గ్రహములైదునుచ్చగృహముల భాసిల్ల
దిశలు సుప్రసన్న దశలనొంద. 433

ఆ.వె. అట్టివేళ భగవదర్ధాంశమై విరా
జిల్లుఘనుని రూపజితసహస్ర
కాము సుగుణధాముఁ గౌసల్యకనెఁ బరం
ధాము రాము భవవిరాము నంత. 434

ఆ.వె. వినుచుఁ గావు కావు మనియెడి బాలుని
మధుర రోదనంబు మౌనివరుఁడు

భానువంశ గురుఁడు పరమతపోవ్రత
నిష్ఠుఁడిట్టులనె వసిష్ఠుడపుడు. 435

తే.గీ. సర్వలోకంబులనుగావశక్తికలిగి
యున్న నినుగావశక్తులైయున్నవార
లెవర గలరని మనమునందెంచి నీవు
కావుకావని యనెదవో కన్నతండ్రి! 436

కం. ఈ విధి మౌనీంద్రుడు తన
భావమునందలఁచి మోదబాష్పములొలయన్
గేవల పరమార్థజ్ఞా
నావృత చేతస్కుఁడౌచు నలరారె వెసన్ 437

కం. నరపతి యపుడొందుచుఁదా
నిరవధికానందసుఖము నిశ్చేష్టత మై
మఱపుంజెంది వసించెను
గురువర్యుని సముఖమందుఁ గొన్ని క్షణంబుల్. 438

కం. సురుచిర తేజోమయుడై
పరమాద్భుతలీలనొప్పు బాలునితో నా
సరసీజేక్షణ భాసిలె
నరుదారబిడౌజుతోడ నదితిసతివలెన్ 439

తే.గీ. పుష్యనక్షత్రయుక్త సంపూర్ణదశమి
నలరుచుండిన బుధవారమందు మీన
లగ్నమునఁబుట్టె కైకకరాతిమథన
రతుడు భరతుడు లోకైకహితుఁడజితుఁడు. 440

కం. కనె లక్ష్మణశత్రుఘ్నుల
ఫణితారాయుక్తమౌచు భాసిలు దినమం
దనువొప్పఁ గర్కటమ్మున
వనజాక్షి సుమిత్ర భువనవందితమతియై. 441

## రాముని జననమునకు ముల్లోక జనులు సంతోషపడుట

కం. ద్యుతిచేఁ బ్రోష్ఠపదోపము
లతులిత శుభలక్షణాఢ్యులవధూతరిపుల్
సుతులిటు కలిగిరి ధరణీ
పతికాగమమౌళివేద్యపరమచరిత్రుల్. 442

ఆ.వె. పూలవానగురిసెఁ బుష్కలంబుగ నయో
ధ్యాపురమ్ము నందుదారలీల
మొరసె దివ్యదుందుభులు వియత్తలమందు
నిలిచి సురలు నుతులు సలిపిరపుడు. 443

కం. ఆడిరి పాడిరి యొకచోఁ
గూడిరి యచ్చరలు గుములు గుములై యపుడే
పోడిమిఁ జెందిరి మనముల
వీడిరి రావణుని వలన విబుధులు భీతిన్. 444

కం. పురవాసులు సంతసమున
నెరపుచు దివ్యోత్సవము లనేకవిధములన్
మరిమరికీర్తించిరి భూ
వరవరుని యపూర్వభాగ్యవైభవలక్ష్మిన్ 445

తే.గీ. నిఖిలభువనైకకల్యాణసుఖసముదయ
బీజములు మొల్కలెత్తసంప్రీతితోడ
జన్మమెఱుఁగని శ్రీరమాజాని వసుధ
నజకుమారుని కొమరుఁడై యలరువేళ 446

సీ. అమరసంతతినెల్ల నతిభీతివిడనాడి
పొలస్త్యుమనసులోపలనుదూఱె
పామరజనపాపపటలమ్ము దృశ్యమై
దివిజారులుండిన దిక్కుఁజేరె
ఘనతపోనిష్ఠులౌ మునిజనులకు సతం
బిగురెత్తు గుండెల దిగులుదీఱె
అసురయోషిద్విలాసాంబుధుల్ ఘోషిల్లి
పంకసంకులములై యింకబారె

తే.గీ. అంబుజాస్త్రుని రూపగర్వంబుజాఱఁ
గువలయంబున బుధులకు గోర్కులూరె
దివ్యనదులందు నీరముల్ తేటదేఱె
నవనిపతి హర్షచంద్రికల్ హద్దుమీఱె. 447

**నామకరణ మహోత్సవం**

తే.గీ. పురుడుతీఱిన మఱునాడు సరసిజాప్త
వంశశేఖరుఁడైన యా వసుమతీశు
చేత సంప్రార్థితుండై వసిష్ఠుడట్టి
శిశువులకు నామకరణముల్సేయఁబూని. 448

ఉ. ఎంత తపమ్మొనర్చి ప్రభవించితినో కద యీ ధరన్ ధరా
కాంతుని పుత్రుఁడైన మధుకైటభహారిని గల్పసూత్ర సి
ద్ధాంతితదివ్య వైదికవిధానముచేత నశేషసంస్క్రియా
వంతుని జేయఁగల్గు ఘనభాగ్యముచేకురె నాకునేటికిన్. 449

తే.గీ. అనుచు మనమునఁ దలపోసి వనజభవుని
వరకుమారుఁడు మునికుల వల్లభుండు
సకలసద్గుణశాలి యాచార్యుఁడనెడి
బిరుదమున్పూని యాజ్ఞికపీఠమెక్కి. 450

తే.గీ. నామకరణాంగభూతపుణ్యాహవాచ
నమ్ము నాఘారముఖ్యహోమాదికమ్ము
వరుసఁ జేయించి నామములరసి యిట్లు
తీర్చి వ్రాయించె క్షితితలాధిపునిచేత. 451

తే.గీ. శ్రేష్ఠగుణభూషితుండైన జ్యేష్ఠ సుతుని
సకల సురరక్షణోత్సాహ శక్తియుతుని
భువనమంగళధాము సంపూర్ణకాము
కామశతవంచనోద్దాము రాముఁడనుచు. 452

కం. భరతుండని కైకేయీ
వరతనయుని నంతమీద వరుస సుమిత్రా

తరుణీమణి సుతులను శ్రీ
కరులను గవలన్ బ్రభూత కరుణానిధులన్. 453

తే.గీ. కనుచు లక్ష్మణశత్రుఘ్నులని మహర్షి
వరుఁడు చందనపుష్ప దూర్వాక్షతోద
కములఁ బదకటి భుజశిరోగ్రమ్ములందు
బిడ్డలకునుంచఁ జేసె భూవిభునిచేత. 454.

వ. ఇవ్విధంబున నమ్మహీనాథుండాత్మజులకు నామకరణమహోత్సవంబు నెరపి వసిష్ఠాదిమహర్షిపుంగవులవలన శుభాశీర్వాదంబులం బడసి మహానందసాగరంబున నోలలాడుచు. 455

**పుత్ర జనన మహోత్సవములు**

కం. చేయించె నన్నదానము
వ్రాయించెన్ భూసురులకు వసతిపురమ్ముల్
మాయించెఁ బ్రజకునిస్స్వత
నోయించెన్ సతులచేత నోములనెన్నో. 456

తే.గీ. కఱవుదీరిన బిడ్డలు కలిగిరింక
నేమికావలె దశరథభూమిపతికి
ననుచు లోలోన ననుకొనిరపుడు పౌర
వనితలందరు పేరంటమునకు వచ్చి. 457

ఉ. బంగరుతొట్టెలందు, పసిపాపలనుంచి సమస్త పౌరవు
ణ్యాంగనలెల్లఁదొక్కమొగి నభ్యుదయోస్తని లాలిపాటలు
ప్పొంగుచుఁ బాడిరయ్యెడనపూర్వమనోహరకంఠమాధురీ
భంగిమమాలకించుచు నభశ్చరకోటులుసంతసిల్లగన్. 458

తే.గీ. జలకమాడించి మృగమద తిలకములను
నొసలఁదీరిచి కన్గవఁబసలుదేలు
కజ్జలముదిద్దినెత్తావికడలుకొనెడి
బహుళధూపంబు లిడుచు, నా బాలకులను. 459

కం. తొట్టెల నిడి యూఁచుచుఁ దమ
చుట్టంబులకేని సతముఁ జూచుటకై మేల్
కట్టడినుంచిన నృపసుతు
లెట్టితరులకంటఁ బడుదురెవ్వేళలలో. 460

తే.గీ. ఎవరి కన్నెట్టిదోయంచుఁ బవలు రేయి
బిడ్డలకునంగరక్షలు పెట్టుచుండ్రు
స్వస్వజీవన సర్వస్వసారరూపు
లనెడి చిత్తంబులం దల్లులనవరతము. 461

## సోదరుల అన్యోన్య ప్రేమ

కం. రామునిగాంచక లక్ష్మణుఁ
డేమరఁడొక నిమిషమైన నేమాత్రం బా
రాముఁడు లక్ష్మణ విరహముఁ
దామనమున సైఁచఁడెంతదాక్షిణ్యంబో. 462

తే.గీ. స్నానపానాదులందైన సైఁచరెపుడు
భరతశత్రుఘ్నులన్యోన్య విరహములను
ఏమి ప్రేమయో కాని యా రామలక్ష్మ
ణులను జూడక తొట్టెలనిలరు వీరు. 463

ఆ.వె. వారుగూడనిట్లె వీరినిజూడక
కాలనిముసమేని గడపలేరు
మాతలెవ్వరేని మధ్యనడ్డంబైన
రోదనమ్మొనర్చి రోయుచుండ్రు. 464

తే.గీ. హాటకాంచిత నవరత్నహారకటక
నూపురాంగదరశనాద్యనూనదివ్య
భూషణభ్రాజమాన శిరీషమృదుల
గాత్రులై యుందు రవనీకళత్రసుతులు. 465

కం. కంగారుపడదె మదనుఁడు
పొంగారెడి శిశుకపోలములపై నెంతో

సింగారమద్దుచుండిన
బంగారవుకుండలముల భాసురగతికిన్. 466

మ. హరినీలమ్ములడాలుడీల్పరచి నవ్యశ్రీలనొప్పారు పె
న్నెరులున్ సొగవెడందకన్నులు నమ్మున్నిద్రాస్యపద్మంబులున్
నరపాలేశ్వరు ముద్దుబిడ్డలకు విన్నాణెంబుతాసొమ్ములై
మురుపుంజూపె నకృత్రిమత్వమున బెంపున్ సొంపు రాణింపఁగన్ 467

కం. ఎన్నండారవ నెల యా
సన్నంబౌనంచు వేచి శాస్త్రోక్తముగాఁ
బన్నగశాయికి రాము న
కన్నప్రాశనమొనర్చి రనుజులతోడన్. 468

కం. అన్నాదుఁడు నన్నమునగు
వెన్నున కా దశరథుండు వేడుకతోఁ దా
నన్నముఁ బెట్టుట పూర్వపుఁ
బున్నెముగాదే తలంప భూతలమందున్. 469

ఆ.వె. చందమామ చేత సమ్మానితమ్ము లై
పండువెన్నెలలను బ్రస్తరించు
సుతులనెమ్మొగమ్ము లతితృష్ణతోఁ బతి
కాంచికాంచి తనివిఁగాంచఁడెపుడు. 470

కం. పుట్టిన వారంబనుచున్
పుట్టిన నక్షత్రమనుచుఁ బొల్పుగఁ బేర్లన్
బెట్టిన దినమని బిడ్డల
కిట్టే వేడుకలొనర్తు రెంతయుఁ దల్లుల్. 471

ఆ.వె. అట్టివేళలొ దవ నాయయోధ్యాపుర
మ్మందుననఁగనేల నఖిలలోక
సముదయమునఁగూడ సర్వవైభవముల
నెరపి పండుగలను జరుపుచుండ్రు. 472

కం. రాముని శుభలక్షణములు
వేమరు మునివరులు గాంచి విశ్వశ్రేయో
ద్ధాముండౌ సాక్షాచ్ఛ్రీ
కాముండితఁడనుచు నమ్మకముఁగని రెదలన్. 473

సీ. పాలబుగ్గలనిగ్గు బహిరంగపరచె నీ
బాలుండు క్షీరాబ్ధిలోలుఁడనుచు
మృదువైన నెమ్మేని మిసమిసల్దెల్పె నీ
శాబకుండహిరాజశయనుఁడనుచు
కర్ణాంతిక ప్రాప్తికలకనుల్ చెప్పె నీ
యభినవ శిశువంబుజాక్షుఁడనుచు
సిరులొల్కుచున్న పెన్నురము చాటించె నీ
వరకుమారుఁడు శ్రీనివాసుఁడనుచు

తే.గీ. నిఖిల సందేహములఁ దీర్చ నేర్పు గలిగి
వెలెసె రాముని నెమ్మేని విలసనంబు
హరి మనోహర దివ్యజిహ్వాంబు లెట్టు
గానఁబడకుండు దాఁచినఁ గానిగుట్టు. 474

ఆ.వె. తొగలరాజునందుఁ దోఁచు వెన్నెలవన్నె
నీసడింపఁ జాలిమోనలెత్తె
చిరుత నవ్వులపుడు నరపతిసుతులకు
జననులరసి మోదజలధిమునుఁగ. 475

ఆ.వె. నీళ్లుపోసి మేన నీరజరజమద్ది
సొమ్ములన్నిఁబెట్టి సొగనుఁజేసి
స్తన్యమొసగి రామచంద్రుని గౌసల్య
కొసరి కొసరి ముద్దుఁ గొనుచునుండు. 476

ఆ.వె. ఎవరి పుత్రులందు నెవరికిఁ బ్రేమమ్ము
లేకయుండుఁ గాని లోకమందు
రామునందుఁ బ్రేమ రాజ్ఞీత్రయంబున
కేక రూపమౌ నిదెంతవింతొ. 477

కం. తల్లులు ముప్వురి యందున్
బిల్లలునల్వురకు నేకవిధమై ప్రేమం
బుల్లసిలుటెంతచోద్యము
తల్లులకున్ బ్రేమమట్లె తనయులయందున్. 478

సీ. కొమరొప్పడింభకుల్గూర్చుండ నేర్చిరి
త్రిదశాధిపతి గుండెదిగులుదీర
క్రమముగాదోఁగాడఁగల్గిరి కీనాశ
వరులధీరత్వంబు వదులువార
నడవనేర్చిరి తప్పటడుగులు వెట్టుచు
ధన్యోస్మియని తండ్రి తలఁచి మురియ
పరుగెత్తసాగిరి పాపపుంజము పటా
పంచలై యెగసి హరించిపోవ

తే.గీ. అద్దుముద్దులు చూపుచునద్భుతముగ
సంకములనుండి తల్లుల వంకజూచి
నవ్వి నవ్వించుచుందు రనారతమ్ము
సహజలీలామహావిశేషములచేత. 479

కం. నాలుగు పురుషార్థములన
నాలుగు వేదంబులనఁగ నరపతితనయుల్
నాలుగు నీరధులనఁగా
జాలుచు నభివృద్ధి నొందసాగిరి ధరణిన్. 480

సీ. అడుగుఁ దామరలందుఁ దొడితాడికడియాల
గజ్జియల్ మ్రోయఘల్ఘల్లటంచు
కైజంట రతనాల కంకణాలరిమురిన్
మురువొప్పఝుణ ఝుణల్పొరయఁజేయ
సిరితూఁగుటుయ్యాలపరువొందుచుండి పె
న్నూరమందు ముత్యాలసరులు మెరయ
చొక్కమౌ కస్తూరిచుక్కచే నగుమోము
తారాధిపతితీరుఁ గేరిమీర

తే.గీ. మెండుకొని గండముల మణికుండలముల
చాయచిత్రాతిచిత్రమై చౌకళింపఁ
దోడఁ బుట్టినవారితో నాడుచుండు
రాముఁ డతితర లోకాభిరాముఁడౌచు. 481

కం. అందరు బంగరు కొండలె
యందరు రతనాలగనులె యవనీశసుతుల్
అందరు సురనుతచరితులె
యందరు శతకోటిమన్మథాంగులె తలపన్. 482

ఉ. సొపడుచున్ ధరాధిపతి స్వాత్మభవుండగు రాముఁగాంచి నా
దాపును జేరరమ్మిపుడుదారగుణాకర! కన్నతండ్రి! సం
దీపిత భాస్కరాన్వయ సుధీమణి! శ్రీ రఘురామభద్ర! యే
రీ పినతమ్ములంచని మరిన్మరి రాముని బల్కరించుచున్. 483

ఉ. వాతెర తేనియందడిసివచ్చెడి రాముని ముద్దుపల్కులా
భూతలనాయకుండువిని పొల్పుగనుల్లము పల్లవిల్ల సం
ప్రీతిఁగవుంగిలించి తనపెందొడ పైనిడి లేఁత బుగ్గలన్
జేతనిమిర్చి ముద్దుఁగొనిచెందునుఖమ్ము వచింపశక్యమే. 484

మ. ఒకయంకమ్మున రామలక్ష్మణులు వేరొంటను సుమిత్రా కని
ష్ఠకుమారుంగయిఁబూని కేకయసుతాసత్పుత్రుడున్గూడిమా
టికిముద్దుల్పయిబైనఁజిమ్ముచును దండ్రిందాఁకి వేబల్కులన్
బ్రకటింపన్ బతియెంతమోదపడెనో పల్కంగలారే కవుల్. 485

ఉ. అంతిపురమ్ములోన నరుదారఁగఁదల్లులచెంత నెంత యో
నంతసమూని యాడుచును సానుజుఁడై రఘురామమూర్తి య
భ్యంతరసీమకేగువసుధాధిపుఁగన్గొని పర్వుపర్వునన్
వింతదలిర్ప వచ్చి మృదువీక్షణముల్పయిఁ గ్రుమ్మరించుచున్. 486

కం. ఆకొమరులు నలువైపుల
భూకాంతునికొనునంటి పొల్పెసలారన్
మాకేమి తెచ్చితిపుడని
శ్రీకరహస్తమ్ములాశఁజెందుచుఁజూచున్. 487

తే.గీ. వారికేల్లమ్మిమ్మపూలను వరుసముద్దుఁ
గొనుచుఁ గౌఁగిటఁజేర్చుచుఁ గువలయేశుఁ
డెత్తుకొని బుజ్జగించుచనేకవిధుల
హర్షవారాశినోలాడు నహరహంబు. 488

ఆ.వె. అంతులేని మోదమధిగమించుచుఁ గుమా
రోపగూహనముల నేపుమీరి
దశరథుండు రాజచంద్రుడు చిత్తమం
దరసి యిట్లుతలఁచునప్పుడపుడు. 489

చ. అరువదివేల యేండ్లు చనినంతనె కల్గుటలాత్మజుల్ నిరం
తరశిశులీలలన్ మధురతన్ వెదచల్లుచు నస్ఫుటంబులై
వరలెడి చిన్నమాటలను వారఁగఁబల్కుచు నన్నలర్తురం
చెరుగఁగదా నిజమ్ముగ మదీప్సితమిట్లు ఫలించునంచొగిన్. 490

వ. ఇట్లనేక విధంబులం దనయదృష్టరేఖంగొనియాడుచు మహామోదభరితాంతః
కరణుండై యుండి.

తే.గీ. చౌలసంస్కారమొనరించి శాస్త్రరీతి
గురుని యానతి సుతులకు ధరణినాధుఁ
డఁక్షరాభ్యాసముంజేయనభిలషించె
సకలమునిపుంగవుల సమక్షమ్మునందు. 492

కం. కుక్షిన్భువనంబుల నిడి
రక్షించుచునున్న లోకరక్షకుఁడౌ నా
యక్షర మూర్తికి రాము న
కక్షరములు చెప్పి రొజ్జలనుజులతోడన్. 493

కం. సామాన్య విద్యనంతయు
ధీమాన్యులు రాజసుతులు దినమొకరీతిన్
బ్రేమమ్మునఁ జదివిరి భూ
కాముని కామితము లెల్ల కడలుకొనంగన్. 494

**శ్రీరామాదులకు ఉపనయనమహోత్సవము**

కం. గర్భైకాదశసమయం
బర్భకులకు ద్విజతనీయ నవనీశుఁడు తా
నిర్భరమోదమునందుచు
స్వర్భూరాద్యఖిలలోకసన్నుతుఁడయ్యెన్. 495

కం. ఒక శుభవాసరమునఁ బా
వకసమతేజుండు గురుఁడు వసుధేశ్వరు బా
లకులకునుపనయనములన్
సకుతూహలుఁడౌచు జరుపుసమయమునందున్. 496

శా. కక్షమ్మందుననుంచిదండము సముత్కంఠంబునంబాణిచే
భిక్షాపాత్రముఁబట్టి జన్నిదము శోభిల్లంగహృన్మధ్యమం
దక్షీణోదయుఁడైన రాఘవుఁడు వృద్ధాచారపూర్వంబుగా
భిక్షాందేహి యటంచుఁ దల్లినడిగెన్ భిక్షంబుఁ జేమోడ్చుచున్. 497

తే.గీ. శాస్త్ర చోదితమగుభిక్ష జననియొసఁగఁ
బూని పాత్రమ్మునం దంఁడ్రిపొంతకరిగి
భిక్షఁగైకొని మునికుల విభునకపుడు
సర్వమర్పించి నుతితతి సల్పెనంత. 498

తే.గీ. అనుజులందరు నన్నగారట్ల సేయ
గురుఁడు తద్భైక్షమున్గొని పరమపావ
నత్వముంగూర్చు బ్రహ్మోదనాభిధాన
హోమమొనరించి సంపూర్ణకాముడయ్యె. 499

కం. అంతట నాశీర్వాదము
లెంతయు నుప్పొంగి బుధులధీశసుతులకున్
సంతసమున నిడిరిఁక భూ
కాంతుని ముదమునకు మేర కలదో లేదో. 500

వ. దశరథుండిట్లు, సకలదేవ బ్రహ్మారాజర్షి సమక్షమ్మునం దన తనయుల కుపనయన మహోత్సవంబు నెరపి, అసమాన సంతోషతరంగిత స్వాంతుండై, కాలక్షేపమొనర్చుచుఁ

గ్రమక్రమంబున రామలక్ష్మణ భరత శత్రుఘ్నులను, సాంగవేదశాస్త్రాధ్యయన పురస్సరంబుగాఁ జతుష్షష్టికలాకలాపవంతులంగావించిన.

తే.గీ. కారుమబ్బుల నెడఁదన్నికానిపించు
జక్కవలరేనిఁబోలి వారొక్కరొకరు
స్వీయవిద్యాప్రభాన విశేషమహిమ
దుర్నిరీక్షణతేజులై తోఁచుచుండె. 502

కం. గురుఁడాధర్వణతత్త్వం
బరయగ నీదశరథేశు నాత్మభవులకున్
గురిచేసి నూరిపోసెను
గరమరుదుగనంచు దేవగణమునుతించెన్. 503

తే.గీ. గట్టురాపట్టిచూలికి గలదొ లేదొ
యిట్టి కోదండపాండిత్య మిట్టియూహ
లిట్టి సమయోచితజ్ఞానమిపుడటంచుఁ
గనుచు రాముని లోకముల్వినుతిఁజేసి. 504

ఉ. అందరు నందరే యయిన నందరిలోపల రామమూర్తి చ
క్కందనమందు శౌర్యమునఁ గార్ముకలాఘవమందు మేటియై
విందొనగూర్చె వేల్పులకు విశ్రుతకీర్తిరమావిశాలతన్
జెందినిరంతరంబుఁ బితృసేవఁ బ్రధానముగాఁ దలంచుచున్. 505

ఆ.వె. అఖిలలోకమంగళాస్పదుఁడౌ రాముఁ
డప్పుడపుడు తండ్రి యాజ్ఞగొనుచు
వారువంబునెక్కి వనికేగునప్పుడుఁ
గూడ లక్ష్మణుండు తోడువిడఁడు. 506

ఉ. కంటినిరెప్పవోలి కలకాలము రామునిభక్తితోడఁ దా
జంటగనుండి రక్షణమునల్పుట నైజముగాన లక్ష్మణుం
డింటవసింపనొల్లఁడెపుడేనియు రామునివీడి బాణము
న్వింట ధరించియేగువెనువెంటనె శేషకలాభిమానియై.

కం. భరతుని పదసేవారతి
నిరతుండై శత్రుఘాతి నివసించెడు నే
తరుణమునందైనం ద
త్పరమాన్న విభాగభాగ్య భాసురమహిమన్. 508

**శ్రీరాముడు పండితులతో శాస్త్ర గోష్ఠులను జరుపుట**

ఉ. స్నానము సంధ్యయుం జపము సాంగముగా నేరవేర్చి నిత్యమున్
దానసుజన్మలన్గలసి తండ్రి సమీపమునన్ సుఖాసనా
సీనతఁజెంది రాఘవుఁడశేషధరాపరిపాలనక్రియా
జ్ఞానమునంతరించుచు ననన్యయశోవిభవాభిరాముఁడై. 509

ఆ.వె. మునులతోడఁ గూడి భుజియించుచును రామ
భద్రుఁడఖిల ధర్మపద్ధతులను
వినుచు వినిన ధర్మమును బరామర్శించు
చుండు సంతసంబు మెండుకొనఁగ. 510

సీ. శబ్దశాస్త్రార్థ విచారమొక్కొకవేళ
నొకవేళ న్యాయతంత్రోక్తచర్చ
సరసగానామృతాస్వాదమొక్కొకవేళ
నొకవేళ బహువిధసుకవిగోష్ఠి
జ్యోతిషోపన్యాసరీతులొక్కొకవేళ
నొకవేళ దండనీత్యుక్తి రచన
కావ్యకల్పన చమత్కారమొక్కొకవేళ
నొకవేళ నిగమనిరుక్తచింత

తే.గీ. అన్నివేళల యందిట్టులన్నివేద
ములును శాస్త్రమ్ములన్నియు న్గలసిమెలసి
రామభద్రుని నాల్కపై రహివహించి
తాండవము సల్పుచుండు నిష్ఖండలీల. 511

కం. గురువర్యుననుమతమ్మునఁ
బరమర్షులతోడ శాస్త్ర పద్ధతివెలయన్

గరమరుదుగ వాక్యార్థము
జరుపును రాఘవుఁడొక్క సమయమునందున్. 512

కం. తన సుతుల విద్యపెంపును
ఘనతరసౌందర్యములను గనిసంస్తుతులన్
జనమాన్యతయున్గని తన
మనముననుప్పొంగి యిట్లు మహిపతితలఁచెన్. 513

ఉ. సంతతికల్గనేరదని సారెకు నిస్పృహఁ జెందియున్న నా
కెంతయు సంతసంబుజనియింప జనించుట లిట్టిబాలకుల్
వింతగ విద్యలందు నరవిందభవేంద్రముఖామరాళితో
వంతున కెక్కుటెంత పరివర్తనమోకద నాచరిత్రకున్. 514

ఆ.వె. ఇంతకాలమునకు నెంతయునే మహా
ధన్యజీవినైతిఁ దనయులకును
జాతకాదిముఖ్య సంస్కారములు సల్పి
నేరిపించి కళలనేర్పు మీర. 515

ఉ. కోరికలన్ని చాలవరకున్ ఫలియించె సమానులైన భూ
దారులతోడవియ్యమరుదారఁగనొందిన భారమంతయున్
దీరునటంచుఁ బుత్రులకు దీటగుకన్యలఁదెచ్చిచేయఁగా
నారయుచుండె దేశముల నచ్చటనచ్చటఁగౌతుకంబునన్. 516

వ. ఇట్లవనీశ్వరుండు, మంత్రిసామంతహిత పురోహితాదులవలనందనపుత్రులకను రూపరూపైశ్వర్యవయోవిలాసవిభవాద్య సాధారణ దివ్యకళ్యాణగుణ ప్రకాశికలగుమత్త కాశినులనన్వేషించుచు.

ము. సిరికన్నుంగవచాయవీడక రుచిశ్రీమీరనెమ్మోమునం
దరవిందాసనురాణివాణికొలువై యత్యాదృతిన్ నిల్వఁగా
నిరతానందసుఖానుభూతిశుచియై నిత్యంబుఁ గొల్వన్ యశ
స్తరుణీరత్నమశేషభూతలము నిస్తంద్రాత్ముఁడై యేలుచున్. 518

వ. వసిష్ఠ వామదేవాద్యఖిలమునిజనాదరాభిమాన పాత్రుండగుటచే, సకలసౌఖ్యాతి రేకానుభవజాయమానమహామోదాంతఃకరణుండై యుండు నవసరంబున. 519

**విశ్వామిత్రుఁడు అయోధ్యకు వచ్చుట**

కం. ధీమహితుఁడుకులపతి వి
శ్వామిత్ర మునీంద్రుఁ డపరచతురాస్యుఁడు శ్రీ
రామునిఁగన దనమనమునఁ
గామించి ప్రమోదమపుడు కడలుకొనంగన్. 520

సీ. క్షితిఁగలారికి శేష శేషిత్వసిద్ధాంత
మును గన్నులంజూపి మనుదుఁగాత
భగవానుఁడెంతయు భక్తపరాధీనుఁ
డనునుడి సార్థకంబగునుగాత
ఈ గాధినందనుండిపుడులోకక్షేమ
కారణుండని కీర్తిఁ గాంచుఁ గాత
జగతి లక్ష్మీ విశిష్టత్వమద్వైతమ్ము
నకుఁ గలదనిసాక్షి నౌదుఁగాత

తే.గీ. కృతులకైనను దేవతాపతులకైన
సతులకైనను లోకైకహితులకైన
గురుని యానతియౌదలఁ గూర్చఁదగిన
దనెడి ధర్మంబునకు జీవమబ్బుఁగాత. 521

కం. అని తలఁచి తలఁచి మనమున
మునికులపాథోధిచంద్రముఁడు గాధిసుతుం
డనుపమతేజోనిధి స
జ్జననుతచరితుండయోధ్యఁ జనుదునటంచున్. 522

తే.గీ. పయనమై వచ్చి దశరథపార్థివేంద్రు
రాజధానికిఁ బరమ విరాగియైన
కౌశికుఁడు చేరె రత్నవికారరాజ
సౌధగోపురద్వారంబు సత్వరముగ. 523

వ. తద్ద్వారాధ్యక్షులంగాంచి, నిరంతరబ్రహ్మవ్రతుండగు గాధిసుతుండు, భవద్దర్శ నార్థియై యరుదెంచి యుండెనని, సార్వభౌమునకెరింగించుఁడని యాజ్ఞపించి పంప,

వారును, ససంభ్రమంబున మహారాజసభా భవనంబు దరిఁ జేరునంతలో.

సీ. వేదాంతవిజ్ఞానమోదాంతరాత్ములౌ
  మునివర్యులభినవఘనతనరయ
సామంతభూపాలసీమంతమణికాంతు
  లడుగుఁదమ్ములపైన నుడులుతిరుగ
శరచాపధరులౌచు వరవీరభటులష్ట
  దిక్కులలోనిల్చి పిక్కటిల్ల
వందిమాగధనూతబృందమ్ములిరుగెలం
  కులనిండినన్నుతుల్సలుపుచుండ

తే.గీ. రత్నకంకణఝుణఝుణారావములయ
సురటులన్వీవ శృంగారసుదతులెలమి
గాయకోత్తములమరవిధేయులైన
కవివతంసులుకీర్తింపఁ జవులుగొలుప. 525

తే.గీ. వేదవేదాంగవేత్తలు విప్రవర్యు
లఖిలశాస్త్రార్థతత్త్వవిదగ్రసరులు
సరససాహిత్య చతురతాసారమతులు
నందడించుచునానందమొందికొల్వ. 526

తే.గీ. మాంత్రికులు తంత్రవేత్తల మాత్యవరులు
నిరతనిస్తులభక్తిసంభరితులౌచు
రాజపురుషులు సామ్రాజ్యరక్షకులును
దనరుచుండిన సత్సభాంతరమునందు. 527

తే.గీ. అమరదుర్లభవజ్రసింహాసనమున
బాలభాస్కరులీలలన్గ్రేలిచేసి
దేశదేశాంతరస్థితుల్ దెలిసికొనుచు
నుండునప్పుడు భూతలాఖండలుండు. 528

తే.గీ. ద్వారపాలకులిరువురుదారలీల
సత్వరమ్మునసురుదెంచి క్ష్మాధినాధు

నకునమస్కారమొనరించి నయభయముల
విన్నపముఁజేసిరిట్లు సవిస్తరముగ. 530

తే.గీ. ఏధమాన తపోనిధి గాధిసుతుఁడు
సంయమీంద్రుఁడు వచ్చి హజారమందు
నిల్చి త్వద్దర్శనాకాంక్షనెక్కొనంగ
నాజ్ఞకొరకిట్లు మముఁబంపె నవనినాథ! 531

చ. అన విని పార్థివోత్తముఁడు హర్షపరీతహృదంతరాళుఁడై
కనుఁగొనలన్ ముదశ్రువులుద్రమ్మఁగ మేన్గగురింపఁ బ్రీతిమై
యనిమిషపూజ్యమానచరణాబ్జుఁడు కౌశికమౌని నాగ్రహ
మ్మునకరుదెంచె నీ సుకృతమున్గణియింపవశంబె యేరికిన్. 532

కం. ఇటుతలఁచి సింహపీఠిన్
జటుకునదిగి గురులమాత్య సామంతనృపుల్
భట తతి బంధువులాప్తులు
నటగాయకవరులువెంట నడువన్ గుములై. 533

కం. పూజాద్రవ్యముఁగైకొని
తేజఃపటలప్రభావదీప్తుండగుచున్
భూజానివెడలి మునికుల
రాజేంద్రుం గనఁగ వచ్చె రాణదలిర్పన్. 534

సీ. మేలిబంగరుడాలు గేలిసేయఁగజాలు
లీలనౌదలజటాజాలమొప్ప
వారిజంబులతీరు సారెసారెకు మీఱు
మోముపైనెనలారునామమమర
తరుణారుణోత్పలోదరసహోదరమౌచు
వఱలు కన్గవహర్షమురలికురియ
సురుచిరహరిపాదసరసిజవరభక్తి
మాటికిమేన్గగుర్పాటుఁగూర్ప

తే.గీ. కాంతునిత్తరి వేదవేదాంతతత్త్వ
పరమయాథార్థ్యరూపమున్గ ఱవుదీర
ననుచు నుఖ్యాతలూఁగుచు మనములోన
నుండు మౌనీంద్రుఁగనె ధరాఖండలుండు. 535

సీ. తెలిదమ్మిపూవుపైఁ గొలువుఁదీరినమేటి
నలరించె నెవఁ డాత్మబలముచేత
మాటలో రంభావధూటినెవ్వఁడు తిట్టి
నడవిఁ బాషాణమై పడియడంగ
దివినుండిపడెడి భూధవునెవ్వఁడీక్షించి
పొంగారుశక్తిచే నింగినిల్పె
అమరులపైనల్గి కొమరొప్పనెవ్వాఁడ
నర్గళంబుగసల్పె స్వర్గసర్గ.

తే.గీ. మెవని నామాక్షరమ్ముత్రిభువనములకు
భీతిఁబ్రీతియుఁ గూర్చుచు నీతిఁగఱవు
చుండు తాదృశబ్రహ్మర్షిమండనుని స
మీపముంజేరె దశరథ భూపవరుఁడు. 536

కం. మునినాథుని చరణద్వయ
వనజమ్ములపైనవ్రాలె వసుధాపతి స
ద్వినయావనతుండై "మమ
ఘనదోషాన్ హర" యటంచు గద్గదికమెయిన్. 537

కం. ఆశీర్వాదము లొసఁగెన్
గౌశికముని ప్రభునకపుడు కనుదమ్ముల నా
వేశించి మోదజలకణ
రాశుల్పొసిల్ల శుభతరంగితమతియై. 538

తే.గీ. అంతఁ బార్థివసత్తముఁ డా మహర్షి
వర్యునకుఁ జేసె శ్రౌతసపర్యవికచ
కోమలాబ్జాననుండయి కూర్మిమీర
వినయభయభక్తిరాగముల్ పెనఁగొనంగ. 539

కం. భూపతి చేసిన పూజం
దావసవర్యుండు గాధితనయుఁడు హర్షో
ద్దీపితమానసుఁడై గా
రావుం జుట్టమ్ముఁవోలి ప్రవిమలఫణితిన్. 540

**విశ్వామిత్రుడు దశరథుని కుశల ప్రశ్నలడుగుట**

కం. కుశలంబవ్యయమే యని
కుశికాత్మజుడడిగె రాజకులశేఖరునో
దశరథభూమీశ్వర నీ
వశమై వర్తిలుగుగాదె వసుధయటంచున్. 541

ఉ. క్షేమమెదారపుత్రుల కోశసుహృద్వరబంధుపాళికిన్
ధీమహితుప్రధానులకు దేశికవర్యులకున్ శుభంబె స
ర్వామరకోటి జన్నముల హవ్యముఁ గైకొనవచ్చిపోవుచున్
గామితముల్ఘటించి కలకాలమునీయభివృద్ధిఁగోరునే. 542

ఆ.వె. పౌరజానపదులు భద్రమ్ములకునించు
కేని భంగపాటుఁ గానరుగద
వాయుజలవిషాగ్ని బాధలాధివ్యాధు
లెందు లేవు గద పురందరసఖ! 543

సీ. కళికల్వలన్ బోలి వళులువాల్గన్నుల
పడఁతులు చామరాల్పట్టివిసర
తొలిచదువులగట్టుతలలదాఁగినతత్త్వ
చింతామణిన్ బుధుల్చికిలిసేయ
భటభయంకరహేతిపటలకాంతిచ్ఛటల్
పరిపంథిమనములన్నరుగులిడఁగ
కరదానపరభూపవరమణిభూషణ
మండలంబెలిమియీరెండఁగాయ

తే.గీ. మంత్రివర్యులు రాజ్యాంగతంత్రమరయ
భద్రసింహాసనమున నిర్భిద్రరుచులఁ

దనరిధర్మైకపక్షపాతమువహించి
విశ్వసమ్రాట్టువై యుంటివే కుమార! 544

తే.గీ. కరము మానుషదైవికకర్మములను
సల్పి కీర్తిగడించుదే క్ష్మాతలమున
అడుగవలసినవిధి యౌటనడుగుచుంటిఁ
గాని కొఱతలు గలవని కాదు తండ్రి! 545

కం. వీసంబైనను నీకు
న్వ్యాసవునకు లేదు వార వసుధేశ్వర! వ్య
త్యాసము ద్యోభూలోకా
వాసములను మాటయొకటె వానికి నీకున్. 546

తే.గీ. ఇలను బ్రహ్మర్షిమూర్ధన్యుఁడీవసిష్ఠుఁ
డరయ మీ కులగురువర్యుఁడౌటఁజేసి
భద్రములకంతరాయమేపగిదిఁగలుగు
త్వద్భుజాదండపరిపాలితమగు భువిని. 547

చ. అనుచు వసిష్ఠమౌనిఁగని హర్షసమంచితనేత్రుఁడై మహా
వినయముతోశుభమ్మడిగి విస్ఫుటహార్దరసానువిద్ధులౌ
మునులను బల్కరించి నృపముఖ్యుల సేమమువేఱువేఱుగాఁ
బనివోని పృచ్ఛఁజేసి నరపాలుని ప్రార్థనమాదరించుచున్. 548

చ. మునులు గెలంకులన్ నడువ మోదముతోడ వసుంధరావిభుం
డనయము భక్తినమ్రుఁడయి హస్తయుగమ్మును మోడ్చి వెంటనే
తనరనమాత్యులున్ భటవితానము సర్వసుహృజ్జనంబు, తత్
క్షణమరుదెంచి కౌశికుఁడుగాంచె నృపాలుసభాగృహంబొగిన్. 549

కం. అమిహిరాన్వయమణియగు
భూమీశుఁడు దశరథుండు పాల్వారఁగ వి
శ్వామిత్రమహామునివరుఁ
గామితమందారు సకలకల్మషహారున్. 550

కం. వినయముతోడన్ఘనకా
సనమునఁగూర్చుండఁజేసె సామంతనృపుల్
జనవిభుకనుసన్నలచే
మునుకొనికూర్చుండిరతులమోదమెలర్పన్. 551

కం. తమతమ పీఠోపరి భా
గములన్గూర్చుండి మునులు కౌతుకమొప్పన్
విమలాత్ముఁడు కౌశికు నా
గమకారణమరయుచుండె ఘనచిత్రములన్. 552

**దశరథుడు విశ్వామిత్రుని ఆగమన కారణమడుగుట.**

ఉ. అల్లన రాజమౌళి కుశికాత్మజుసన్నిధిఁజేరి యెంతయో
యుల్లసముల్లసిల్లఁగ సముద్గతభక్తిరసానుభూతి శో
భిల్లఁగ నాత్మలో నుచితపీఠముపై నివసించి సాధ్వసం
బల్లుకొనంగవాక్కులను హస్తయుగమ్మునుమోడ్చి యిట్లనెన్. 553

చ. కుశలమె శిష్యసంచయము కొల్లగదాభవదాశ్రమంబునన్
గుశఫలపుష్పమూలములు, క్రూరమృగమ్ములబాధలేదుగా,
నిశితతపోవ్రతాచరణనిష్ఠకు విఘ్నముగల్గకుండెనే
కుశికతనూజ! మౌనికులకుంజర! తెల్పఁగదే దయామతిన్. 554

ఆ.వె. చవిటినేల మంచిజలముద్భవంబౌట
నిర్ధనునకు ద్రవ్యనిధిదొరకుట
అలసియున్నవాని కమృతంబుచిక్కుటల్
కాదె, నీదురాకయోదయాబ్ధి! 555

ఆ.వె. ఆత్మపత్నులందు ననురూపసంతతిఁ
గన్ననాటికంటె మిన్నయయ్యె
పరమయోగివంద్య! భవదాగమనమునఁ
గలిగి వృద్ధియైన కౌతుకంబు. 556

ఉ. పావనమయ్యెగేహము భవత్పదపద్మరజోవ్రజంబుచేఁ
గేవల సుప్రసిద్ధమగు కీర్తిలభించెమహానుభావ నా

జీవనమెంతయున్ ఘనతఁజెందెన దృశ్యములయ్యెఁ బాపముల్
భూవిభులం దనూనమగు పూజ్యతవొందితి నీదురాకచే. 557

కం. నా సదనమ్మునకిటు దయ
చేసితి ననుధన్యజీవిఁజేయుటకొఱకై
యోసచ్చరిత్ర! మునునేఁ
జేసిన సుకృతంబదెంతో చెప్పవశంబే. 558

తే.గీ. ఘోరసంసార పీడలన్గములుచుండు
మమ్ముబోంట్లకు భవదాగమమ్ముతలఁప
నమృతధారాప్రవాహమైయలరుఁగాదె
సకల సంయమికులవరసార్వభౌమ! 559

తే.గీ. దైవికంబుగ నరుదెంచినావుగాని
యత్నమొనరించినను లభ్యమౌనెమాకు
యుష్మదాగమసౌభాగ్యమోదయాబ్ధి!
చారితార్థ్యముఁ గూర్చితీ జన్మమునకు. 560

తే.గీ. బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టిఁ బరఁగఁజేసి
నట్టినీదివ్యమాహాత్మ్యమవనిలోనఁ
దెలిసినుతియింపనర్హత కలిగి మెలఁగు
మనుజుఁ డెవ్వఁడు గలఁడు బ్రహ్మణ్యమూర్తి! 561

తే.గీ. గాధినందనుఁడఘటితఘటకుఁడెలమి
దశరథునిజూడ వచ్చె నాదరము తోడ
ననుచుఁ బదుగురుననుకొన్న ఘనము గాదె
సాటిరాజులలో నాకు సంయమీంద్ర! 562

ఉ. రావెపుడర్థకామముల లాభముఁగోరు నృపాలపాళితోఁ
బావకతేజ! త్వత్పదృశపావనమూర్తులకెట్టి కార్యముల్
భూవలయమ్మునందునుచు బుద్ధినెఱింగియు వేఁడుచుంటినీ
వీ విధినేగుదెంచుటకు హేతువుఁదెల్పు మహాత్మ! సత్కృపన్. 563

తే.గీ. పాత్రభూతుండవౌటచే బరమయోగి
వంద్య! నీకిష్టమౌ వస్తువర్గమెల్ల
నిడెదఁదెల్పుము నీ మనోభీష్టమిపుడు
సంశయింపకు నాపల్కు సంయమీంద్ర! 564

కం. నీ కామితముం దీర్చెద
నో కారుణ్యాబ్ధి! వితరణోజ్జ్వలమతినై
నాకానతినిడు సత్వర
మీకార్యంబీవొనర్పు మీయెడ ననుచున్. 565

కం. ఈ కరణిననిన దశరథ
భూకాంతునిజూచి మౌనిపుంగవుఁడనె ని
ట్లోకమలాప్తాన్వయమణి!
నీకేతగిపోయెనిట్టినిశ్చయమిలలో. 566

కం. రఘువంశమందు జననము
మఘువునితో మంతనమ్ము మౌనులసఖ్యం
బఘుదూరమౌచరిత్రము
లఘుతరవాక్యమ్మునెట్లు రానిచ్చునొగిన్. 567

ఆ.వె. ఘనుఁడు తత్త్వఁవేత్త కమలాసనుని పుత్రుఁ
డఖిలలోకవంద్యుఁడమలయశుఁడు
నైన యీ వసిష్ఠమౌనీంద్రునకు శిష్యుఁ
డనఁగఁ బల్కితీవు జనవరేణ్య! 568

మ. ఇల రాజన్యులనెందఱెందఱినొ నే నీక్షించితిం గాని యీ
లలితాకారము వాఙ్మధూత్కటత కల్యాణక్రియానిష్ఠయే
వలనుంజూడఁగనైతి వారియెడ నావంతేని భూపాలవ
ర్గలలామా! సుగుణైకధామ! జితవీరస్తోమ! ధర్మాకృతీ! 569

తే.గీ. ఎఱుకపఱచెద మన్మనోభీష్టమిపుడు
దానినొనరించి సత్యతత్పరుఁడవగుము

సావధానమ్ముతోవిను సకలరాజ
దివ్యకోటీరమణిగణోద్దీపితాంఘ్రి! 570

**విశ్వామిత్రుడు తన యాగదీక్షను గురించి చెప్పటం**

ఉ. ఏ నొక జన్మమున్నలుపవెంచితి దానికి దీక్షనొందఁగాఁ
బూని ప్రయాసకోర్చి హుతభుక్పరిచర్యలొనర్తుమన్న గీ
ర్వాణవిరోధులిర్వురతి వంచకులై చనుదెంచి విఘ్నముల్
మానకసేయుజాతురనుమానముపీడి వసుంధరాధిపా! 571

కం. నేనెపుడు సవనదీక్ష
న్బూనుటకై సర్వయత్నమును జేయుదునో
నానావిధాంతరాయములా
నీచులు గూర్తురపుడె హర్షాత్మకులై. 572

వ. యజ్ఞదీక్షాగ్రహణాంగభూతంబగు నకల్మషహోమాదిప్రక్రియాకలాపంబు నెఱవేర్పు చుండునెడ. 573

ఆ. ఆకసమ్మునుండి యగ్నికుండమునందు
ఘోరమాంసరక్తధారలెలమి
నింతురట్టి పరమనీచాత్ములా రాక్ష
సాధమాధములు ధరాధినాథ! 574

వ. సవనదీక్షాగ్రహణసంస్కారాచరణ సంకల్పంబిట్టిచింతతో బహువారంబులు భగ్నం బయ్యెననిపల్కి మరియు నిట్లనియె. 575

తే.గీ. దీక్షకే యిట్టి విఘ్నముల్ దేఁగలార
లింకసవనముఁగొనసాగనిచ్చుటెట్టు
లా దురాచారులవినీతులధికబలులు
సకలసద్గుణధామ!సార్వభౌమ! 576

ఉ. శాపమొసంగి చంపుటకు శక్తుఁడనయ్యును యజ్ఞదీక్షతో
నేపగుకోపమూనఁదగనెంతయునంచని శాంతినొంది త
త్పాపులరూపుమాపుటకుపాయముతోఁచి మనమ్ములోన నీ
దాపునకేగుదెంచితి నుదారమతీ! యిపుడేమిచేసెదో! 577

తే.గీ. క్రతుఫలప్రాప్తి విఘ్నకరంబు సవన
తంత్రదీక్షితుఁడొనరింపఁదగనికార్య
మలఘుదివ్యతపోవ్యయంబగునుగాన
శాపమిడఁజాల నానిశాచరులకిపుడు. 578

తే.గీ. మహిని సుందోపసుందకుమారులఖిల
దైత్యవల్లభు రావణుదండపతులు
వారలంతంతమాత్రపు వారివలనఁ
గూలరతితరమాయావిశాలబలులు. 579

కం. వారిద్దఱన్నదమ్ములు
మారీచసుబాహులనెడి మాయావేదుల్
ఘోరాకారులు త్రిభువన
చారులు హితదూరులమితశౌర్యవిహారుల్. 580

శా. శాపమ్మిచ్చుట కోపమూనిజయమున్సాధింపఁగా ఘోరమౌ
చాపమ్మందు శరంబుఁగూర్చుటయు దోషంబంచు నే నింత సం
తాపమ్మొందుచునుంటిఁగాని యిపుడాధర్మంబుఁబోనాడి దు
ష్పాపమ్మున్ దరిఁజేర్తునేని జగముల్శోషిల్లవే పార్థివా! 581

**యాగసంరక్షణకై శ్రీరాముని తనతో పంపుమని**
**విశ్వామిత్రుడు దశరథుని అడుగుట**

మ. క్రతువిఘ్నంబొనరించు రాత్రిచరులన్ఖండించి లోకాళికిన్
వితతమ్మైన శుభంబుఁగూర్పఁగ మహావీరాగ్రణిన్ రూపని
ర్జితకామున్ రఘురాముఁ దోడ్కొనిచనన్ శీఘ్రమ్ముగానిట్లు వ
చ్చితి నీయొద్దకుఁ బంపుమిప్పుడు భవజ్జ్యేష్ఠాత్మజున్ భూవరా! 582

కం. దశరాత్రక్రతువయ్యెది
శశికీర్తి! పంపు రామచంద్రుని నాతో
దశదిగ్వ్యాపకసుయశో
వశుఁగా నొనరించి మరలఁ బంపెద నధిపా! 583

కం. నా మానసగత తేజము
రాముని వేష్టించి యిపుడరాతులనడఁపన్
భూమీశ! సాయపడఁగల
దేమియునంశయమునొందకీయర్థమునన్. 584

కం. రాముని వలనంగానీ
యా మాయావులు నశింపరాహేతువు చే
శ్రీమద్రవికుల సాగర
సోమా! నిన్నడుగుచుంటి సుతునిమ్మనుచున్. 585

చ. పది పదునాల్గురోజులు భవత్తనయాగ్రజుడైన రాముపై
వదలి నిరంతర ప్రణయవాంఛను నావెనువెంటఁ బంపు నీ
హృదయమునందు భీతిలకుమీ సవనంబు సమాప్తిఁజేసి నేఁ
బదిలముగా నొనంగెదను బార్థివ! నీ ప్రియపుత్రరత్నమున్. 586

శా. ఈరీతి న్గుశికాత్మజుండడుగ భూమీశుండు భీతిల్లి వే
సారెన్ సారెకు మీఱి దాహము ప్రపంచంబే మహాచిత్రమై
ఘోరమ్మైకను పట్టె శౌర్యమణఁగెన్ గోర్కుల్నశించెన్ జడా
కారమ్మొందె శరీరధర్మమనువుల్కంపించెనంతంతలో 587

ఆ.వె. తెప్పతిల్లియెట్లొ దీనాతిదీనుఁడై
ముప్పు వచ్చెననుచు మోమునందు
విన్నఁదనముతోఁప వికలేంద్రియుండౌచుఁ
బల్కెనిట్లు మౌనివరునితోడ. 588

**శ్రీరాముని పంపలేక దశరథుడు తనలో పరితపించుట.**

కం. నా రామునకిప్పుడు పదు
నాఱేఁడులవయసుగూడ నగుపడదెటులీ
నీరేజాక్షుఁడు రాత్రిం
చారులతోఁ బోరఁగలడు సంయమినాథా! 589

ఆ.వె. అబ్బురంపు బాలుఁ డకృతశస్త్రాస్త్రుండు
నాటపాటలందు నలరువాఁడు

యుద్ధతంత్రమెరుఁగఁ డోర్వఁడు కష్టమ్ము
లట్టిరామువలన నగునదేమి. 590

ఉ. మొన్నటివాఁడు రాఘవుఁడు మూర్ఖులపారమహోగ్రతేజుల
త్యున్నత బాహుశౌర్యయుతులూర్జితసత్వులు కామరూపసం
పన్నులు కూటయుద్ధవరిపంథినిషూదనులానిశాచరుల్
క్రన్నన నీతఁ డట్టిరిపులన్బడఁగొట్టి మఖంబుఁగాచునే? 591

తే.గీ. కపటమెఱుఁగని రాముని గటికరక్క
సులకునర్పింప నీకీయఁ దలఁచుటెట్లు
నాదు జీవనసర్వస్వనాథుఁడైన
రామునెడబాసి క్షణమైన బ్రతుకుటెట్లు. 592

కం. నిండిన వాత్సల్యముతోఁ
బండుగలకునైన నెటకుఁబంపఁగ లేదీ
భండనమందున రక్కసి
పిండునకర్పింప నెట్లువిడుతును రామున్. 593

వ. అని బహుప్రకారంబుల రామ విరహంబుసహింపనేరనని యమ్మహామునీంద్రునితో విన్నవించి వెండియునిట్లనియె. 594

ఆ.వె. మౌనిచంద్ర! నీకు మఖరక్షణముగదా
చేయవలసినట్టి చేఁతయిపుడు
ఎవ్వరైననేమి యిపుడనుమతినిమ్ము
వైరివధమొనర్చి వచ్చువాఁడ. 595

వ. అని ప్రార్థించుచున్న భూజానింగాంచి కౌశికుండిట్లనియె. 596

కం. చావరునీచే నవ్వా
రేవిధిఁ బోరిననుగాని యినకులతిలకున్
బావనమూర్తిని రాముని
భూవర! నా వెంటనంపి పురముననిలుమా. 597

ఉ. రాముఁడు చిన్నవాఁడనుచు రాక్షసులన్నను భీతియంచు గా
రాములమూలమంచు ననురాగవశీకృతమానసుండవై

వేమఱుపల్కుచుంటివి వివేచనసేయవుచిత్తమందు శ్రీ
కాముఁడటంచెఱుంగక వికారముఁ గూర్చితివింద్రియాళికిన్. 598

త.గీ. రాముసెఱుఁగుదు సత్యపరాక్రముందు
నఖిలలోకైకహితుఁడు మహాత్ముఁడనుచు
మహిత తేజుఁడగు వసిష్ఠమౌనియెఱుఁగు
నెఱుఁగుదురు కొంత యీతాపసేంద్రులెల్ల. 599

మ. స్వకులాచార్యుఁడు మంత్రులున్ హితులు నిస్సందేహులై రాఘవున్
సకలోర్వీజనసమ్మతక్రతువురక్షన్ జేయనంపించుటల్
సుకరమ్మైన శుభాగమంబనెదరో నుంతైన సేమంబు లే
దిఁకఁ జాల్చాలని యందురో తెలిసికొమ్మీపట్టునన్ బార్థివా! 600

తే.గీ. ఎవ్వరభ్యంతరముఁ జెప్పరిట్టివనికి
నిపుడు నిర్వేలచింత నీకేలచెపుమ
అధికసమ్మదమభినవయశముఁగొనఁగ
నిష్టమగునేని సుతునంపు మీక్షణంబ. 601

కం. అనవిని వసుధాపతి తన
మనమున నిటుదలఁచె విసిగి మతిమతి నన్నీ
దినమునశనివట్టె మునీం
ద్రునకేమనిచెప్పవలెనొతోఁచకయుండెన్. 602

కం. ఉపగిదిబహువిధమ్ముల
భూపాలుఁడు తలఁచితలఁచి మునికనెనిటు లో
తాపసవర! మనవిని విను
లోపములన్సైచి పుత్రలుబ్ధునియెడలన్. 603

తే.గీ. ప్రాణములకంటెఁ బ్రియుఁడు శ్రీరామభద్రుఁ
డతనివిడనాడి మనఁజాల నవనిలోనఁ
గాన ననుఁగూడఁగొనిపొమ్మువానితోడ

తే.గీ. నాకు నల్వురుకొమరులున్నారు వారి
లోన జ్యేష్ఠుండు ధర్మ విలోలహృదయుఁ
డైన రాముని యందు నా కధికమమత
కానవిడనాడలేనొక్కగడియయైన. 604

వ. మహాత్మా! భవాదృశులగు మహాత్ముల యనుగ్రహపరిపాకవిశేషంబునం జేసి, నాకక్షౌహిణీ పరిమితంబగు మహావీర వరసైన్యంబుగలదు మరియు నానావిధ శస్త్రాస్త్ర సంధాన చతురులు, భయంకర రక్షోగణ మారణదక్షులునగుదండనాయకులనేకులు లెక్కకు మిక్కుటమైయున్నవారు. అట్టి దుర్ధరవీర భటకోలాహలముఖరిత రోదసీకుహరంబగు మహాసైన్యముతోడం గూడివచ్చి. 606

తే.గీ. నే ధనుష్పాణినౌచు నా యోధనమునఁ
బ్రాణముల మీఁద నాసక్తిఁ బాఱఁదోలి
రాక్షసులఁగూల్చి సవనసంరక్షణమ్ము
సల్పి వచ్చెద నారాకనమ్మతించు. 607

చ. మునికులనాథ! నీసవనమున్గానసాగక విఘ్నకర్తలై
యనిశమునంచరించు దనుజాధములెచ్చటనుండువారలె
వ్వని భజియించుచుండుదరు వారిబలోన్నతి రూపధైర్యముల్
రణకుశలత్వమేపగిదిరంజిలుచుండు నెఱుంగఁదెల్పవే. 608

కం. నాకును నాసైన్యమునకు
నా కొమరుఁడు రామభద్రునకు నేతెఱఁగున్
జేకొనవలె వైరులయెడ
నోకరుణాబ్ధీ! యుపాయమొనరంజెపుమా. 609

కం. ఎటునుండెట్టుల వచ్చెద
రెటుచరియించుదురు వారలెవ్వరిబంధుల్
ఎటువరిమార్పఁగవచ్చున్
దృటిలో నారక్కసులను దేశికవర్యా! 610

ఆ.వె. విస్తరించివారి వివిధ రహస్యముల్
ముందుఁ జెప్పిజయమునొందఁజేయు

మనుచు వేఁడుచున్న మనవంశనాథుని
గాంచి కౌశికుండు కరుణతోడ. 611

తే.గీ. ఇట్టులనియెను సంతోషముట్టిపడఁగ
రాజమార్తాండ! వినుము తద్రాత్రిచరుల
సకలవృత్తాంతమును నీకుసంగ్రహముగఁ
తెలియఁజెప్పదనని యిట్లు తెలుపఁదొడఁగె. 612

## రాక్షసుల వృత్తాంతమును విశ్వామిత్రుడు చెప్పుట

సీ. అల పులస్త్యబ్రహ్మకులమునజన్మించి
చతురుఁడై వేదశాస్త్రములుచదివి
ఘోరతపమ్ముచే నీరజగర్భున
కసమానమైనసంతసముఁగూర్చి
సురదానవభుజంగవరులొందనేరని
వరములా పరమేష్ఠివలనఁబడసి
తద్వరగర్వంబు తలకెక్కిదనుజాధి
నేతయై దుష్క్రియోపేతుఁడౌచు

తే.గీ. సకలజగములనలయించు శక్తికలిగి
దానధర్మదయాశూన్యతనువహించి
తెంపులేకయ పాపమున్పెంపుఁజేయు
చుండె రావణుఁడని వినుచుంటిమికద! 613

తే.గీ. విశ్రవోమౌనియంతటి విమలమతికిఁ
దనయుఁడై పుట్టి దుష్టవర్తనము వలన
రాక్షసత్వము నొంది యా రావణుండు
ముజ్జగమ్ములకెంతయో ముప్పుఁదెచ్చె. 614

తే.గీ. అధికసత్వుఁడు యక్షనాథానుజన్ముఁ
డాదశాననుఁ డధికపాపాభిలాషి
లోకసంత్రాసకరుఁడు విలోలహృదయుఁ
డట్టి దుష్టాత్ములాతని యనుచరులును. 615

కం. తానెప్పుడు మఖవిఘ్నముఁ
బూనఁడు సేయంగభటులఁబుత్తెంచునొగిన్
వానికి లక్ష్యములేకయ
కానీ పాపమ్మటంచుఁగాదు నరేంద్రా! 616

వ. నా యజ్ఞ విఘ్నకారులు సుందోపసుందాత్మజులగు మారీచసుబాహులని నీకు మున్నయెఱింగించి యుంటిని గదా. మహోగ్రాకారులు, ఉద్యద్బలగర్వదర్పితులు, దుష్టాత్ములునగు వారారక్షః పతిపంపునం జేసి మదీయాశ్రమంబునకక్షీణబలపరాక్రమ సంపన్నులగు యోధాగ్రేసరులం గూడి క్రతువిఘ్నంబుఁ గావింప సారెసారెకు వచ్చుచుందురని పల్కిన. 617

కం. విని తెలతెలఁబోయిన యా
ననమునమితిమీరి భీతినాట్యంబాడన్
జనపతి దైన్యంబున నా
మునినాథునిమ్రోలనిట్లు మ్రొక్కుచుననియెన్. 618

వ. మహాత్మా! తామానతిచ్చినది క్రతువిఘ్నంబుఁగా వించుటకు మాటిమాటికి మారీచ సుబాహులరుదెంచుచుండుట మహాక్రూరాత్ముండగు రావణుపంపుననని గదా. 619

చ. మునివర! రావణుండనిన ముజ్జగముల్భయకంపితంబులౌ
ననియనుచుంటివీవిషయమంతయునేవినియుంటిఁబూర్వమే
యనిమొననింద్రముఖ్యసురలాతనచేఁ బరిభూతులై కదా
వనటఁ గృశించుచుంట పెరవారలమాటలు చెప్పనేటికిన్. 620

ఉ. అంతటివేల్పులే యతని యాహవమందటు భీతులైరి నే
నెంతటివాఁడనిప్పుడిదమిత్థమటంచునరాతిశౌర్యమా
వంతయుఁజర్చసేయక హృదంతరమందసురాధినాథుతో
నెంతయుఁ బోరొనర్తునని యెట్లువచింతును మౌనిసత్తమా! 621

కం. రావణు నని నెదిరించుట

నేవిధిశక్తికి మిగిలిన
భావముఁ బ్రకటింతు సుస్వభావులయెదుటన్. 622

కం. సుందోపసుందపుత్రుల
బ్రుందింపఁగజాలరెవరు మహితలమందున్
బృందారకులెవరైన
ద్గందుగ జంపంగలారొ కారోయెరుఁగన్. 623

## దశరథుఁడు విశ్వామిత్రునితో రాముని బంపజాలనని చెప్పుట

వ. మహాత్మా! తామనతిచ్చిన కార్యంబనేక శతసహస్రదేవాసుర సంగ్రామము లందారితేరి ప్రఖ్యాతిగొన్న ననుబోటిశూరాగ్రేసరునకుంగూడఁ దీర్పఁదగనిదైయుండె. నిట్టియెడ నకృతాస్త్రుండును, బాలుండునగు రామభద్రుండెత్తె రంగుననిర్వర్తింపం గలవాఁడు, సర్వజ్ఞుండవు, దైవస్వరూపివి, గురుండవునగు నీవు, మందభాగ్యుండనగు నాయందును, నారాముని యందును గరుణారసముం బ్రసరింపఁజేసి రక్షించుమని వెండియు నిట్లనియె. 624

ఉ. రామునిఁ బంపఁజాల మునిరాజ త్రిలోకభయంకరాశర
స్తోమముతోడఁ బోరుటకు సువ్రత నా పయినల్కనందకా
రాముని నన్నుఁగూడ ననురాగముతోఁ గనిపెట్టియుండుము
ద్దామతపోమహత్త్వమునఁ దాపసవర్య! జగద్ధితంబుగన్. 625

## విశ్వామిత్రుఁడు క్రోధపరవశుండై దశరథునితో మాటాడుట

వ.ఇట్లంజలియొగ్గి వినయముతో విన్నవించుచున్న దశరథుని పల్కులాకర్ణించి కౌశికుండత్యాగ్రహావిష్టహృదయుండై మఖహుతాగ్నియందాజ్యధారలుంచిన తెరంగున జాజ్వల్యమానమానసుండును, కోపారుణితేక్షణుండునునై యామహారాజుం గాంచి యిట్లనియె. 626

ఉ. కోరిన యర్థమిచ్చెదను గోరుమటంచునుబల్కి యిప్పుడీ
తీరున బొంకుచుంటివిది తీరని మచ్చగదా త్వదన్వయో
ద్ధారకులైన భూపతులతాల్మికి నే డెటులైన నీవు

తే.గీ. అంతగౌరవమింతయై యరిగెనెటకొ
యాగమాగదు, యేదెటులైనఁగాని
ఇంతియేచాలు మాకుఁ గొఱంతకలదె
పోయివచ్చెదనిఁకనేను భూతలేశ!

వ. అని పల్కుచున్న విశ్వామిత్రమహామునీంద్రుని నిరంకుశ క్రోధరసోద్దీపితంబులగు రూపలక్షణ సంభాషణంబులను మాటిమాటికిం బరికించుచు, సభాస్తారులు వెలవెల బోవుచుండి రా సమయంబున

కం. గిరగిరయని తిరిగెన్ ధర
సురనాధుండదరె మింటిచుక్కలురాలెన్
గిరులొరగె శరధులింకెన్
ధరణీశుఁడు భ్రాంతుఁడౌచు స్తబ్ధత నొందెన్. 630

**విశ్వామిత్రునితో శ్రీ రామభద్రునంపుమని వసిష్ఠుఁడు దశరథునకుపదేశించుట**

కం. ఈ విధముఁగని వసిష్ఠుఁడు
భూవరునకు నిట్టులనియె భువిలో సత్య
స్థావరమై వెలసెను మీ
పావనసూర్యాన్వయంబు పార్థివముఖ్యా! 631

కం. అడిగినయర్థంబిచ్చెద
నడుగుము నీ వనుచు నుడివి యడిగిన మీఁద
న్గడువడి నొడఁబడకుండుట
నడవడియా సూర్యవంశ నరపతికిలలో 632

తే.గీ. నిత్యసత్యవ్రతాచార నియతికలిగి
వసుధఁదనరెడు నిక్ష్వాకువంశమునకు
నల్పమేనియు దుర్యశంబంటనీక
పాలనము సేయుమదినీకుఁజాలమేలు. 633

వ. రాజేంద్రా! అనిన మాటందవ్వక కౌశికమహామునీంద్రునకకృతాస్త్రుండను సంశయంబుడిగి యజ్ఞరక్షణార్థమై రామభద్రు నొసంగుము. అతండ కృతాస్త్రుండైనను

గృతాస్త్రుండైనను, ఇమ్మహామునీంద్రుని తపశ్శక్తి గుప్తుండగుటంజేసి, కఠోరకాలానల పరివేష్టితంబగు సుధారసపూర్ణ కుంభంబునుంబోలె, రాత్రించరులెంతటి శూరాగ్రేసరులైనను, మనరామభద్రునిఁ దేఱి చూడంజాలరనుట నిక్కువంబు. మునీమహాత్ముండనన్యలభ్య మానాఖండ మహోగ్రనిష్ఠాగరిష్ఠుండై ఘోరతపంబొనర్చి తత్తపోబలంబున మహామహిమంబుల కాధారభూతుండని లోకత్రయంబు నందనవూన యుశంబుగడించియుండె. మఱియు నానావిధ దివ్యాస్త్ర ప్రయోగోపసంహార కుశలుండును, మధ్యందిన చండమార్తాండానల సంకాశుండునగు నీ గాధేయుండంబికారమణునుగ్రతపంబున మెప్పించి యమ్మహేశ్వరువలన ననేక శతశితాస్త్రశస్త్రపరంపరలం జేకొనియుండె. చతుర్దశభువనంబులందిమ్మహాభాగున కెనయగు వీరుండెవ్వఁడు గలండు, శక్రాధికపరాక్రముండును, పరమపావనుండును, నిరంతరతపఃపరాయణుండును, ధర్మస్వరూపుండును, నీతికోవిదుండునునగు నీసంయమీంద్రుండెరుంగరాని దివ్యాస్త్రంబులెందునుంగూడలేవు. సర్వాస్త్రశస్త్ర మహామహిమంబులంబరిపూర్ణముగా నెరింగినవాఁడీ కౌశికుండొక్కరుండు తప్ప, దేవదానవమహర్షి గంధర్వ యక్షకిన్నర మహోరగవీరులలోఁ గూడ నెవ్వరుం గానరారు, మరియు నింకొక విశేషంబుగలదు. సావధానుండవై యాకర్ణించుము. తొల్లి భృశాశ్వుండను ప్రజాపతి, జయ, సుప్రభ యను పవిత్రనామములు గల దక్షప్రజాపతి కన్యల నిర్వురం బరిణయంబై యుక్కాంతాలలామలయందుఁ గ్రమముగా ననమానాస్త్ర శస్త్రస్వరూపులును స్వేచ్ఛానురూపరూపధారణ సమర్థులును, మహాబలపరాక్రమ సంపన్నులునగు నూఱుమంది కుమారులంబడసి, దైత్య సంహారార్థమై, రహస్యంబుగానునిచె, నట్టి యస్త్రశస్త్రసముదాయ మీ కౌశికుండు రాజ్యంబు సేయుతఱిందపస్సంతుష్టుండైన శంకరుననుగ్రహంబునంబడసె, నింకన నన్యసాధ్యంబులగు ననేక నూతన శస్త్రాంబులను సృజించఁగల మహాశక్తి యిత్తపోధనునియందుఁ గలదు. ఇతఁడెఱుంగని యస్త్రంబు లెందునుం గూడ లేవు. ఇట్టి యస్త్రశస్త్రవిజ్ఞాన సంపన్నమూర్తి యగు విశ్వామిత్ర మునీంద్రుని మునీంద్ర మాత్రుండని తలంపకుము. రాక్షసమారణంబొనర్పందానుసంపూర్ణసామర్థ్యము కలవాఁడయ్యును, నీ ప్రియపుత్రుండైన శ్రీరామభద్రునకపరిమేయ శుభంబు లొనఁ గూర్పవలెననుతలంపుతో ననుకంపావిశేషంబున నీయొద్దకుఁ జనుదెంచి

యుండెంగావున సంశయింపక యిమ్మహామునీంద్రునకు మహానందకందళిత హృదయుండవై శ్రీ రామభద్రునొసంగు మని బోధించి వెండియునిట్లయె. 634

తే.గీ. రక్షణీయము క్రతువు సంరక్షకుండు
రామభద్రుఁడు నేను బ్రేరకుంఁడ నర్థి
కౌశికుఁడు నీవు దాతవీ కార్యమునకు
సంతసిల్లెదు వారలీ సకలమునులు. 635

**శ్రీరామలక్ష్మణులను విశ్వామిత్రునితో పంపుటకు నిర్ణయించుట.**

వ. అని పలుకుచున్న వసిష్ఠుని పలుకులకా పంక్తిరథుండానందపరవశస్వాంతుండై, విశ్వామిత్రమహామునీంద్రునకు రామునొసంగఁగలవాఁడనని నిశ్చయించి, లక్ష్మణ సహితంబుగా శ్రీరామభద్రుని సభాస్థానంబునకు రావించి, పుత్రప్రేమానువిద్ధుండై బిడ్డలచేఁ గుశికనందనుని పాదారవిందములకు శిరంబులు సోఁక దండ ప్రణామంబులా చరింపంజేసిన, వారల నమ్మహామునీంద్రుండు సంతోష పారవశ్యతనొంది లేవదీసి గాఢాలింగనమ్మొనర్చి పులకాంకిత శరీరుండును, ఆనందబాష్పాంతరితనేత్రుండును, గద్గదకంఠుండునునయి శుభాశీర్వాదంబు లొసంగి, దశరథుని మహాభాగ్యవత్వంబు ననేక విధంబుల మానసంబునంగొని యాడుచున్నంత నబ్బాలురకు వసిష్ఠ ప్రభృతి మహర్షి వర్యులు స్వస్త్యయనంబుల ననుగ్రహించిరి. పిమ్మట దశరథుండు కులకాంతలంగూడి రామలక్ష్మణుల కనేకమంగళాశాసనములొసంగి గాఢాలింగనపూర్వకంబుగా వేర్వేరమూర్ధాఘ్రాణంబు లొనర్చి హితవాక్యంబుల నుపదేశించి, కుశికనందనుని కరపల్లవమ్ముల కందించి ప్రణమిల్లి సప్రశ్రయంబుగా నిట్లనియె. 636

తే.గీ. అపరచతురాస్య! శ్రీరామునునుజసహితు
నిచ్చినాఁడను సవననిరీక్షకొరకు
ఏమిచేయఁగలారొ వీరిపుడు మీకు
నరసి శుశ్రూషబాలకులొటచేత.

వ. ఇట్లనుచున్న పంక్తిరథుంగాంచి మందహాసవదనారవిందుండై కౌశికుండిట్లనియె.

ఆ.వె. రాజర్షి! భయము నొందకు

ర్వ్యాజ మనోజ్ఞంబౌ యశ
మీజగములమూఁటియందు నెనకమెసంగన్. 638

వ. ఇట్లనురాగవశమానసుండై విశ్వామిత్రుండు పల్కిన యనంతరంబ. 639

ఉ. చల్లనిగాలివీచె సురసంచయమెల్లను మెల్లమెల్లఁగా
నుల్లమునందునంతసమునొందుచుఁ బువ్వులవానజల్లులన్
జల్లిరి పెల్లుగామొరసె శంఖనినాదములాకసంబునం
దల్లనసప్సరః ప్రమదలాడిరి కోర్కులుపల్లవిల్లఁగన్ 640

తే.గీ. అపుడు కౌశికమునిలేచి యా వశిష్ఠ
మౌనివల్లభునకు నన్య మౌనులకును
వసుమతీనాధునకుఁబోయివత్తుమనుచుఁ
గరుణతళుకొత్తఁబల్కి తాఁగదలసాగె.

## గాధేయుఁడు శ్రీరామలక్ష్మణులను వెంటనిడుకొని యరుగుట

చ. పరఁగి ధనుఃకృపాణశర పాణులు శౌర్యధురీణులా సహో
దరులగు రామలక్ష్మణులు తద్దయుఁ గౌతుకముప్పతిల్ల సు
స్థిరమతులౌచునేగిరి విశిష్టతపోమహిమానుషక్తుఁడై
వరలెడి గాధిసూతికిరువంకలఁగూడి సురల్నుతింపఁగన్. 642

తే.గీ. త్యక్తసంసారులకుఁ దపశ్శక్తివలన
వశ్యుఁడౌ రాముఁ డీమునీశ్వరునకిపుడు
తండ్రి యానతివశ్యుఁడై తరలె ననుచు
సురలు గుమిగూడి వినువీధిఁ జూచిరపుడు. 643

సీ. శరధనుస్తూణీరకరవాలములకాంతి
శత్రుసంహారలక్షణముఁదెల్ప
హద్దుమీఱినశోభనద్దుచు నఱిముఱిన్
ముద్దొల్కుఁజుల్పాలు మురువుఁజూప
దెసలనిండించి పెంపెసలారురతనాల
జిలిబిలినగలుసొంపొలయుచుండు
జిగిమించు పచ్చల సొగసుకల్కితురాయి
తళుకుతో వినువీధి నలికికులుక

తే.గీ. పౌరవనితలు మేడలపైన నుండి
యలరుచునుజల్లఁ బుష్పదూర్వాక్షతలను
రామలక్ష్మణులామునిరాజువెంటఁ
గదలి రాశీర్వచస్సు లాకసమునంట. 644

తే.గీ. సందడించుచుఁగిటికీల సందులందుఁ
దల్లులందఱుఁదమదృష్టిఁ దవులు కొల్పి
కనికనుమేరవఱకునా మునియధీను
లైన కొమరులఁగడమేడలందు నిల్చి 645

తే.గీ. విభుఁడు పరివారసహితుఁడై వెంటనంటి
గోపురద్వారముంజొచ్చి తాపసేంద్రు
పదసరోజములకు మ్రొక్కి పలికెనిట్లు
వినయమిగురొత్త బెగడొంది మనము నందు. 646

తే.గీ. తాపసోత్తమ త్వత్పునర్దర్శనంబు
సత్వరంబుననగుఁగాత సానుజుండు
నైన రాఘవుతోడ మాకనఁగ మౌని
యట్టెయని చూచి దశరథునాననమును. 647

కం. నీకొమరులకేలోపము
రాకయకాపాడఁగలను రాజేంద్రా నీ
వాకులతనొందకిఁక నిలు
ప్రాకటజయలక్ష్మితోడఁ బంపెదసుతులన్. 648

కం. అన విని యలరుచు జనపతి
తన సౌధంబునకుఁ జనియెఁ దగువారలతో
మునిపతియానతిఁగొని తత్
క్షణమాత్మజవిరహబాధసైఁపుచు నెడఁదన్. 649

వ. అనంతరమాకుశికాత్మజుండత్యంతానందకందళిత హృదయారవిందుండై రాకుమారులందోడ్కొని యయోధ్యాపురగోపురద్వారంబుఁగడచి స్వాశ్రమోన్ముఖుండైయనర్గళగమనంబున నరుగుచున్న నమయంబున. 650

ఆ.వె. ముందు మౌనివర్యుఁ డందాలగనియైన
రాఘవుండు వెనుక రహివహించి
రామువెన్నునంటి లక్ష్మణు డరుగఁగాఁ
దొడరిరరులు బెదరి పొడవడంగ. 651

ఆ.వె. మూఁపులందుఁ దూణములు శరచాపముల్
కరములందు మెఱయ నరిగిరపుడు
మూఁడుతలలుగల్గు కోడెత్రాఁచులనంగ
రాజసుతులు మౌనిరాజువెంట. 652

ఆ.వె. శివుని వెంటనరుగు శిఖివాహనవిశాఖు
లబ్జభవుని వెంట నాశ్వినేయు
లనఁగ మౌని వెంట మనుజేశ్వరకుమారు
లరిగిరలపుసొలపు నెఱుఁగకపుడు. 656

వ. ఇట్లమ్మౌనీంద్రుండు రామలక్ష్మణులతోడంగూడి సార్థయోజన పరిమితంబగు దూరంబరిగి సరయూనదీ దక్షిణతీరంబుననిల్చి నయనాభిరాముండగు రాముం గాంచి.654

కం. రామా! కళ్యాణగుణో
ద్దామా! రఘుకులలలామ! దైత్యవిరామా!
సామజవరపరిరక్షణ
కామా! యనిపిల్చికరుణకడలుకొనంగన్. 655

**కౌశికుండు శ్రీరామలక్ష్మణులకు బలాతిబల విద్యలనుపదేశించుట**

ఆ.వె. నన్ను గన్నతండ్రి నాయన్న శ్రీరామ!
ఇనకులాబ్ధిసోమ! యిపుడు నీవు
సానుజుండవగుచు సరయూ జలంబుచే
నాచమించి త్వరగనరుగుదెమ్ము. 656

ఉ. ఆకలి తృష్ణయున్ రుజయు నంగవిపాటన ముఖ్యపీడలన్
దాకఁగనీయకెప్పుడతిదార్ఢ్యముతో నెసలారు విద్యలన్

మీకొసగంగలాడ ననిమేషులకేనియు దుర్లభంబులో
శ్రీకర! తన్మనుద్వయముఁ జేకొనుమా ససహోదరుండవై. 657

చ. అని మునిపల్కనట్లెయని యా రఘురాముఁడు సానుజుండునై
చని సరయూనదీ మధురసప్రథితాంబువులన్స్పృశించి త
న్మునిపతి చెంతకేగ గని మోదముతోనతఁడాత్మలోననే
ననిమిష పూజనీయ! చరితార్థత నొందితినంచు మాటికిన్. 658

కం. శ్రీవసుధేశుకుమారుల
కా విశ్వామిత్రమౌని యలరుచునపుడే
దీవించి యొసఁగెఁ ద్రిభువన
పావనతమముల బలాతిబలమంత్రములన్. 659

వ. ఇట్లమ్మహామునీంద్రుడు శాస్త్రోక్త విధినవలంబించి క్రమముగా రామలక్ష్మణులకు బలాతిబలవిద్యలనుపదేశించి మందస్మితవదనారవిందుఁడై యుండెనంత. 660

కం. అరుదగు తేజముతో దిన
కరుఁడిరురూపులనుబేర్మిఁగైకొని ధరణిన్
బొరసెనన రాకుమారులు
మెఱసిరి తన్మంత్రకలితమేధారుచులన్. 661

ఆ.వె. ఇట్లు తేజరిల్లు నినకులోత్తములను
గాంచి సంతసించి గాధిసుతుఁడు
రామయనుచుఁ జేరి రాముని కల్యాణ
రామునిట్టులనియెఁ దమకమెనగ. 662

ఆ.వె. బాబు! యీ బలాతిబలలను విద్యలు
పద్మసూతి సుతలు పరమనిష్ఠ
జపముసేయువారి కపజయమేలోక
ములను గలుగనీకమెలగుచుండు. 663

సీ. ఆకలిదప్పుల జోకయేకనరాదు
జరయురుజాపీడ పొరయదెపుడు
ఘోరాహవములందుఁగోరి విజయలక్ష్మి
వరియించి తనకుఁదానరుగుదెంచు

నెంతదవ్వేగిన్వంతయావంతేని
  జనియింప నేరదీ జగతియందు
నాయురారోగ్యమ్ములభివృద్ధిఁగనఁగల్గు
  దుష్టరాక్షస బాధ తొలగిపోవు

తే.గీ. వేయు నేటికి రఘురామ! వివిధ గతులఁ
గన్నతల్లికి నెనయౌచుఁ గాచుచుండు
నీ మహామంత్రజపశక్తినేమనందు
నందు మిద్దానిచే యశంబవనియందు. 664

కం. అన విని సంతోషించుచు
ననుజునితోఁగూడి మౌని యడుగులకెఱగెన్
మునిపతి దీవనవిడుచున్
మనసారఁ గవుంగిలించె మహిపతిసుతులన్. 665

వ. తదనంతరం బాపావననదీపుణ్యోదకంబులచే సాయం సంధ్యాకృత్యంబులను నిర్వర్తించి రామలక్ష్మణులమ్మహామునీంద్రుని వలన సత్కథాశ్రవణంబుసేయుచు నత్తటినీతటప్రాంతమున మృదు తృణపల్లవాస్తరణంబులంబవ్వళించి సుఖనిద్రం జెందిరి.కౌశికుండరుణోదయకాలంబున నిద్రాసక్తుండైయున్న శ్రీరామభద్రునాననంబవలోకించి యిట్లనియె. 666

**విశ్వామిత్రుడు శ్రీరామునకు సుప్రభాతము చెప్పుట**

కం. శ్రీమత్కౌసల్యాత్మజ
రామా! ప్రాక్సంధ్య పొలిచె రహినాహ్నికమున్
ప్రేమించి తీర్పవలె లె
మ్మోమనుజలలామ రఘుకులోదధిసోమా! 667

వ. ఇట్లతిమృదుమధుర వాక్యంబులతో నమ్మునీంద్రుండు మేల్కొలువ రామలక్ష్మణులు దిగ్గనమేల్కాంచి తదనుయాయులై యా పుణ్యనదీజల సమీపమునకుంజొచ్చి.

ఆ.వె. స్నానమాచరించి సాంధ్యకృత్యముఁ దీర్చి
మంత్రజపమొనర్చి మౌనివరుని

తోడఁగూడియేగెఁ దొడితొడినడలతో
రాకుమారులపుడు రహిచెలంగ. 669

వ. ఇట్లరణ్యమార్గమునుం బట్టి యరుగుచు నొక్కెడ మహామహిమాన్వితంబగు సరయూనదీ సంగమంబునందిభువన పావనియైన గంగానదీ ప్రవాహంబునుం గని భక్తి బద్ధాంతరాత్ములై నమస్కరించిన యనంతరంబనతి దూరంబునంద గ్నితేజులగు తపోధనులచేఁ బరిపూర్ణంబై, యనుపమఫలవృక్షషండమండితంబై యున్న యొక్క పుణ్యాశ్రమమ్ముంబొడగాంచి, రామలక్ష్మణులతి వినయవినమ్రులై గాధేయునితో మెల్లన నిట్లనిరి. 670

కం. ఈపావనవనరాజం
బేపావనమూర్తియౌ మునీశ్వరునదియో
తాపసవర! వఱలుచునిం
దేపారవసించు వీరలెవ్వారనినన్. 671

కం. విని ముని చిఱునగవానన
మునఁబొడసూపంగ రాజపుత్రులఁగని నే
వినిచెదఁ దద్వృత్తాంతము
వినుఁడని యిటు చెప్పఁదొడఁగె విశ్వాసమునన్. 672

**విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకంగదేశవృత్తాంతము నెఱింగించుట**

సీ. మును నీరజాస్త్రుండుఁ మూర్తిమంతుండౌచు
నంచితంబుగ సంచరించువేళ
గిరిరాజకన్యకా పరిచర్యలందుచు
శివుడు ఘోరతపంబుఁజేసెనిందు
నత్తఱిఁ గందర్పుఁడతిగర్వితుండౌచు
భవుని భవ్యతపంబు భంగపఱచె
నంత నప్పరమేశుఁడెంతయుఁగిన్కచే
మూఁడవకనువిప్పిమొనసిచూడ.

తే.గీ. బూదియైకూలె శంబరభేది యపుడు
నాటనుండి యనంగాఖ్య నధిగమించె

మదనుఁడిచ్చోటనంగమున్వదలెఁగాన
నంగదేశమ్మటంచిద్ధి యవనిఁబరగె. 673

వ. మఱియు నియ్యాశ్రమంబు పూర్వకాలంబునందపోనిష్ఠుండైయున్న శంకరున కావాసంబగుటవలన శంకరస్థానంబనియు నిందు మహర్షులు తపస్సిద్ధి నొంది సర్వకామంబులనధిగమించుచుండుటవలనం గామాశ్రమంబనియును బ్రసిద్ధి వహించుచుండెననిచెప్పి వెండియునిట్లనియె. 674

ఆ.వె. ఆ మహానుభావుఁడగు నుమాపతి శిష్యు
లిందుఁదపమొనర్చుచుందురెలమి
తరతరాలనుండి ధర్మతత్పరులౌచుఁ
గలుషజాలమెల్లఁ గడగఁద్రోసి. 675

ఆ.వె. నదులరెంటినందు నవనవోన్మేషంబుఁ
బొరయుచున్న యీ తపోవనంబు
పతితపావనంబు పరమార్థవిజ్ఞాన
దాయకంబు జయసహాయకంబు. 676

ఉ. ఏగుదమయ్య రామ! మన మీసరయూతటినీజలంబులన్
దోఁగితదాశ్రమస్థలికిఁ దోయజమిత్రుఁడు పశ్చిమాచలం
బేగకమున్నయంచు వచియించుచునుండఁ దదాశ్రమస్థుల
భ్యాగతులైన వీరిని నయంబునఁగాంచిరి వచ్చిచెచ్చెరన్. 677

తే.గీ. కాంచి భక్తివినయకౌతుకంబులు పెనఁ
గొనినమానసముల మునివరేణ్యుఁ
డైన గాధిసుతుని యంఘ్రులపై వ్రాలి
ప్రస్తుతించిరపుడు బహువిధముల. 678

వ. అనంతరం బామహర్షివర్యులు విశ్వామిత్రమహామునీంద్రున కాసనపాద్యార్ఘ్యాచమనీయాది బహువిధసత్కారంబులనొనర్చి, వన్యఫలంబులర్పించి, రాకుమారులకు యథోచితాతిథేయ పరంపరలం గూర్చి సంతుష్టాంతరంగులంగావించిన యనంతరం బాముువ్వురును బుణ్యకథలచేఁ గాలక్షేపంబొనర్చి, సాయం సంధ్యావందన జపహోమాది క్రియాకలాపమును యథావిధిగ నిర్వర్తించి, స్వాగమనాభిహర్షులగు

నా మహర్షివర్యుల ప్రార్థనమంగీకరించి, కామాశ్రమంబున కుంజని, తన్మహామహిమాతిరేకంబును మాటిమాటికిందలంచుచుం దదాశ్రమవాసులతోఁ గొంత తడవిష్టాగోష్ఠిసల్పిన యనంతరంబభిరామంబులగు దివ్యకథాకథనములచే మునిజనవల్లభుండగు గాధేయుండతిరమణీయ గుణాభిరాములగు శ్రీరామలక్ష్మణులను నిద్దురపుచ్చి, తదంతికంబునం గుశాస్తరణంబుపైఁ దానుంగూడఁ బవ్వళించి, క్షణకణంబునకు వారింగాంచుచుఁ దన చారితార్థ్యమును మనంబునం గొనియాడుచున్నంత. 679

కం. అరుణోదయమయ్యెను భూ
వరతనయులు లేచి మౌని వల్లభుతోడన్
సరయూనది చెంతకుఁ దా
మరుదారఁగనేగి సల్పిరాహ్నికవిధులన్. 680

కం. తదుపరి విశ్వామిత్రుని
పదకమలంబులకునెఱఁగి పార్థివతనయుల్
ముదమారఁగఁ బయనించిరి
సదయాంతఃకరణుఁడైన సంయమిపతితో. 681

వ. అచ్చటి మునిముఖ్యులను వీడ్కొని యమందగమనంబులచే గంగాకూలంబుఁ జేరవచ్చునంతలోఁదత్తటినీతటవనాంతరసంస్థితులగు మహర్షులు యోగదృష్టితో నీముువ్వుర రాకనుముందుగనెరింగినవారై, గంగానది యందు నావనాయత్తపఱచి యెదురరిగి స్వోచిత సత్కారపూర్వకంబుగా, విశ్వామిత్రరామలక్ష్మణులం దోడ్కొనిచని, తటావరుద్ధమహాప్రవాహప్లావితంబగు నావనధిష్ఠింపవేఁడిన వారట్లకావించుచు. 682

కం. సుత్రామాణమ్మునియెడి
శ్రోత్రప్రియమనుపునపుడు శుభమంగళ స
త్పాత్రములగుటకు మువ్వురు
నాత్రముతోడన్సరించిరభినవరుచులన్. 683

వ. అనంతరమాగాధేయునిచే స్వోటజంబులకేగననుజ్ఞాతులైన మహర్షిశ్రేష్ఠులు రామలక్ష్మణులపై మంత్రపూతంబులగు పుష్పాక్షతలంజల్లుచునైకకంఠ్యముగా నిట్లనిరి. 684

కం. విజయీభవ! రఘురామా!
సుజనావనదక్షనిరత సూనృతదీక్షా!
నిజసోదరసహితుఁడవై
త్రిజగంబులఁ జిరయశోభిదీప్తుఁడవగుమా. 685

వ. అని తద్వననివాసులగు మహర్షివర్యులనుజ్ఞంగొని నిల్చినయనంతరం బామహాప్లవంబు కదలి, చోదకచాకచక్యంబుచే, గంగాతరంగిణీ తరంగ సంఘట్టన దోధూయమానంబగుచు నతితరజవంబుతోఁ దన్మహానదీమధ్యంబున నరుగుచున్న సమయంబునఁ బ్రావృడ్ధారాధర గర్జనోజ్జృంభితంబగు నొక్క మహాధ్వానంబు వినవచ్చుచున్నాలకించి, రాఘవుండాగాధేయునవలోకించి, మహాత్మా! ఈ గంభీరనిర్ఘోషం బెక్కడిది, ఏమి హేతువుచే సముద్భవంబయ్యె, సవిస్తరంబుగా నెఱింగింపుమని వేఁడిన, సకల సద్గుణ గరిష్ఠుండగు శ్రీరామభద్రున క మ్మౌని వరిష్ఠుండగు గాధేయుండిట్లనియె.

మ. ఇనవంశాబుధి సోమ రామ! విను తద్వృత్తాంతమున్ దెల్పెదన్
ఘనుఁడౌ పద్మభవుండు మానసముచేఁ గైలాసశైలంబు నం
దనువొప్పన్సృజియించె మున్నొకసరంబద్దానిగీర్వాణులొ
య్యనబేర్వెట్టిరి చూచి మానససరస్సంచున్ప్రమోదాత్ములై. 687

ఆ.వె. ఆ సరోవరమ్మునందుద్భవంబయి
సరయు వనుస్రవంతి సర్వలోక
వంద్యమౌచుఁ బరఁగి వసుధ నయోధ్యాపు
రమ్ముఁ జుట్టివచ్చి రహిచెలంగ. 688

వ. ఇచ్చటి కనతిదూరంబునందీజాహ్నవీనదింగలసె, తత్సంగమ సముద్భూతోత్తుంగ తరంగ సంఘట్టన నినాదం బిట్లు వినవచ్చుచున్నయది. సప్రశ్రయంబుగా మీరాదిశకుం బ్రణమిల్లుండని పల్కిన, రామలక్ష్మణులట్లు కృతప్రణాములై యమ్మహానదీమాహాత్మ్యముం గొనియాడుచుండె నంత నమ్మహోడుపంబు దక్షిణతీరంబుఁ జేరిన నందవతరించి లఘువిక్రమమంబులచే నిర్జనారణ్య మార్గముంబట్టి యరుగుచుండునవసరంబున. 689

తే.గీ. తరణి కిరణాలకేనియుఁ జొరవనీక
ఘోరతరశాఖిశాఖావి సారసాంద్ర

పర్ణపటలావృతంబౌచుఁ బరఁగుచున్న
కాననము రాఘవుఁడు కూర్మిఁగలయఁజాచి. 690

వ. విశ్వామిత్రునవలోకించి యిట్లనియె 691

సీ. ఖదిర బిల్వమధూక కకుభ నింబ కదంబ
వటజటీముఖవృక్షవల్లభంబు
కాకఘూకక్రౌంచ కారండవబకాది
సకలపక్షినినాదసంకులంబు
శరభ శార్దూల సూకర సింహ భల్లూక
బహువిధ సంచారభైరవంబు
అంతరాళ తమిస్ర సంతతినిర్జిత
చండభాను ప్రభామండలంబు.

తే.గీ. దుర్నిరీక్ష్యంబు మానవ దుర్గమంబు
భూతభేతాళడాకినీ భోగదంబు
నైన యీ ఘోరవనమేరి దనఘచరిత!
యనిన రఘుపతికిట్లనె మునివరుండు. 692

**విశ్వామిత్రుఁడు మలదకరూశదేశవృత్తాంతమును రామలక్ష్మణుల కెఱింగించుట**

సీ. సుత్రాముఁడానాఁడు వృత్రాసురుని జంపఁ
బ్రాప్తించెఁ దోదన బ్రహ్మహత్య
తద్దోషమునఁ బురందరునకుమలకరూ
శములుద్భవములయ్యె సరభసముగ
నదిచూచితాపసులనిమిషులన్గాడి
వగచి యాలోచించి తగిన రీతి
నిటకుఁ దోడ్కొనివచ్చి యింద్రునిఁ గలశోద
కములఁబ్రోక్షింపఁ దత్సమయమందు.

తే.గీ. మలినకారూశములు రెండుఁ దొలగిపోయె
దేవనాధుని వీడి యీ దేశమందు

హిమము విరియఁగ భాసిల్లు కమలమిత్రు
పోల్కినతఁడొప్పెనప్పుడో భూపతనయ! 693

వ. ఇట్లు మహేంద్రుండు చరితార్థుండై, మచ్ఛరీరజదోషంబులగు మలకరూశంబులను భరించినచోటవే నీ జనపదంబులు, మలదకరూశాభిధానంబులం బ్రసిద్ధిఁ గాంచుంగాతయని యిమ్మహా విశాల దేశమునకు వరంబనుగ్రహించిన పాకశాసనుని, సకల మహర్షి సమేతులగు నిర్జరులనేకవిధంబులంగొనియాడి సంతసించుచు, సురనాయకా, నీవనినట్లు, త్వచ్ఛరీరజమలకలితమగుదేశము మలదంబనియుఁ గరూశయుక్తమగు దేశము కరూశంబనియునిమ్మహీమండలమండనాయమానంబులై, సర్వసంవద్వ్యూహంబుల కాలవాలమ్ములై యెసలారుచుండంగలవని యాశీర్వదించిరి. అది మొదలీ మలదకరూశదేశములు రెండును ధనధాన్యసమృద్ధంబులు సనుపమాన శోభాస్పదంబులనై ప్రకాశించుచుండె నంతఁ గొంతకాలంబునకు. 694

**విశ్వామిత్రుఁడు శ్రీరామునకుఁదాటకా వృత్తాంతముందెల్పుట**

ఆ.వె. గజసహస్రబలముకలిగి తాటకయను
పేరఁ బరఁగు యక్షనారియొకతె
శాపదగ్ధయై నిశాటిగామాఱి యీ
జనపదమ్ములందు నునికిఁజేసి. 695

కం. తన కొమరుఁడు మారీచుం
డను బాహుబలాఢ్యుతోడ ననుదినమందున్
జనులన్ మునులన్ మ్రింగుచు
ననివారిత దౌష్ట్యవృత్తి నవలంబించెన్. 696

తే.గీ. దాని దౌష్ట్యముచేత నీజానపదము
లటు శ్మశానమ్ములైపోయెనంత మీఁదఁ
గాలగతిఁ గత్తియుంగూడఁగదలరాని
దుర్గమారణ్యమై యిట్లుతోఁచుచుండె. 697

వ. ఇచ్చటికి సార్ధయోజన పరిమితంబగు దూరంబునందాదుష్టచారిణి యగు తాటకనివసించి పథికులను నిరోధించి హింసించుచుండెంగావున. 698

## విశ్వామిత్రుఁడు తాటకాసంహారమునకు శ్రీరామునిఁ బ్రోత్సహించుట

తే.గీ. నా నియోగంబుచే రామఁ దానిఁ గూల్చి
నేఁడె యీ దేశమునకెల్ల నిర్భయంబుఁ
గూర్పు మీకార్యమొనరింపఁ గువలయమున
నెందుఁగనరాడు నీకంటె నితరుఁడెవఁడు. 699

కం. అని కౌశికముని పల్కిన
విని రాఘవుఁడిట్టులనియె విస్మయయుతుఁడై
యనఘాత్ముఁడౌ మునీశ్వరుఁ
గనుఁగొని చిత్తమున భక్తికడలుకొనంగన్. 700

తే.గీ. అల్పసత్త్వులు యక్షులంచనుచునుందు
రందునుంగూడ నబలకు నెందువలనఁ
గలిగె నానతినీయము గజసహస్ర
బలమటంచని శ్రీరామభద్రుఁడనిన. 701

వ. నంతుష్టమాననుండై విశ్వామిత్రుండు శ్రీరామభద్రునికిట్లనియెం, మున్నునుకేతుండను యక్షవరుండప్రమేయ బలసంతానార్థియై సాంద్రదుర్గ విపినాంతరములందతి ఘోరనిష్ఠంబూని యనేకవర్షంబులు జలజాననుంగూర్చి తపంబాచరింప నత్తపోనిష్ఠకు మెచ్చి సాక్షాత్కరించిపయోజసంభవుండానుకేతునకు నహస్రమదావళసత్త్వయుగు పుత్రికననుగ్రహించి, అయ్యది తాటకాఖ్యచే భూతలంబునందలరారుఁ గాతయని పల్కి తిరోధానుండయ్యె, నంతం గొంతకాలంబున కుద్భవించి దినదినప్రవర్ధమానరూపలావణ్య యౌవన విద్యావిలాసవతియై పొల్చుచున్న తాటకను సుకేతుండీక్షించి ఝర్ఝునికుమారుండగు నుందునకిచ్చి వివాహంబొనర్ప నతండాయంగనయందు మారీచుండను మహాబలపరాక్రమశాలియగు నొక్కకుమారుంబడసి మరణించిన యనంతరం బాతాటక, పుత్రుండగు మారీచునితో గూడి యరణ్యంబులసంచరించుచు నొక్కెడన గస్త్యమునీంద్రుంగాంచి, స్వభర్తృమారణ హేతుభూతుండను క్రోధముతో నమ్మహా మునీంద్రుని వధించుటకై కొడుకుం బ్రోత్సహించిపంప నతండు గర్జించుచు నగస్త్యునిపైఁ గవిసిన నమ్మహాత్ముండలిగి, కనులెఱ్ఱఁ జేసి, ఓరి, నీవు

దయాధర్మశూన్యుండవై రాక్షసుండవుం గమ్మని మారీచుందిట్టి, దుర్నిరీక్ష్యంబగు తేజంబుచేఁ దాటకం గాంచి 702

ఉ. ఓసి! సహస్రవారణమదోత్కటగర్వముచేత నాపయిం
జేసితి వింతదౌష్ట్యము నిసీ! నిను భస్మముసేయఁబూనుచో
వాసవుఁడైననడ్డుపడవచ్చునె యేమని యెంచితోమదిన్
భూసురవంశజుండనని భ్రూయుగమ్మున్గదియించి చూచుచున్. 703

ఉ. చక్కఁదనమ్ముతోడ సహజమ్మగు రూపమువోయి ఘోరమౌ
రక్కసివై యథేచ్ఛగ నరణ్యములన్ దిరుగాడి నిత్యము
న్మక్కువమీఱఁ బాపములొనర్చుచు మానుషమాంసమజ్జల
న్మెక్కుచు దీర్ఘకాలమిలమీఁదవసించి గతించుదుర్మతీ! 704

కం. అని మునిశాపంబిడఁద
తక్షణమునఁ దాటక మహోగ్రదానవియై పెం
పెనయుచు బలగర్వములం
దననందనుతోడఁగూడి దర్పంబొలయన్. 705

ఆ.వె. అచటు వాసియేగి యాయాయరణ్యంబు
లందుఁ దిరిగి తిరిగి క్రిందు మీఁదుఁ
గనక చంపి చంపి తిని తినిమౌనులం
జేరె నిటకుఁ దన కుమారుతోడ. 706

కం. ఆ తల్లికొడుకులిరువురు
నీతియు నియమమ్ములేక నిరతము చేతః
ప్రీతిగ నీ జనపదయుగ
మీ తీరుననడవిఁజేసిరిద్ధచరిత్రా. 707

## తాటకవధలో ధర్మమీమాంస

శా. ఎన్నోజన్మములెత్తుభారమయిపోయెన్ దాని దౌష్ట్యంబుచే
మున్నెన్నండునుజూడనట్టివిలయమ్ముల్పుట్టెఁగోటానకో
ట్లన్నా రాఘవ! కారణంబదియ నీవద్దానిఖండింపఁగా
నన్నాహమ్మొనరించు వైళమ మనస్సందేహమున్వీడుచున్. 708

ఆ.వె. కాంత యనుచు మదిని సుంతయేని విచార
మొందకిపుడు దాని ద్రుంచఁ జేయు
జనవినాశమునకు ఘనహేతువైనచో
వనితనైనఁ జంపవచ్చురామ! 709

ఆ.వె. రాజధర్మమెఱిఁగి రాజ్యమేలితినయ్య
కొన్నినాళ్లు నేను గొదవలేక
నిన్న ధర్మమందు నెలకొల్పుచున్నాఁడ
ననుచుఁ దలచబోకు మనమునందు! 710

ఆ.వె. నాల్గు వర్ణములను నాలుగాశ్రమములన్
రక్షసేయవలయు రాజసుతులు
కాన ధర్మహానికలిగించుస్త్రీనైన
హతమొనర్పవచ్చు నఘము లేదు. 711

తే.గీ. ధరణిపతులకు నిది మహాధర్మమనుచు
నెఱుఁగు మింకను సంశయమ్మొరయుచున్న
వినుము దెల్పెద బహుపురావృత్తములను
రామ! భాస్కరవంశవారాశిసోమ! 712

ఉ. భూతలముగ్రసించుటకుఁబూనిన దుష్టనిశాటిమంథరన్
భీతిఁదొలంగి లోకములు ప్రీతివహింపఁగనేచి యాబలా
రాతి సమస్తదేవమునిరాజిసెబాననవజ్రధారలన్
ఘాతమొనర్పఁడే సదుపకారపరాయణుఁడై రఘూత్తమా! 713

ఉ. శక్రుని జంపి దైత్యులకు శాంతినొనర్చుదునంచుఁబల్కి ని
ర్వక్రపరాక్రమంబున నపారభయంకరమూర్తిఁగొన్న యా
శుక్రుని మాతనుంగని యశోధనుఁడౌ మధుసూదనుండు స
ద్విక్రమమేర్పడన్ దునిమివేయఁడె విశ్వహితంబుఁగోరుచున్. 714

ఉ. ఇంత ననేకభూమిపతులింతులమున్దునుమాడిరిట్టులే
జంకక ధర్మముల్ చెఱుపసాగినవారిని బట్టువట్టి నీ
శంకనువీడి చంపుము నిశాటిని దాటకనుగ్రరూపినో
పంకజబాంధవాన్వయ వివర్ధన! వేగమె సానుజుండవై. 715

చ. అన విని శంకఁబోనడఁచి యారఘునాయకుఁడార్తితోడ నో
మునికులనాథ! నీపనుపు మూఁడుజగంబులకాత్మరక్షయౌ
నను విషయమ్ములోకములనందఱెఱింగినదౌటచేత నా
మనమున నింకనెద్దియనుమానములేదనిపల్కినమ్రుఁడై. 716

వ. మహాత్మా! మనమయోధ్యాపురమునుండి వెడలి వచ్చునప్పుడు మాతండ్రి నన్నుంగాంచి, రామా! భాషాపతితుల్యుండగు నిమ్మహామునీంద్రుని యాజ్ఞను జవదాఁటక నిర్వర్తించుచుండుమని యాజ్ఞాపించెం గావునఁ దదాజ్ఞ నెన్నఁటికిని మీఱువాఁడనుగాను. మా తండ్రియాజ్ఞవలె మీ యాజ్ఞయును సర్వథా శిరోధార్యమై యున్న యదియని మఱియునిట్లనియె. 717

**తాటకవధకు శ్రీరాముని నిశ్చయము**

తే.గీ. లోకవిద్రోహకర్మవిలోలయౌచు
నటనమాడెడు తాటకం జిటికలోనఁ
గూల్చి భువనమ్ములకు శాంతిఁ గూర్చువాఁడ
మౌనిసత్తమ! తమ యాజ్ఞమౌళిఁదాల్చి. 718

కం. అన విని సంతోషించితి
మనుజేశకుమార! యనుచు మౌనీంద్రుండా
వినయైకధనుని రాముని
గని మఱియిట్లనియెఁబ్రేమకడలుకొనంగన్. 719

కం. నన్నద్దులౌచురండిఁక
నన్నా!యీవనములోన ననుజుఁడునీవున్
విన్నారు గాదె తాటక
కున్నబలంబున్ జలంబు నుద్భటవృత్తిన్. 720

కం. అని విశ్వామిత్రుండన
ననుటయె తడవుగ నదీశునాత్మజులాకొపె
ట్టున మ్రోయించిరి జ్యాలత
లను బగులఁగ నాకసంబు రక్కసులదరన్. 721

వ. అంత సంతోషతరంగి స్వాంతుండై గాధేయుండు శ్రీరామభద్రుంగాంచి యిట్లనియె. 722

తే.గీ. నిఖిలరాక్షససంహార నిష్ఠఁబూని
రామ! నీ కేలమెఱయు శరవరమునకుఁ
జేయుఁ దాటక తనప్రాణవాయువులను
వీరపాణంబుఁగాఁ గొన్ని విఘటికలకు. 723

వ. అనియధాప్రకారంబుగా దుర్గమారణ్యమార్గమునంజనుచుండునంతలో. 724

**శ్రీరాముని ధనుష్టంకారమునకు తాటక తత్తరపాటు**

కం. జననాధసుతులమౌర్వీ
నినదము కర్ణములసోఁకఁ నిర్ఘాతంబై
మనమునఁ దత్తఱపాటుం
గని దాటక లేచి యార్చి కాననమదరన్. 725

తే.గీ. ఇట్టి మౌర్వీనినాదంబు నెపుడు వినఁగ
లేదు మత్కాననంబునం దీదినంబు
దైవవశమున నెవ్వఁడో దారితప్పి
వచ్చె రోజులు చాలకీవనికి ననుచు. 726

సీ. గర్జితంబష్టదిగ్గజముల భయపెట్టి
గగనకర్పరమందుగంట్లుసేయ
ప్రళయకాలమహాబ్ధిభంగనిర్ఘోషంబుఁ
దలఁకించు నిట్టూర్పులువియుచుండ
ధారుణీతలముత్పాదయుగ్మాహతిన్
గ్రుంగుచు నఱ్ఱాడుభంగితోఁచ
మదవిఘూర్ణితఘోరవదనద్యుతుల్భృత్యు
బలసాహసంబులన్పరిభవింప

తే.గీ. నగ్నికీలలనుమియుచు నంతరిక్ష
చారులకు భీతిఁగూర్చుచు సత్వరముగఁ

గదిలిచ్చెను గౌశిక దాశరథుల
మార్గమున కడ్డుతగుల నమ్మానవాశి. 727

సీ. పెంజీకటులఁగూర్చు జుంజురుతలకట్టు
మిత్తికత్తులఁబోలిమెఱయుదంష్ట్ర
లుచ్చావచంబులై యుదరపీఠమునందుఁ
బొంగలించుచునున్న పున్కసరులు
నిండు నెత్తురుడాలు నిరసించుమిడిగ్రుడ్లు
బారైన నాల్కయు జాఱుపెదవి
హ్రస్వనాసిక కంఠ మందాంత్రవలయమ్ము
లవనీధ్రమునకుద్ది యైనమేనుఁ

తే.గీ. గలిగి భీషణభాషణోజ్జ్వలితయగుచుఁ
బరుగు పరుగున నెదురుగా నరుగుదెంచు
తాటకంగాంచి రాఘవుండోటవడక
యనుఁగుఁదమ్ముని తోడఁదా ననియెనిట్లు. 728

కం. ఈ రక్కసి బహుఘోరా
కారము నేయలఁతివాఁడుకని ప్రాణములన్
ధారణసేయఁగ నేర్చును
ధారుణి నటు చూడు దాని దర్పాకృతులన్. 729

తే.గీ. మనల హింసింపవచ్చినన్మగువగానఁ
జంపనొప్పదుమనసీనిశాటినిపుడు
ముక్కుచెవులొక్కశరముచేఁజెక్కివైచి
గర్వమెడలించి తఱుముదీ గడియలోన. 730

**శ్రీరామభద్రుఁడు తాటకను సంహరించుట**

చ. అని యనునంతలో నది రయంబుననార్చి భుజాబలంబుచే
ఘన తరువొక్కటింబెఱికి కైఁ గొని త్రిప్పి గిరాటువేయ నా
యినకులనాథుఁడొక్కనిశితేషువునందెగఁగొట్టె నప్పుడా
దనుజ యుగాంతమృత్యువనదర్పముతోఁ జెలరేఁగి చెచ్చెరన్. 731

కం. చేతులు సాఁచుచు వచ్చెన్
భూతలపతిసుతులకడకు భువనములెల్లన్
భీతిల గర్జించుచు నా
పాతకిమునితర్జనముల భయపడకమదిన్. 732

వ. అంత నమ్మహామునీంద్రుఁడు శ్రీరామలక్ష్మణులకు సేమము జయమునుం గలుగుఁగాత యని మానసంబునందాశీర్వదించుచుండు నంతలో 733

ఆ.వె. దనుజమాయఁబన్ని తాటక వారిని
ధూళివృష్టిలోన నోలలార్చె
రాముఁడాక్షణంబ రక్కసి మాయలన్
మాయఁజేసె నొక్క మార్గణమున. 734

కం. అంతట నా తాటక బ
ల్వింతగు పాషాణవృష్టి వెలివిరియించెన్
స్వాంతమ్మునఁ గనలుచు భూ
కాంతుని తనయులకుఁ గీడు కడలుకొనంగన్. 735

వ. తదనంతరంబ 736

ఉ. తామసమూనిరాఘవుఁడు తద్దయుఘోరతరాస్త్రవృష్టిచే
ధీమహిమంబువెల్వడఁ దదీయమహోపలవృష్టిమాన్చి యు
ద్దామశరంబులన్ దునిమె దాని భుజంబులు రెండుఁ గూడ స
ర్వామరకోటిసంతసిల నా కుశికాత్మజుఁడాత్మ మెచ్చఁగన్. 737

కం. కరముల తెగిపడ రక్కసి
పరువిడుచును వచ్చి రామభద్రుని యెదురన్
గెరలుచు బీరములాడుచు
నిరసించెను వివిధగతుల నిర్ఘోషమునన్. 738

కం. ఆ దానవి పల్కులువిన
రాదని సౌమిత్రి ఖడ్గ రాజముచేతన్
ఛేదించె ముక్కుచెవుల
న్మోదిల్లఁగ మౌనివల్లభుఁడు చిత్తమునన్. 739

తే.గీ. అంత నయ్యక్షి కనలి స్వస్వాంతమందు
గగనతలమునకెగసి యా గడియలోన
కామరూపమ్ములను దాల్చి కానరాక
కటికచీకటిసృజియించి క్రౌర్యమూని. 740

కం. జలదమువలెఁ దిరుగాడుచుఁ
బలురకముల రాలవానఁ బరఁగించుచు నా
కులపఱచెను నృపసూనుల
నిలనిండరజోవ్రజంబు నెగఁజిమ్ముచొగిన్. 741

వ. ఇట్లు నిరంకుశ వీరవిహారంబుసల్పుచు గగనపథంబునం గానరాక గర్జిల్లుచున్న యాదుష్టపలాశినన్వేషించుచు రామభద్రుండు. 743

తే.గీ. అట్టహాసముసేయుచు నాకసమున
మాటిమాటికి గర్జించి మసలుచున్న
తాటకను గూల్పకింక నుదారభావ
మున మెలంగుట దగదని మనములోన. 744

**తాటకవధకై రాముని తొందరపెట్టుట**

తే.గీ. తలఁచె బిమ్మట గాధేయుఁడలఘుతర మ
హాశ్మవృష్టినిపీడితులైన రామ
లక్ష్మణుల సౌకుమార్యవిలక్షణులను
గాంచి వ్యథనొంది యిటులనెగారవమున. 745

చ. ఇనకులనాథ యెంతతడవిట్లుకృపాకరమూర్తివౌచు దీ
నిని బరిమార్పకుండుదువు నీరజబాంధవుఁడస్తమింప నీ
కనిమొనసాధ్యయౌనె యిది యాశరకోటికి రాత్రి వేళలన్
ఘనతరసత్త్వతేజములు గల్గునటంచని నీవెఱుంగవో. 746

ఆ.వె. ఏగఁ జూచుచుండె నినుఁడస్తగిరిపైకి
రాఁగఁ జూచుచుండె రజని యిపుడు
రజని రాకమున్న రాత్రించరినిగూల్చి
హితముఁ గూర్చు లోకతతికి రామ! 747

కం. త్వరపడు త్వరపడు రామా!
కరుణారసమొలుకఁజూచుకాలంబిది కా
దరయఁగసంధించుము శర
వరమును గోదండమందు వసుధాధిపతీ! 748

వ. ఇట్లు తాటకాసురసంహారమునకై మిక్కిలి త్వరపెట్టుచున్న విశ్వామిత్ర మహామునీంద్రుం గాంచి, ముకుళితకరకమలుండై శ్రీరామభద్రుండిట్లనియె.749

కం. గురువర్య! యుష్మదాజ్ఞయె
పరమప్రామాణ్యమగుచు భాసిలుగాతన్
నిరసించి యవనిఁగూల్చెదఁ
బరువడిఁదాటకను గనుము బ్రహ్మణ్యనిధీ! 750

కం. అని యని తమ్ముఁడు తానున్
ఘనతరచాపములు నిమిరికైఁగొని మనుజా
శనులకు నసువులు చెదరఁగఁ
బనిగొని టంకృతులొనర్చి భయదద్యుతులై. 751

ఆ.వె. శబ్దవేధులైన శరములఁబరఁగించి
రాలవాననపుడు లీలతోడ
సమయఁజేసి దానిసమయోచితమ్ములౌ
మాయలన్నిబట్టి మంటఁగల్పి. 752

**శ్రీరాముడు తాటకను వధించుట**

కం. అట్టిటుకదలుటకైన
న్గట్టడి రక్కసికి వీలు కలుగక కనలన్
దట్టంబగు శరవర్షముఁ
బుట్టించిరి క్షణములోన భూపతితనయుల్. 753

వ. అంతనానిశాచరి కొంతతడవునకెట్టో తనమాయాబలంబుచే దత్కఠోర శరధారాసంపాతమునుండి, తెప్పరిల్లి, వజ్రివజ్రాహతంబైన కులపర్వతంబు కరణిం దూలుచు, విశ్వామిత్ర రామలక్ష్మణులను బట్టి మ్రింగఁదలంచినదియై.

కం. పదికోట్ల పిడుగులొకటే
యదనునఁబడినట్లు దుమికి యవనీతలమం
దెదురుగఁ బరుగిడి వచ్చుచు
వదరుటఁ గని రాఘవుండు వైరోద్ధతుఁడై. 755

ఆ.వె. అతి నిశాతశరము నరివోసిగొబ్బునఁ
బెరయవచ్చు దాని పెన్నురమ్ము
నందునాటె యక్షి యాయమ్ముతాఁకున
కోర్వలేక పడియె నుర్విపైన. 756

తే.గీ. అట్లు శేషాహిమూర్ధమ్ములదరి చెదర
ధరణిపైఁబడి రోఁజుచుఁ దత్క్షణంబ
చచ్చెఁ దాటక లోకముల్సంతసిల్లె
నిట్టి యద్భుతకృత్యమీక్షించి యపుడు. 757

వ. పిమ్మట శ్రీరామలక్ష్మణులు గాధేయునిపదకమలంబులకు శిరములు సోఁక దండప్రణామంబులాచరించిన, నమ్మహామునీంద్రుడతితరానందకందళిత హృదయుడై శుభమంగళాశీర్వాదంబులొసంగుచు లేవఁదీసి వేత్వేఱ గాఢాలింగన మూర్ధాఘ్రాణంబులొనర్చి తన మనంబున. 758

ఉ. అంతటి క్రూరజీవి తన నంతమొనర్పఁగ నేగుదెంచినన్
గొంత యటంచు జాలిపడి కార్ముకమెత్తఁడు కొంతసేపు యిం
కెంత కృపారసమ్మువహియించు నొకో నను గన్నతండ్రి! సు
స్వాంతుఁడు రామభద్రుఁడిల సాత్వికపూరుషకోటిపై వాగిన్. 759

వ. ఇట్లు బహుప్రకారంబుల శ్రీరామభద్రుని వాత్సల్యాది సకల సద్గుణగరిష్ఠత్వమును గొనియాడుచు నమందానందసందోహపరవశమానసుండై యుండె. 760

తే.గీ. అంతఁ దాటక విగతాసువగుటఁగాంచి
యింద్రుఁడరుదెంచి సురలతో నినకులేశు
ననుజసహితుని బూజించి వినుతిఁ జేసి
మునివరేణ్యుని పదపద్మములకు నెఱఁగి. 761

వ. సభక్తికంబుగా మృదుమధురాలాపంబులంబ్రస్తుతించి యమ్మహామునీంద్రున కిట్లనియె. 762

ఆ.వె. నీ ప్రభావమెన్న నే నెంతవాఁడను
మునికులాబ్ధిచంద్ర! యినకులేంద్రుఁ
డైన రాముచేత ననురనుజపించి
యేలితీవు లోకపాళినిపుడు. 763

కం. సురలందఱకును నిర్భయ
మరుదారఘటింపఁ జేసితహహా! యుష్మ
త్పరమాద్భుతచారిత్రము
నెఱిఁగిన వాఁడెవఁడు గలఁడహీనగుణాఢ్యా! 764

**ఇంద్రుఁడు విశ్వామిత్రునితో భృశాశ్వపుత్రులను రామునకిమ్మని విన్నవించుట**

ఉ. ఈ రఘురామభద్రుఁడుదయించెను సర్వసుపర్వకోటికిం
పారఁగమేలుసేయుటకునై యిలలో నటుగాన నీవుమున్
ఘోరతపః ప్రభావమునఁ గోరి మహేశ్వరునుండి గొన్న దు
ర్వారభృశాశ్వపుత్రులను రామునకిమ్ము మహాత్మ! సత్కృపన్. 765

ఆ.వె. అస్త్రశస్త్ర దేహు లతి శౌర్యనిధులగు
నాభృశాశ్వనందనాళితోడ
నీవునేర్చినన్ని నిఖిలాస్త్రశస్త్రముల్
దాశరథికి నిమ్ము తాపసేంద్ర! 766

తే.గీ. అప్రభావోదధికి నింద్రుఁడీ ప్రకార
మమితవినయమ్ముతో విన్నవమునొనర్చె
నంగుళీదళవిభ్రాజ దమల హస్త
జలజములనొక్కచోఁ జేర్చి నలలితముగ. 767

కం. పిమ్మట నాజ్ఞంగైకొని
సమ్మదమున రామభద్రు సత్వసముద్రున్
గ్రమ్మఱనుతులొనరిచి త
త్సమ్మతి దివికేగె నమరసంఘముతోడన్. 768

కం. అంతటఁ దత్కాంతారో
పాంతోటజవాసులైన బ్రహ్మర్షివరుల్
సంతసమునఁ జనుదెంచిరి
యెంతయురాముని ప్రభావమెన్నుచు వరుసన్. 769

తే.గీ. వచ్చి కౌశికమునివర్యుఁ బ్రస్తుతించి
సకలదుష్టాసురాహితు సహజ సహితు
శ్రితజనస్తోము రామునాశీర్వదించి
వెడలిపోయిరి జపఫలమ్మొడులఁగట్టి. 770

వ. తదుపరి తాటకానిబర్హణ సంజాతాతిమాత్ర ప్రమోదావృతోదంచితాంతః కరుణుండును, మహాత్ముండునగు నా కుశికనందనుండధరీకృత సుధామధు రాయమానంబులగు నాలాపములంగావించుచు, నానందాశ్రు పరిపూర్ణనేత్రాం తరుండై శ్రీరామలక్ష్మణులం గౌఁగిలించి ముద్దుఁగొని, యొకకేల లక్ష్మీ వర్ధనుండగు లక్ష్మణుని పాణిపల్లవముం గ్రహించి, మఱియొక కేల శ్రీరామభద్రుని శిరంబు నిమురుచు గద్గదకంఠుండై 771

తే.గీ. తాటకను నేలపాల్చేసి తండ్రి! నీవు
భువనమంగళ కరుఁడవై పాల్చినావు
నీకు దుస్సాధ్యకృత్యమేలోకమందు
రహి జనింపదు కరుణార్ద్ర! రామభద్ర! 772

వ. అని వాత్సల్యాతిశయంబునం బల్కి 773

తే.గీ. అన్నవలె నీవు సర్వసంపన్నమూర్తి
వైతి నాయన్న! సౌమిత్రి! యనుచు వేడ్కఁ
జుబుకముంబట్టి లాలించి సొంపెసంగ
నక్కునంజేర్చి లక్ష్మణు నాదరించె. 774

వ. అనంతరంబఖిల సద్గుణగణాభిరాముండగు రాముం గాంచి యిట్లనియె.

తే.గీ. భాస్కరుండస్తగిరి జేర బయనమయ్యె
సంధ్యరాఁజూచుచున్నదీ సమయమందు

సముచితములైన కృత్యముల్ జరిపి యవల
నీనిశిధిని వెళ్లింతమిచట రామ! 776

కం. రేపటి యుదయము రవికుల
దీపక! యిటనుండి బయలుదేఱుదమస్మ
త్ప్రాపకమగు నాశ్రమమున
కేపారిన ముదముతోడ నిద్ధచరిత్రా! 777

కం. అని రాఘవులిరువురతో
మునిచంద్రుఁడు సాంధ్యకృత్యమునుదీరిచి త
ద్వనమున నివసించెను నిశి
మనమలరఁగ భువనవినుత మహిమాన్వితుఁడై 778

ఆ.వె. సురలు చొరఁగలేని సుందనతీఘోర
గహనమపుడు లోకగణ్యమగుచు
రాజరాజచైత్రరథమును నిరసించి
సకల సౌఖ్యములకు సదనమయ్యె. 779

కం. తృణశయ్యల నిద్రించెడు
ఘనులౌ రాఘువులప్రక్కఁ గనుమోడ్పక మే
ల్కొని తత్సౌందర్యమ్మును
మునిముఖ్యండనుభవించె మోదమెలర్పన్. 780

కం. అరుణోదయమున మేల్కొని
ధరణీపతిసుతులు మౌని తల్లజుతోడన్
గరమరుదుగ నాహ్నికవిధి
నెరపిరి వేదోక్తమార్గనిష్ఠాత్మకులై. 781

## విశ్వామిత్రుఁడు శ్రీరామునకు దివ్యాస్త్రంబులనొసంగుట

వ. అనంతరమందభిరామగుణ మహోదధిచంద్రుండగు శ్రీరామచంద్రుంగాంచి కరుణారసార్ద్రహృదయుండై కౌశికమహామునీంద్రుడిట్లనియె 782

ఉ. నీరజమిత్ర వంశరజనీకరరాఘవరామ! లోకదు
ర్వారపరాక్రమక్రమవిరాజితరాజలలామ! నీమహా

శూరతనచ్చె నాకిఁక యశోధన! చేకొను మిచ్చుచుంటి నిం
దారినప్రేమతోడుత మహాస్త్ర వితానమునెల్లనియ్యెడన్. 783

కం. సురనరదనుజోరగులకు
నరుదై యెఱుఁగంగరాని యఖిలాస్త్రతతిన్
సరసీజేక్షణఁ నీకర
వరపల్లవమందు మెఱయవశమొనరింతున్. 784

కం. వదలని ప్రేమమ్మున ని
న్గదనములన్విజయలక్ష్మి గైకొను నిఁక నీ
పదునాలుగు జగముల ని
న్నెదిరించి మనంగఁజాలఁడెవ్వాఁడైనన్. 785

చ. అని యిటు లాచమించి విమలాననుఁడై నియమమ్ముతోజవం
బున సకలాస్త్రశస్త్రనిజమూర్తివశీకరణ క్షమంబులై
తనరెడిదివ్యమంత్రములఁ దద్దయుఁదానుస్మరించి రాముని
గని శుచివౌచు రమ్మనియెఁ గౌతుకముల్లసిలంగనాదటన్. 786

వ. తన యాజ్ఞం చేసి సుప్రక్షాళిత పాణిపాదుండై శుచియై యరుదెంచి సాష్టాంగ దండప్రణామంబులాచరించిన శ్రీరామభద్రుని భద్రవాక్పురస్సరంబుగా మందస్మితవదనారవిందుండై లేవఁదీసి, కుశాస్తరణంబుపైఁ బ్రాఙ్ముఖోపవిష్టం గావించి, ద్విరాచమన ప్రాణాయామత్రయ సంకల్పపూర్వకంబుగా విశ్వామిత్ర మహామునీంద్రుఁడు క్రమక్రమంబున, దండచక్రంబును, ధర్మచక్రంబును, గాలచక్రంబును, విష్ణుచక్రంబును, నైంద్రాస్త్రంబును, మహాభయంకరములగు వజ్రశివ శూల బ్రహ్మశిరంబులును, నైషీకంబును, బ్రహ్మాస్త్రంబును, మోదకీశిఖరీనామక గదాద్వయంబును, ధర్మకాలవరుణాపాశంబులును, వారుణాస్త్రంబును, శుష్కార్ద్రాభిధేయంబగు నశనియుగ్మంబును, బైనాకంబును, నారాయణాస్త్రంబును, నాగ్నేయాస్త్రంబును, శిఖరాస్త్రంబును, వాయవ్యాస్త్రంబును, బ్రథనంబును, హయశిరోస్త్రంబును, గ్రౌంచాస్త్రంబును, విష్ణురుద్రశక్తి నామక శక్త్యస్త్రద్వయంబును, మఱియు దనుజవీరులు ధరించి తిరుగునట్టి కంకాళముసల కపాల కంకణంబులును, వైద్యాధరాస్త్రంబును, నందనాభిధానంబగు

మహాఖడ్గంబును, మానవాస్త్రంబును, గాంధర్వాస్త్రంబును, బ్రశమనప్రస్వాపనా స్త్రంబులును, బ్రాభాకరాస్త్రంబును, దర్పణశోషణాస్త్రంబులును, నంతాపన విలాపనాఖ్యాకంబగు శరయుగళంబును, దర్పకాస్త్రంబును, బైశాచాస్త్రంబును, సమ్మోహన సంవర్తక తామస సౌమనంబులును, మౌసలసత్య మాయాధర తేజః ప్రభావాస్త్రంబులును, సౌమ్యాస్త్రంబును, సుదామనాభిదానంబైన త్వాష్ట్రాస్త్రంబును, శీతసౌరాస్త్రంబులును, మొదలుగాఁగల యనేక దివ్యాస్త్రంబుల కధిష్ఠాన దేవతామంత్రంబులను, యథావిధిగ నుపదేశించి, తత్తన్మంత్రాధిష్ఠాన దేవతలంబిలిచి మీరందఱు నేకమై సర్వకాలములందును, మహాజాగరూకతతోనప్రమత్తులై, నాభవభవాంతర ప్రేమరాశియగు నీ శ్రీరామభద్రునకధీనులై, తచ్ఛాసనంబులను శిరంబులందాల్చి యభీష్టకార్యంబులను నిర్వర్తించుచుండుఁడని యాజ్ఞాపింప, వారత్యంతోత్సాహముతో మహాప్రసాదమని తదనుమతివడసి, విశ్వామిత్ర ప్రదత్త దివ్యాస్త్ర మహామంత్రానుష్ఠానసిద్ధి కలిగి, కుశాస్తరణంబు నందేకాగ్ర మానసుండును, బాలభానుప్రభాభాసమానుండునునైయున్న శ్రీరామభద్రుని పురోభాగంబునందతి భయంకరదంష్ట్రాకరాళవక్త్రంబులును, సకల విజయ సంపాదనహేతు భూతంబులును, జాజ్వల్యమాన జ్వలనప్రభాభాసురంబులును, చటచటాయమాన విస్ఫులింగ పట సంచార మహాభీలంబులును నిఖిల లోక జైత్రంబులును ననుపమాన భూరి ప్రతాప దుర్నిరీక్షంబులును, శతకోటి యుగాంతాదిత్య తేజః కలితంబులును, సకల ప్రాణిభయంకరాకారంబులును, నానావిధ చిత్రవిచిత్ర రూపచ్ఛాయలుంగలిగి పొడసూపి కేల్మోడ్పులుత్తమాంగమ్ములం జేర్చి మహాభక్తి వినయవిశ్వాసమ్ములతో నైక కంఠ్యముగా నిట్లనిరి. 787

కం. ఎటనుండవలెను మేమివు
డెటు చరియింపంగవలయు నెవ్వరిపై మా
పటుపౌరుషదర్పములన్
స్ఫుటముగఁ బ్రకటింపవలయు సురనుతచరితా! 788

కం. దేవా! నీకైంకర్య
మ్మేవేళలఁ జేయుచుండు మిపుడపుడస కో
పావనసూర్యాన్వయపా
రావారశరచ్ఛశాంక! ప్రథిత జయాంకా! 789

కం. నీ దాసదాసులము మే
మో దానవవైరి! యేలుముచితజ్ఞ! మమున్
సాదరముగ నని రాముని
పాదములకు శిరములంటఁ బ్రణతులొనర్చెన్. 790

వ. అంతట సుప్రసన్నవదానాబ్జుండగు శ్రీరామభద్రుండ మ్మహాస్త్రశస్త్ర రాజాధి దేవతలం దనపాణిపల్లవంబులచే వేర్వేఱుగా స్పృశించి, మహాత్ములారా! ఇఁక మీ యిష్టప్రకారమెందేనిసంచరించుచుఁ గార్యావసరముంబట్టి నేఁదలంచినప్పుడు సాక్షాత్కరించి మదభీష్టకృత్యము నతిశీఘ్రముగానెఱవేఱ్చుచుండుఁడనిపల్కిన శ్రీరామభద్రుని ప్రణయమధురంబులగు పల్కులకలరి యమ్మహామంత్రాధిష్ఠాన దేవతలు సప్రశ్రయంబుగాఁ బునః పునఃప్రణామంబులాచరించి తదాజ్ఞా వశమానసులై యథేచ్ఛం జనిరి. తదనంతరమారఘునాథుండ పూర్వహర్ష రేఖా విరాజితవదనారవిందుండై, స్వాశ్రమప్రయాణోన్ముఖుండును, అపర చతురాననుండు నునగు కౌశికమహామునీంద్రునకుంబ్రణమిల్లి ముకుళిత కరకమలుండై, మునీంద్రా! తమ నిర్వ్యాజవాత్సల్యాతిశయము నన్నుసర్వాస్త్రశస్త్ర రహస్యామ్నాయకుశలునిగా నొనర్చి ధన్య తమత్వముంబ్రసాదించియుండె, మఱియుఁ దదస్త్రోపసంహారములం గూడననుగ్రహించి శిష్యుండనగు నాకుఁ జారితార్థ్యముంగల్పించుఁడనిప్రార్థించిన నమ్మునివరుండు సంతుష్టాంత రంగుండును, రోమాంచకంచుకితగాత్రుండునునై రఘురామునిశిరంబునిమిరిచుబుకంబుఁబుణుకుచు ముద్దుంగొనియానందాశ్రువులు వెల్లివిరియ నిట్లనియె. 791

తే.గీ. రామ! సంపూర్ణకామ! నా ప్రేమమూర్తి
వీవె కావున నుపశమనేషువులను
గూడఁ గైకొనుమిచ్చుచున్నాఁడనిపుడు
నాకు నీకంటె నాప్తులున్నారె? తండ్రి! 792

## విశ్వామిత్రుఁడు శ్రీరామునకు భృశాశ్వతనయులంబ్రసాదించుట

వ. అనిపల్కి శ్రీరామభద్రునిఁ గుశాసనాసీనుంగావించి తానుఁగూడ శుచిర్భూతుండై, పూర్వదత్తాస్త్రోపసంహారమంత్రక్రమప్రకరణంబెఱింగించి మఱియు, సత్యవంతంబును సత్యకీర్తియు ధృష్టంబును రభసంబును బ్రతిహారతరంబును పరాఙ్ముఖంబును నవాఙ్ముఖంబును. లక్షాక్షవిషమంబులును, దృఢనాభంబును, సునాభంబును,

బద్మనాభంబును, మహానాభంబును, దుందునాభంబును, దశశీర్ష శతోదర శతవక్త్రంబులును, కృశన జ్యోతిషంబులును, వైరాగ్య విమల యోగంధర హరిద్ర దైత్య ప్రశమవంబులును, సార్చిర్మాలియును ధృతిర్మాలియును, వృత్తిమంతంబును, రుచిరపితృసౌ మననంబులును, విధూతమ కరకరవీరకరంబులును, ధనధాన్యం బులును, కామరూప కామరుచి మోహావరణంబులును, జృంభక సర్వనాభంబులును, సంతానవరణానంత విభావంతంబులును మొదలుగాఁగల భృశాశ్వతనయులం బ్రసాదించి యిట్లనియె.

కం. రామా! వీరందఱు జయ
కాములు కామస్వరూపకలితప్రజ్వల్
శ్రీమహితులు జాపకజన
కామితమందారులఖిలకాలములందున్ 794

కం. నీ కంటెఁ బాత్రభూతుఁడు
లోకములన్ లేఁడటంచు లోనెఱిఁగి శరా
నీకము నీకొసంగితినిపు
డీ కరణిన్ రామచంద్ర! హితగుణసాంద్రా! 795

కం. ఈయస్త్రవితతిచే నీ
వో యనఘచరిత్ర! సంతతోన్నతిమతివై
శ్రీయును శుభమునుఁ దేజము
నాయువు రాజ్యాభివృద్ధినందుము రామా! 796

వ. అని మహానందపూర్వకంబుగాఁ బల్కిన యనంతరంబ

ఆ.వె. తేజరిల్లె రాముఁడీ జగత్త్రయమందు
సాటిలేని దివ్యశక్తితోడఁ
గుశికసుతునివలనఁ గొనియున్న వాఁడౌట
నా భృశాశ్వనందనాళినెల్ల. 798

**అస్త్రశస్త్ర సంపాదనము చేత మహాతేజోవంతుడైన శ్రీరాముడు**

వ. ఇట్లు కుశాసనంబునందఖిలజనాభిరాముండగు రాముండుద్యన్మార్తాండ మండల సంకాశమహాతేజోవిరాజితుండైయుండునవసరంబున

సీ. ప్రళయ వీరావేశపరుఁడైన ధూర్జటి
ఫాలనేత్రానలప్రభలమించి
గ్రైష్మభాను మరీచిగణములఁబురుడించి
విద్యుల్లతల ఠీవి వెక్కిరించి
సంపూర్ణ శారదచంద్రచంద్రికవోలి
ఘనతమోహంకారమును విదల్చి
ధూమజాలముతోడఁ దులఁదూఁగి బాలభా
స్కరకరంబులకాంతిఁబరిహసించి

తే.గీ. యేపు మీఱిన తమనిజరూపములను
దాల్చి పొడసూపి రలరుచు దాశరథికి
నా భృశాశ్వుని సత్పుత్రులంతమీఁద
నస్త్ర శస్త్రోపశమనమంత్రాధిపులును. 800

తే.గీ. ప్రణతులొనరించి యనిరిట్లు వినయమొప్ప
నిటలతటరాజితాంజలిపుటులగుచును
గుశికనందనునాజ్ఞచేఁ గొమరుమిగుల
దేవ! నీ సేవఁజేయనేతెంచినాము. 801

తే.గీ. ఏము భవదీయశాసనంబెపుడు మౌళిఁ
దాల్చి వర్తించుచుందుముదారచరిత
ఏమి సేయఁగవలయుమాకేమియాజ్ఞ
యనిన రఘుపతి మనమునందలరియపుడు. 802

వ. మునికులనాథుండగు విశ్వామిత్రుని మహామంత్ర మహిమంబున కచ్చెరువొందుచు నయ్యస్త్రాధిదేవతలను వేర్వేరందనకోమలకరనీరజంబులచే స్పృశించి బహుమాన పురస్సరంబుగా నిట్లనియె. 803

తే.గీ. పనిగలప్పుడు మిమ్ము నా మనమునందుఁ
దలఁతుఁ దలఁచినవెంటనే తరలిరండు
వచ్చి నాయభిలషితార్థమిచ్చిపోవు
చుండుఁ డెల్లప్పుడనిపల్కె సురుచిరముగ. 804

కం. రాముని మృదుమధురోక్తుల
కా మహితాస్త్రాధినాథులాత్మలలోనన్
బ్రేమమ్ముఁగొనుచు నట్లే
స్వామీ, మీ దయయటంచుఁ బల్కిరివరుసన్. 805

ఆ.వె. పల్కి యస్త్రశస్త్రపతులిట్లు రాముని
పాదజలజములకుఁ బ్రణతిఁజేసి
యాజ్ఞఁగొని యథేచ్ఛనరిగిరి తదుపరి
రాఘవుండు మౌనిరాజుఁగాంచి. 806

కం. ప్రణమిల్లిన రాముని ముని
జననాథుఁడు లేవఁదీసి సర్వశుభా వా
ప్తిని గనుమని యనుచును దన
మనమారఁగఁ గౌఁగిలించి మఱియిట్లనియెన్. 807

ఆ.వె. నీవు నేర్చినన్ని నిఖిలాస్త్రవిద్యలు
లక్ష్మణునకునిమ్ము రామభద్ర!
యనుచు నాజ్ఞఁచేసి నామునిముఖ్యుఁడు
రామమూర్తి కపుడుప్రేమమీఱ.

వ. తదాజ్ఞావశమానసుండై శ్రీరామభద్రుండనుజుండగు లక్ష్మణునకు విశ్వామిత్ర మహామునీంద్రునివలనఁ దానునేర్చిన నానావిధాస్త్రశస్త్రవిద్యలను, తదుప సంహారంబులను యథావిధిగనుపదేశించె. అనంతరమమ్మహామునీంద్రునితోడం గూడి శ్రీరామలక్ష్మణులావిపినంబునుండివెడలి మనోహరంబులగు మున్యాశ్రమ సముదాయములనువిలోకించుచుఁ జని చని యొక్కెడనొక్కధరాధరంబున కనతి దూరంబులో మహాలక్ష్మీసంచారక్షమంబును, వైకుంఠ సత్యస్వర్గస్థిత వివిధవైభవ విభ్రాజమానంబును, దూరదేశ సమాయాత మునిజనసంకులంబును, భవ్యంబును, దివ్యంబునునై యొప్పు నొక్కరమణీయ(ా)తపోవనముంగాంచి శ్రీరామభద్రుండ మ్మునీంద్రునితో నిట్లనియె. 809

తే.గీ. అనఘ! యీ తాపసాశ్రమమునవసించు
శారికా కీరముల్గూడఁజదువుచుండె

నిగమసూక్తాళి నెంతయోనేర్పుమీఱ
నే మహాత్ముని దీవనంబోమహాత్మ! 810

ఉ. దీని తెఱంగుఁజెప్పి భవదీయ తపోవనమెంతదవ్వులో
గానఁగవచ్చునింక బహుకాలమునుండియు యజ్ఞవిఘ్నమున్
బూనియొనర్చు దానవులపుట్టుకలెట్టివి మౌనివర్య! మా
కానతినిమ్ము వారిస్థితినంతయు వీడకసత్కృపామతిన్. 811

ఆ.వె. సవనరక్షనెట్లు సల్పంగవలె మేము
పాలసుదిండిమగలు పాడవడంగు
మార్గమేది, తెల్పి మమ్ముద్ధరించుమో
వినుతసుగుణసాంద్ర! ముని మహేంద్ర! 812

కం. అనిపల్కిన శ్రీరాముని
వినయనయమ్ములకునలరి విశ్వామిత్రుం
డనుపమతేజోనిధి యి
ట్లని చెప్పందొడంగె రఘుకులాగ్రణి కెలమిన్. 813

**విశ్వామిత్రుఁడు శ్రీరామునకు సిద్ధాశ్రమ వృత్తాంతముందెల్పుట**

ఆ.వె. పూర్వకాలమందపూర్వతపంబిటఁ
గశ్యపుండొనర్చి గనియెసిద్ధి
నందువలన దీనినందురు సిద్ధాశ్ర
మంబటంచు మౌనులహరహంబు. 814

వ. నంతావార్శులై ఘోరనిష్ఠతోఁ గొన్నివేలమహాయుగంబులీయాశ్రమంబునం దపంబుఁగావించిన యదితి కశ్యపుల కఖిల జగన్నాథుండగు శ్రీనాథుండు సాక్షాత్కరించి వారికిఁ దాను గుమారుండై యవతరించునట్లు వరంబనుగ్రహించు నసమయంబునం గశ్యప మనోరథపరిపూరణంబునకై, దీనికి శ్రీమహావిష్ణువే సిద్ధాశ్రమంబని నామకరణముంగావించుటకంగీకరించి యుండె మఱియు 815

ఆ.వె. ఇందనేక కోట్లమందిబ్రహ్మర్షులు
ఘోరనిష్ఠులై యపారతపము

లాచరించి సిద్ధినందుటవలన సి
ద్ధాశ్రమాఖ్య సార్థకాఖ్యమయ్యె. 816

**విశ్వామిత్రుఁడు శ్రీరామునకు వామన చరిత్రమును సంక్షేపముగఁ దెల్పుట**

వ. అతఃపూర్వము శ్రియః పతి వైశ్వానరప్రముఖనిఖిలదేవతాగణములచే బలి బంధనముంగూర్చి ప్రార్థింపఁబడియున్న వాఁడగుట వలన సంతానార్థులగు నదితి కశ్యపులకుఁ దానొసంగిన వరదానానుసారముగా నమ్మహర్షివర్యున కదితియందు, వామన రూపంబున నవతరించి, చౌలోపనయనాంత సంస్కార సంస్కృతుండై, స్వారాజ్యంబాక్రమించి, యామినీచర భూచర ఖేచరప్రకరంబులు గొల్వ నేకచ్ఛత్రాధిపత్యంబుగా జగత్త్రయంబేలుచు, మహాదాతయై యజ్ఞదీక్షంబూని యున్న వైరోచనియగు బలిచక్రవర్తి కడకుంజని, స్వపాదత్రయపరిమిత వసుంధరా దానముంగొని, త్రివిక్రమ రూపంబున లోకత్రయాక్రమణంబొనర్చి, భక్తశిరోమణియగు ప్రహ్లాదుని మనః పూరణమునకై బలికి రసాతలాధిపత్యము నొసంగి, చిరంజీవివై యందునివసించుయుండుమని యాజ్ఞాపించి, త్రిలోకాధిపత్యము నింద్రునికైవసంబొనర్చి, పదంపడి యీ సిద్ధాశ్రమమున కరుదెంచి వామన రూపంబుననే బహుకాలమిందు శ్రమాపనోదంబుకొఱకుఁదపోనిష్ఠుఁడై నివసించియుండుటవలన నియ్యది వామనాశ్రమంబనియును జగత్ప్రసిద్ధినొంది యుండె. 817

కం. కమలారమణీపతిపద
కమలంబులుగొల్చి సర్వకాలములందున్
విమలంబగు వైష్ణవతే
జముఁ బూనినవాఁడనౌట జగమునరామా! 818

ఆ.వె. ఏనుఁగూడఁ దపము నిందేయొనర్చుచుఁ
గొన్ని హాయనములకుంతనిష్ఠ
సిద్ధినొంది దీని సిద్ధాశ్రమత్వంబుఁ
గ్రొత్తఁజేసినాఁడఁ గువలయమున. 819

కం. ఇప్పటికిని యీ వనమం
దొప్పగ నివసించుచుందు నుర్వీతలమం
దెప్పగిది నాకు స్వత్వం
బప్పగిదియె నీకు స్వత్వమగునిది రామా! 820

**మారీచ సుబాహుల అగడములు**

కం. మారీచ సుబాహువులను
దారుణరాక్షసులు స్వీయదళములతోఁ బెం
పారఁగ వత్తురు సవనము
ప్రారంభమ్మైనపిదపఁ బార్థివతనయా! 821

ఆ.వె. వారువచ్చునపుడు వసుధచలించును
క్రూరమృగములెల్ల పాఱఁజూచు
మౌనిమండలంబు మతిచెడినిలఁబడు
నేమిచిత్రమయ్య యినకులేశ! 822

తే.గీ. వచ్చి మధుమాంస రక్తముల్వహ్నులందు
నించి ఘృతపాత్రములను బోర్లించి ఋత్వి
జులను బంధించి స్రుక్స్రువంబులను త్రుంచి,
విఘ్న మొనరించుచుందురు వివిధగతుల. 823

కం. ఎప్పటివలె నా రక్కసు
లిప్పుడును సవంబుఁజెఱుపనేతెంతురు మీ
రొప్పగ బాణానలమునఁ
దప్పక హింసించి గనుఁడుదారయశమ్మున్. 824

ఉ. నా మఖరక్షణంబిపుడు నాయన! శ్రీరఘురామభద్ర! స
ర్వామరసన్నుతాత్మ! బుధవత్సల! తమ్మునితోడఁగూడి నీ
వేమెయి నిర్వహించుదువో యీ భరమంతయుఁగూడ మీశర
స్తోమముపైననిల్పితిని నుంతయువీడక కౌతుకంబునన్. 825

చ. ఇనకులవర్యులార! యిఁక నీవనిలోనికిఁ జేరరందు మీ
రనుచును రామలక్ష్మణుల నద్భుతదర్శనులన్మహాత్ముఁడౌ

మునిపతి వెంటఁబెట్టుకొని మోదముతోడుతవేఁగెస్వాశ్రమ
మ్మునకుఁ బునర్వసుప్రయుతపూర్ణ సుధాకరమూర్తియోయనన్. 826

తే.గీ. రామలక్ష్మణులనుగూడి రాణమీఱ
వచ్చుచుండిన మునికులవర్యుఁగాంచి
సత్వరంబున నచ్చటికలమునులు
సంభ్రమాశ్చర్యపరవశస్వాంతులగుచు. 827

కం. ఎదురేఁగుదెంచి విధిగా
సదమలచిత్తులకునుచితసత్కారంబుల్
హృదయమ్ములలరనొనరిచి
తదుపరిగొనిచనిరి భక్తితత్పరులౌచున్. 828

వ. ఇట్లు కుశికనందనుండు శ్రీరామ లక్ష్మణులతో మహార్షులంగూడి నిజాశ్రమంబునకుం జనుదెంచినపిమ్మట నందఱుంగూడ నముచితాస్తరణము లందు సుఖాసీనులైకొంతతడ విష్టాగోష్ఠినల్పినయనంతరంబా నృపకుమారులు లేచి ముకుళితకరకమలులై విశ్వామిత్రుని పురోభాగంబున నిల్చి మహాభక్తి వినయ విశ్వాసంబులతో నిట్లనిరి. 829

చ. మునికులసార్వభౌమ! మఖమున్ దగురీతి నుపక్రమించు నె
మ్మనమున సంశయమ్ముడిగి మాపయినుంచి త్వ దధ్వర క్రియా
వనభరమంతయుంద్రిదశవందిత! జాగిఁకసేయనేల నీ
ఘనకృపచేత రాక్షసనికాయముఁబట్టి వధింతుమిత్తఱిన్. 830

తే.గీ. సవనతంత్రము ఋత్విజుల్ సలుపవచ్చు
మేము శరచాపధరులమై యో మహాత్మ!
వేయికన్నులఁ గనిపెట్టి వివిధ గతుల
జన్నమునకెట్టిలోపంబు జరుగనీము. 831

ఉ. పొచ్చెముసేయఁబూని మునిపుంగవ! దైత్యులు వచ్చిరేని యా
వచ్చినవారినెల్లరను వచ్చినయట్టులె మట్టుపెట్టి మీ
ముచ్చటఁదీర్పనెంచితిమమోఘశరమ్ములనేఁడె సంతస
మ్మచ్చుపడన్వహింపఁదగు నధ్వరదీక్షత్రిలోకరక్షకై 832

ఆ.వె. నిఖిల యమికులేంద్ర! నీచెప్పినట్టిద్ది
యర్థవంతమౌచు నలరుఁగాత
క్షితి తలంబునందు సిద్ధాశ్రమంబని
బుధ జనానురాగమధిగమించి. 833

ఆ.వె. ఆలసింపకిప్పుడర్థక్షణంబైన
వలసినట్టివస్తువర్గమెల్ల
సేకరించి దీక్షస్వీకరించుమహాత్మ!
స్వాంతమందుశంకనమయఁజేసి. 834

ఆ.వె. ఇట్లు పల్కుచున్న యినకులాధీశుల
పల్కులాలకించి పరమమౌని
ప్రమద జలధిలోనఁబడిమున్గిలేచి మై
మఱపునొందె నొక్కయరవిగడియ.

ఉ. అంతటఁ బ్రేమమీఱఁగని యా రఘునాథులనిర్వురన్ సభా
భ్యంతరమందులేచి యరు దారఁగఁ గౌఁగిటఁజేర్చి కౌశికుం
డెంతయుగారవించి భువనేశ్వరులార! మదీయచిత్తమిం
తంతనిచెప్పలేని ముదమందెఁగదా! యనిపల్కి యిట్లనెన్. 836

**విశ్వామిత్రుఁడు యజ్ఞారంభమొనర్చుట**

ఆ.వె. అన్నలార! మీరలన్నట్లు నేఁడె ప్రా
రంభమగును గాత క్రతువరంబు
అవునుగాదటంచు ననువారలెవ్వారు
దక్షులౌచు మీరురక్షసల్ప. 837

కం. అని పల్కిన మునినాథున
కనిరి రఘూద్వహులు భక్తి నవహితమతులై
అనఘా! యెన్ని దినంబులు
ఘననిష్ఠన్బూని మఖముఁ గావఁగవలయున్. 838

కం. ఏయే వేళల దానవు
లీ యజ్ఞముభంగపఱుపనేతెంతురు మా

కాయా వేళలు దెల్పుము
చేయందగుయత్నమెల్లఁ జేయుదుమనఘా! 839

ఆ.వె. అనిన రాఘవునకు నామునికుంజరుం
డనియెనిట్లులమితహర్షమొంది
ఈ దినంబుగాక యిఁకనాఱుదినములు
రేపు మొదలుచేసి యేపుమీఱ 840

ఆ.వె. తూణ చాప శరములూని మీరిర్వురు
మమ్ము మా మఖమ్ము నిమ్ముతోడఁ
గాచు చుండుఁడయ్య గడువు తీఱిన దాఁక
నంతలోనె వచ్చు నసురవితతి 841

ఆ.వె. ఈ క్షణంబునందె దీక్షవహించుదు
ననుచు రాఘవులకు ననునయముగఁ
దెల్పి మౌనిపతి యనల్పమౌ వస్తువ
ర్గమ్మునెల్లఁగూర్చె గడియలోన. 842

వ. పిమ్మట నమ్మహామునీంద్రుండు బ్రహ్మతేజోవిరాజమానులగు మహర్షివర్యుల తోడను, శ్రీరామ లక్ష్మణుల తోడనుం గూడి, సాయంసంధ్యావందనాది క్రియా కలాపమును నిర్వర్తించి, జలపూర్ణ కలశాంచిత హస్తులును యాజకులును నగుననేక బ్రహ్మర్షిశ్రేష్ఠులు మునిసార్వభౌముండగు తనను బరివేష్టించి స్వస్తిఘోషణం బొనర్చుచు నడువ, శరధనుస్తూణీరఖడ్గములను ధరించి దశదిగ్రక్షణాసక్తచిత్తులై శ్రీరామలక్ష్మణులిరుగెలంకులన్మహానందకందళితహృదయారవిందులై వచ్చుచుండం దోయధారాపురస్సరంబుగా, దీపాంకురోదకుంభాలంకృతంబగు యజ్ఞశాలం బ్రవేశించిన విశ్వామిత్రమహాముని భగవత్ప్రార్థన సాత్త్విక సంకల్ప పూర్వకంబుగాఁ బుణ్యాహంబుఁ గావించి, ఋత్విగ్వరణ కౌతుక బంధన మృత్సంగ్రణాంకురా రోపణాది కృత్యంబుల నెఱవేర్చి, క్రతు దీక్షాంతపర్యంత మౌనముద్రా ముద్రితుండై విరాజిల్లుచుండెనంత శ్రీరామలక్ష్మణులు క్షణక్షణంబున కమ్మఖశాలంబరి వేష్టించుచు నారాత్రింగడపి, మఱునాఁడుషః కాలంబునం బౌర్వాహ్ణిక క్రియలనుపాసించి, సమ చతురశ్రంబును, చతుర్హస్తాంతర ప్రమాణ షోడశస్తంభవిరాజితవీథీత్రయ చతుర్ద్వార

యుతంబును, చతుస్తోరణ భూషితాచ్ఛిద్రప్రపాపరివృతంబును వితాన ధ్వజ దర్భ మాలా తరంగస్తంభ వేష్టన ముక్తాదామాద్యలంకృతంబును, మధ్యనైరృత వాయవ్యాంశ ప్రకల్పిత వితర్ది త్రయ శోభితంబును అశ్వత్థోదుంబరప్లక్షవట నిర్మిత ద్వారవిస్తారజగత్కల్యాణకరతోరణభూషితంబును, పుష్పకుశకూర్చాక్షతాశ్వత్థామ్ర పల్లవనారికేళక్షౌమాంబరాద్యలంకృత పూర్ణకుంభకదళీక్రముకఘృతాజస్రదీపవిరాజిత చతుర్ద్వారోభయపార్శ్వంబును, సుప్రతిష్ఠితాష్టమంగళపంచాయుధనిరంతర ప్రకాశితాశా వలయంబును, రంగవల్ల్యాద్యలంకృతబ్రహ్మాసోమప్రస్తరవేద్యాది సహితాగ్ని కుండ విరాజమానంబును, ఫల పుష్ప గంధా క్షత నాగవల్లీదళ క్రముకాది మంగళ ద్రవ్య పూర్ణ పాత్రపాలికా కుంభశరావధూప దీపచషకోపశోభితంబును, స్రుక్స్రువాగ్ని హోత్ర హవణీ దర్వీజుహూపజుహూ ప్రణీధ్యరణ్యూర్ధ్వపట్టికా మంథదండరజ్జు దృషి కృష్ణాజినసమిత్కుశకూర్చపవిత్రపరిధిపరిస్తరణేంధనతండులవ్రీహిపిష్టి పంచామృత గోఘృతాది నానావిధసంభారభారాంచితంబును, ఋత్విక్పరిచారక సదస్యజన సంకులంబును, త్రిభువన మంగళదాయకంబునునగు యజ్ఞశాలం బ్రవేశించి, సంయమీంద్రుని సృష్టిప్రజ్ఞాప్రభావవిశేషంబుల కచ్చెరువొందుచు వినయవిధేయులై, నిత్యాహ్నికకృత్యంబులందీర్చి కుశకృష్ణాజినాచ్ఛాదితంబగు మధ్యవేది యందభినవ వైశ్వానరుండునుంబోలె, పద్మాసనాసీనుండై వెలుంగుచున్న విశ్వామిత్ర మహామునీంద్రునకు సాష్టాంగదండప్రణామంబులాచరించిన, నాతేజో మూర్తియగు మౌనీంద్రుండు, దరహాససుందరముఖాంబురుహుండై, అనుపమాన మహాతేజస్సం పన్నులగు శ్రీరామలక్ష్మణుల శిరంబులం బుష్పాక్షతలుచల్లి మానసికంబుగా నాశీర్వదించిన యనంతరంబచ్చటి మహర్షిశ్రేష్ఠులు వారింగాంచి బహు విధంబులం గొనియాడి సబహుమానంబుగా నిట్లనిరి. 843

తే.గీ. జరుగవలసిన ప్రక్రియా సరణిఁదెల్పి
మౌనముద్రాంచితుండయ్యె మౌనివర్యు
డఖిల వేదస్వరూపిఁ నేఁడాదిగాఁగ
నాఱు దినములు పల్కఁడెవ్వారితోడ. 844

తే.గీ. దీక్షగొనియున్న యీ యాఱుదినములెట్లు
మౌనిచంద్రుని మఖమును మమ్ముఁగూడ

నరసి రక్షించఁగలరో మా యన్నలార
కార్యభారము మీయందెకలదుసతము. 845

### శ్రీరాముడు యాగరక్షణ దీక్షితుడగుట

చ. అన విని రామలక్ష్మణులు హర్షపరీతహృదంతరాళులై
మునులనుగాంచి రాక్షసుల మోసపుకృత్యములందలంచి మీ
మనముల భీతిఁజెందకిఁక మాపయినుంచి సమస్తభారమున్
దనుజుల మట్టుపెట్టుటకు దాశరథుల్గలరంచు నమ్ముఁడీ 846

వ. ఇట్లు ధైర్యోక్తులంబల్కి తదాశీర్వాదపురస్సరంబుగా వెలువడి బహిర్భాగంబున కరుదెంచి మఖరక్షాదీక్షనలరారు శ్రీరామలక్ష్మణులధిజ్యకార్ముకులై యజ్ఞశాలం బ్రదక్షిణించుచు రక్షశ్శిక్షా సమయసమాగమమునుపలక్షించుచుండి రంతనమ్మహా మునీంద్రులు వీరింగాంచుచు సంతోషపారవశ్యముఁనొంది తమతమ మనంబులందు 847

తే.గీ. అవని వర్ణాంతరాక్రాంతుఁడైన మౌని
గురువరుండౌటచే వీరికరములివ్వ
దహహ న్యగ్రోధదండయోగ్యతనువీడి
యధిగమించెఁ బలాశదండాభిలాష. 848

### యాగవర్ణన

వ. ఇట్లు బహువిధంబులం దలంచుచుండిరి. అనంతరమందమ్మహర్షి శ్రేష్ఠుండగు కౌశికుని కనుసన్నలమెలంగుచున్నసదస్యులు సవనతంత్రమునందు న్యూనాతి రిక్తములుదొరలకుండునట్లునిరీక్షించుచుండ నాచార్యబ్రహ్మ సోమాధ్వర్యూపద్రష్టృ హోతలు, మహామంత్రజాపకులు మొదలుగాఁగల ఋత్విజులు సపరిచారకులై శాస్త్రోక్త విధానము ననుసరించి, శమీగర్భాశ్వత్థారణియం దగ్నిహోత్రమును సాధించి, గార్హపత్యాన్వాహార్యాహవనీయావసథ్యసభ్య పౌండరీక శ్రామణ కౌపాసనాగ్ని కుండములందుఁ గ్రమముగా నా మథితాగ్నిం బ్రతిష్ఠించి, సామిధేన్యుచ్చారణ పూర్వకంబుగాఁ బ్రజ్వలింపంజేయఁబడిన యా యగ్నులందు, సమిదాజ్య చరు సక్తులాజాపూప వ్రీహి తిల దూర్వారవిందాది నానావిధ సాంనాయ్యంబులం జతుర్వేదోద్భవంబులగు మంత్రంబులచే దైవత కోటికాశ్చర్య సంతోషములుదయింప

శ్రద్ధాభక్తియుక్తులై దీర్ఘకాల విరామములేక వ్రేల్చుచు నైదహోరాత్రములుగడిపి, యాఱవనాఁడు మహానంతుష్టాంతరంగులై ప్రాతస్సవ నాదికృత్యములం గావించుచుండిరి, యజ్ఞారంభదినముమొదలంతవఱకును. 849

ఉ. కంటికిఁగూర్కులేక రఘుకాంతులు గాచుచునుండిరధ్వరం
బంటినభక్తితో మునికులాగ్రణిదివ్యపదాంబుజద్వయిన్
జంటగ నిష్ఠఁబూని ఘనచాపశిలీముఖఖడ్గహస్తులై
కంటకులైన దైత్యులను గర్వమెడల్చి వధింతుమంచొగిన్. 850

## యాగపరిసమాప్తి

వ. ఇట్లు రక్షోహనన దీక్షాబద్ధులై మఖంబుఁ గాచుచు నాఱవనాఁడు శ్రీరామభద్రుండు సౌమిత్రింగాంచియిట్లనియె. 851

తే.గీ. అంకురారోపణంబాది యాఱురాత్రు
లరిగె నేయంతరాయముల్పొరలకుండ
నీయహోరాత్రమున్గూడ నేఁగెనేని
సప్తదిన సప్తతంతుసమాప్తమగును. 852

ఉ. తప్పకనేఁడు దానవులుదగ్రగతిన్జనుదెంతు రధ్వరం
బిప్పుడు విఘ్నమొందక యభీప్సితసిద్ధిలభించి దేశికుం
డొప్పుచునందజేయవలె నుత్కటవైరుల సంహరించి యే
చొప్పునఁ జేయఁగల్గుదుమొ సోదర! దైవతకోటిమెచ్చగన్. 853

కం. గురువర్యునిదయయే ని
ర్జరవైరులనుక్కడంచి జగమునఁగీర్తిన్
దిరమొనరించును మన యి
ర్వురకున్ ఫలితార్థతత్వరూపంబదియౌ. 858

ఆ.వె. ఐనఁ గాని భారమంతయుమనపైన
నుంచెఁగానగురుఁడువంచకులను
బట్టిగీటడంప బహుళప్రయత్నంబుఁ
జేయవలయునిపుడుచేవమీఱ. 855

వ. ఇట్లుపల్కిన శ్రీరామభద్రునిపల్కులనాకర్ణించి సౌమిత్రి వినయ వినమితాంగుఁడై యంజలిఘటియించి యిట్లనియె. అన్నా! నీవంటి మహావీరశిరోమణి యాలోచించఁదగిన విషయమే యిందుఁగానరాకున్నయది.

ఆ.వె. కుసుమపేశలమ్ముఁ గొనియాడఁ దగిన మీ
హృదయమందు జాలియొదవకున్న
యుష్మదీయబాణమొక్కటిచాలదే
సవనరిపులఁబట్టి సంహరింప. 857

వ. ఇట్లు బహుప్రకారంబులుగా నన్యోన్యాలాపంబులు జరుపుచు, సవనరక్షణ చతురులై యజ్ఞశాలంబ్రదక్షిణించుచు, భువనభోంతరాళంబవియునట్లు జ్యాఘోషంబు లొనర్చుచు నధిజ్యకార్ముకులై మిక్కిలిజాగరూకతతో మెలంగుచున్న సమయంబున. 858

ఉ. అమ్మునులందుఁగొందఱు మహాముదమందుచు వేదమంత్రముల్
కమ్మనికంఠనాదములగానముసేయుచునుండఁ గొందఱొ
క్కుమ్మడివేల్చుచుండ సమిదుజ్జ్వలితానల సప్తజిహ్వలన్
గ్రమ్మెను గౌతుకప్రభలు గాధితజనూజునిదేహమంతయున్. 859

ఆ.వె. పాత్రుఁడైనహోత హౌత్రంబునుడివిన
సంతసించె నమరసముదయంబు
వహ్నియందువ్రేల్చె వరుసనధ్వర్యుండు
స్ఖలితమొందకపుడు కరమరుదుగ. 860

వ. అనంతరంబతి సంతుష్టాంతః కరుణుండైన గాధేయుండు మధ్యం దినమార్తాండ ద్యుతులందిరస్కరించుచు సుఖాసనాసీనుండై చతుర్దిక్కులం బ్రతీక్షించుచుండు నవసరంబున. 861

కం. తూర్ణంబుగఁగాలక్రమ
నిర్ణయ సాగరులు మునులు నేర్పలరఁగ ను
దీర్ణానందముతోడుతఁ
బూర్ణాహుతిసల్పుటకును బూనిరి వరుసన్. 862

వ. ఇట్లధ్వర్యులు సాయంసంధ్యా వందనాదికృత్యంబులనునిర్వర్తించి, పూర్ణాహుతి ద్రవ్యములనాసాదించి, గార్హపత్యాన్వాహార్యాదినర్వాగ్నికుండము లందగ్నులం బ్రజ్వలింపఁజేసి మహావైభవంబుగా నాజ్యాది హవిస్సులచే జుహూపజుహ్వాది యజ్ఞ పాత్రములతో హోమంబులం గావించుచున్న తఱిఁగొందఱు మహర్షులు యజ్ఞాలయ చతుర్ద్వారపార్శ్వంబులనిలఁబడి రక్షోఘ్నమంత్రానువాకంబులను చ్చరించుచుండిరంత నర్ధ రాత్ర సమయంబు నందాకాశమునందు. 863

సీ. కల్పాంత జలధరానల్పధ్వనులమాడ్కి
  నతిఘోర నినదంబులతిశయిల్లె
కారుమబ్బులరీతి నీరంధ్రముగ రిపు
  ల్గప్పి యుప్పరవీధినుప్పతిలిరి
అటుమీఁదఁ గురిసెఁబో పటుతరపాషాణ
  వృష్టి నల్దెసలం దృష్టులవియ
నంతట నాశ్రమంబంతయు మధుమాంస
  రక్తమేదోవసాసిక్తమయ్యె

తే.గీ. నీచమతులు సుబాహుమారీచులసుర
గణములన్గూడి మాయతో గగనమందు
సంచరించుచు నింతలు నలుపుచుండు
టరసి రాముఁడు క్రోధతామ్రాక్షుఁడయ్యె. 864

**శ్రీరాముఁడు మారీచుని సముద్రమునంబాఱ వైచి సుబాహువును సంహరించుట**

వ. అంతంగదాపాణులై తారాపధసంచారంబొనర్చుచున్న మారీచసుబాహులు శ్రీరామ లక్ష్మణులంగాంచి తమ మనంబులందు. 865

కం. శరచాపమ్ములు గైకొని
తిరుగుచు మఖశాలచుట్టు దీక్షాయుతులై
పరుషమ్ములు వల్కెడునీ
నరశాబకులెవరటంచు నలుఁగుడుపడుచున్. 866

తే.గీ. వీరె కాఁబోలు దశరథ భూరమణుని
కొమరులౌ రామలక్ష్మణు ల్ప్రమదమొంది
వచ్చినారనివింటి మధ్వరముఁగావ
గాధినందనుతోడ నీ గహనమునకు 867

ఆ.వె. ఇట్టికట్టుదిట్ట మెప్పుడు సేయలే
దీ మహర్షి యజ్ఞభూమి యందు
వీక్షసేయ నెంతొవిపరీతమైతోఁచు
చుండె నిపుడు మనకుగుండెలదర. 868

తే.గీ. ఎంత యత్నమ్మొనర్చిన నేమిలాభ
మంతరాయముఁబొరయకావంతయేని
శాస్త్రచోదితమైన యా సవనతంత్ర
మంతమగుచుండె మనకింతవంతఁగూర్చి. 869

వ. మఖాగ్నుల యందిప్పుడు పూర్ణాహుతి క్రియా కలాపముం గూడ జరుగుచుండెం గాన నియ్యజ్ఞంబునకు విఘ్నంబొనర్చుట మనవల్లనగుపని యెంత మాత్రముం గాదని యన్యోన్యాలాపంబుల నిశ్చయించుకొని, నిర్విణ్ణహృదయులై యెట్టకేలకు ధైర్యంబవలంబించి. 870

ఆ.వె. ఐననేమి యాగ మవభృథస్నానాంత
మేపుమీఱ నిపుడు తాపసులను
మనుజబాలకులను మర్దించి కసితీఱఁ
దరలిపొద మసురదళముతోడ. 871

వ. అని నిశ్చయించుకొని సాయుధపాణులై మఖాలయంబు నువలక్షించి మహా జవంబుతో సైన్యంబునుంగూడి ధరాతలంబునకరుదెంచుచు నెలుఁగెత్తి. 872

ఆ.వె. వెఱ్ఱి తపసులార! వేగిర పడకుండుఁ
డటనె మోక్షమబ్బుఁజిటికలోన
నేమితపమొనర్చి యిలఁబుట్టితిరొకాని
కలిగె నేకకాల విలయ మహహ!! 873

వ. ఇట్లు సపౌరుషంబుగాఁ బల్కి యనంతరము శ్రీరామలక్ష్మణుల నసమాన రోష రూషితేక్షణంబుల నిరీక్షింపి గదాదండంబులచే బెదరించుచు. 874

కం. మీరేనా సవరక్షణ
భారమువహియించి యిటకువచ్చిన దిపుడీ
మారీచ సుబాహుల్పటు
వీరాగ్రేసరులటంచు వినరే యెపుడున్. 875

ఆ.వె. తపసి సవనరక్షదగ్ధమై పోనిందు
ముందు మీరుబ్రదుకుచందమరయుఁ
డిదియె వచ్చుచుంటి మిటునటుకదలక
నిలిచియుండుఁ డటనె నేర్పుమీఱ. 876

వ. అని మహా వీరావేశంబునం బల్కుచు నతితరజవంబుతో సైన్య సమేతులై భూతలంబునకు దిగివచ్చుచున్న మారీచ సుబాహువులంగాంచి శ్రీరామభద్రుండపుడు వాలముఁద్రొక్కఁబడిన కాలభుజంగంబు పగిదిఁ గనలి సౌమిత్రింజూచియిట్లనియె. 877

కం. ఈ మారీచ సుబాహులు
దీమసమునఁ గ్రిందుమీఁదుఁదెలియక మనలన్
సామాన్య దృష్టిఁగన్గొని
యే మేమో ప్రేలుచుండి రిచ్ఛావశులై. 878

శాం. ఈ నీచాత్ముల గీటడంతుఁద్రుటిలో నీక్షించి మత్కార్ముక
శ్రీనిత్యోజ్జ్వల శక్తినంబరచరుల్చిత్రమ్ములన్గొతుక
మ్మానన్జూచుచునుండుమంచనుచుసామోదంబుగా రాఘవుం
డానక్తంచరవాహినీపతుల సాంద్రాటోపముల్ భేదిలన్. 879

తే.గీ. మౌర్వి మ్రోయించి క్రుద్ధుఁడై మానవాఖ్య
శరవరమ్మును సంధించి చాపమందు
నేచి మారీచునురముపైనేయ నదియుఁ
దాఁకి నిశ్చేష్టతన్గూర్చి దానవునకు. 880

తే.గీ. ఓజఁగొనిపోయి యొకమూఁడు యోజనంబు
లబ్ధిఁబడవైచె నా శరమ్ము
చూచి తద్విధమంతయుద్రుక్కి మదిని
బహువిధంబులనదరి సుబాహుఁడపుడు. 881

కం. ఏమతియుండఁగ నోరీ
రామా! మాయన్ననిట్లు మాయించితి ని
న్నేమఁగఁ గలవాఁడెవఁడో
భూమిన్ దిలకింతునిపుడు బుద్ధివిహీనా! 882

మ. అని గద్దించుచు నిల్చి యాకసమునందాతండు శ్రీరామల
క్ష్మణులన్ముంచె శరప్రవర్షమున నిచ్ఛాలీలఁదత్సైన్యమా
ఘనకృత్యంబునుగాంచి చేయజయశంఖారావముల్పెల్లుగా
వినువీథిన్గని రాఘవుండడరి దోర్వీర్యంబు శోభిల్లఁగన్. 883

కం. అరివోసి పావకాస్త్రము
గుఱిఁజేసి సుబాహునెడఁదఁ గోపోద్రేకో
ద్ధురుఁడై వైచిన నయ్యది
సురనరఖేచరులకెల్లఁ జోద్యంబొదవన్. 884

కం. బగబగయను మంటలతోఁ
బొగతోమిణ్గుఱులతోడఁ బొరయుచునా యా
శుగమంబరవీథింజని
తగిలి సుబాహునకు వాని దగ్ధమొనర్చెన్. 885

కం. పుట్టినదాదిగ నాటికి
నెట్టుండునొ యపజయంబునెఱుఁగని దైత్యున్
బట్టుకొని రాముబాణము
తట్టెడు భస్మంబొనర్చి ధరపైఁబొసెన్. 886

కం. ఆ యనఘుండటు చేసిన
ధీయుతుఁడౌ లక్ష్మణుండు తీరనికిన్కన్
వాయవ్యాస్త్రబలంబున
మాయించెన్ సేననపుడమానుషలీలన్. 887

చ. ఇది యిటులౌచునుండఁగ మునీశ్వరులధ్వరతంత్రశేషమున్
బదిలముగాసమాప్తి నిరుపద్రవమౌనటుచేసి వచ్చిర
భ్యుదిత మహాజయోన్నతులు దూథ యశోవిభవాభిరాములౌ
సదమలతేజులన్ ధరణిజానికుమారులఁగాంచ నత్తఱిన్. 888

## సిద్ధాశ్రమమున శ్రీరామలక్ష్మణులకు మునుల ఆశీస్సులు

ఆ.వె. అనుజసహితు రాము నామునివరులెల్ల
రసురవిజయియైన యమరపతిని
బోలెఁ బూజసేసి మేలు మేలంచని
పొగడిరతులమోదమునఁ గడంగి. 889

ఆ.వె. కొఱఁతలేక క్రతువుజరిపి యథావిధిఁ
గౌశికుండు నిండుకౌతుకమున
మౌనదీక్షవీడె మహిపాలతనయులు
వచ్చి మౌనిపాదవనజములకు. 890

కం. మ్రొక్కిన తత్క్షణమే ముని
గ్రక్కునలేవంగఁదీసి కౌగిటనిడి పెం
పెక్కిన యనురాగమ్మున
నక్కొమరుల ముద్దుఁగొనియె నాశీస్సులతో 891

వ. అనంతరం బనవరత జగన్మంగళకరంబగునాత్మీయసవన ప్రభావంబుచే నిరీతి కంబులును సుప్రసన్నంబులునైశోభిల్లు దశదిశలంగాంచి నిర్భరానంద తరంగిత స్వాంతుండై శ్రీరామభద్రునితో నిట్లనియె. 892

కం. గురుకార్యము నెఱవేర్చితి
పరమాద్భుతలీల నిత్యభద్రాస్పద! నే
సరగున ధన్యుఁడనైతిని
ధరిణిన్ సరివారిలోన దశరథరామా! 893

వ. మఱియు సానుజుండవగు నీ వలన నీ సిద్ధాశ్రమంబునకు సిద్ధాశ్రమత్వంబు సార్థకంబయ్యెనని యథోచితాలాపంబులం బ్రొద్దుపుచ్చి యా రాత్రి యందఱుం గూడ సుఖనిద్రం జెందిరి, మఱునాఁడుషఃకాలంబున శ్రీరామ లక్ష్మణులు మేల్కాంచి, ప్రాతరాహ్నికవిధులందీర్చుకొని వచ్చి, కృత పౌర్వాహ్ణికుండును, మహానందరసపరిపూర్ణ హృదయుండును, దర్భాసనస్థితుండునునై జ్వల ద్వైశ్వానరునిభంగి భాసిల్లుచున్న తపోవిగ్రహుండగు విశ్వామిత్ర మహామునీంద్రునకును, అనంతరమితర

మహర్షులకును, సాష్టాంగ దండ ప్రణామంబులనర్పించి, విశ్వామిత్రునవలోకించి ముకుళితకరకమలులై భక్తి శ్రద్ధోదారమధురంబులగు వాక్యంబులనిట్లనిరి. 894

కం. తమ భృత్యుల మేమనవర
తము మాకిపుడేమియాజ్ఞ తాపసవర్యా!
శ్రమ లేక చేయఁగలమే
సమయంబుననేని యెంతసాహసమైనన్. 895

వ. ఇట్లతివినయంబుతోఁబల్కుచున్న శ్రీరామ లక్ష్మణుల పల్కుల కలరి, తన మహాభాగ్యాతిశయంబును మానసంబున మాటిమాటికింగొనియాడుచు, మహర్షి సమేతుండగుకౌశికుండు శ్రీరామ భద్రుంగాంచి యిట్లనియె. 896

**విశ్వామిత్రుఁడు శ్రీరామ లక్ష్మణులను మిథిలా నగరమునకుంగొనిపోవుట**

ఆ.వె. మిథిలయందు జనకుఁదధివసించుచునుండి
రాజ్యమేలుచుండె రహిచెలంగ
నతఁడు ధర్మమూర్తి యనఘుండు రాజర్షి
సత్తముండు బ్రహ్మవిత్తముండు. 897

ఉ. ఆ నరపాల మౌళియిపుదధ్వరమొక్కటి సేయనుండెఁ బెం
పూనినవేడ్కతో శుభసముజ్జ్వల మానసుఁడై తనర్చి మే
మా నగరీవరమ్మునకు నందరమేగగనుంటిమయ్యక
ల్యాణగుణౌఘ! నీవును బ్రయాణముగమ్మనుజన్మతోడుతన్. 989

కం. రామా! నీకు శుభమ్మగు
నా మనమునఁబొఁదలుచున్న నవ్యోత్సాహ
శ్రీమేర మీకుఁ దంద్రికిఁ
గామితసుఖభోగకీర్తి ఘనతలెనంగున్. 899

**శివధనుర్వృత్తాంతము**

వ. మఱియు నమ్మహారాజ చూడామణి యింటమేరు సారంబగు చంద్రశేఖరుని యనమాన తేజోవిలసిత మహోగ్రచాపం బలరారుచుండె, సునాభాఖ్యంబగు నా

ధనూరత్నము తొల్లిగీర్వాణులచే వీరి వంశవృద్ధుండగు దేవరాతునకుం గ్రతు ఫలంబుగానొనంగఁబడియె, నప్రమేయ బలనంవద్భుతంబును, వరవు భాస్వరంబునునగు నా శివ శరాననం బదిమొదలు వంశానుక్రమముగా నింత వఱకును గంధ పుష్పాక్షత ధూప దీపాద్యుపచారములచేఁ బ్రత్యహంబును నర్చింపఁ బడుచున్నయది, ముఖ్యముగా నీవద్దానిం జూడఁదగిన యోగ్యత కలవాడవని తలంచుచుంటిని. ఆ ధనుర్దండము నెక్కిడుట దేవదానవ గంధర్వ యక్ష రక్షోగణములందెవ్వనికిం గూడ నలవికాని పనియైయుండ నిఁక మానవుల విషయమేమనిచెప్పంగలవాఁడను. మఱియు నా దివ్యకోదండసారం బాత్మసాక్షిగా నరయఁగోరినవారై. 900

తే.గీ. సకల భూపాలురా శరాసనముఁబూని
సజ్జమొనరింపలేక విచారభీతి
లజ్జలుదయింప ధృతిచెడి రాణదక్కి
తరలుచుందురు తమతమ పురములకును. 901

కం. జనకుని సవనముఁ బురహరు
ధనువుం జూడంగవచ్చు తరలుము మాతో
వనజాతనేత్ర! పిలువక
చనుటయు దైన్యంబుకాదు సవనంబులకున్. 902

కం. అన రాఘవుఁడిట్లనె ముని
కనఘా! మీ యాజ్ఞదాటమనుచును విజ్ఞా
పనమొనరిచియుంటిమి కద
చనుదెంతుమువిమ్ముఁగూడి సవనమ్మునకున్. 903

వ. అని శ్రీరామభద్రుండ తివినయవినమ్రుఁడై పల్కిన పల్కులకానందించి గాధేయుండు తన మనంబున 904

కం. భువనముల నాజ్ఞ వెట్టెడి
భవతారణుఁడైన శేష ఫణితల్పుండీ
భవమున నా యాజ్ఞలకున్
జవదాఁటకయుండె నెంత చరితార్థుఁడనో. 905

ఆ.వె. క్షితితలంబునందు శ్రీహరియుదయించి
యునుద్యజింపఁడయ్యెఁదనకుఁగల్గు
భక్త పరవశత్వ పరమవాత్సల్యాద్య
హేయగుణములందు నేదియేని. 906

వ. ఇట్లనేక విధంబులందలంచి శ్రీరామలక్ష్మణులంగూడి మహర్షివర్యులతోఁ బ్రయాణోన్ముఖుండై వనదేవతలంజేరి యిట్లనియె. 907

తే.గీ. స్వస్తి మీకగు శీతాద్రిసవిధమునకు
నరుగు చుంటిని విడిచి సిద్ధాశ్రమంబు
ననుచు వలగొని యాశ్రమమునకునరుగఁ
బూనెనుత్తరదిశవట్టి పొల్పుమీఱ. 908

వ. ఆహితాగ్నులగు మహర్షివర్యులతోడను శ్రీరామలక్ష్మణులతోడనుం గూడి మిథిలా నగరమార్గమ్మునంజనుచున్న గాధినందనుఁడు, సిద్ధాశ్రమంబునంగల, కురంగశుకపిక శారికా గణములు తన వెంటనంటి వచ్చుచుండుటం గాంచి యా మృగశకుంత గణమ్ములకనురాగపూర్వకంబుగా నిట్లనియె. 909

ఆ.వె. ఎంత దూరమనుచు నేతెంతురిట్లు నా
వెంటనంటి మీరు వెడలిపొండు
మీ నివాసములకు మీరని మచ్చిక
తోడఁజెప్పినిల్పి వీడిపోయె. 910

ఆ.వె. ఇట్లు పోయి పోయి యెంతయోదూరంబు
తరణి చరమగిరిని దాఁకుచుండ
శోణనదముఁజేరి స్నానసంధ్యాద్యను
ష్ఠాన కల్పమంత చక్కఁబఱచి. 911

వ. ఇట్లు సాయంకాలవిహితకృత్యములం దీర్చుకొనిన యనంతరమందా శోణనదతటాంతికంబున విశ్వామిత్రుని ముందిడుకొని మహర్షివర్యులు సుఖాసనోప విష్టులైయుండిరంతంగృతసాంధ్యకృత్యులగు శ్రీరామలక్ష్మణులా మునిమండలంబున కభివాదనంబు లొనర్చి, కౌశికమునీంద్రుని పురోభాగంబునందుచితాసనంబుల

నధిష్ఠించి యిష్టా గోష్ఠి సల్పుచుండు నవసరంబున మహాతేజశ్శాలియగు శ్రీరామభద్రుండత్యంత కౌతూహల సమన్వితుండై, మునివల్లభుండగు విశ్వామిత్రునవలోకించి మృదుమధుర వాక్యంబుల నిట్లనియె. 912

ఆ.వె. మహితవనవిరాజమానమైయొప్పు నీ
దేశమెవనిదయ్య దేశికేంద్ర!
ఏ మహానుభావుఁడిందధి వసియించుఁ
గరుణతోడ మాకు నెఱుఁగఁజెపుమ. 913

కం. అని పల్కిన దాశరథికి
మునిముఖ్యండనియె నిట్లు మోదమెలర్పన్
వినుమో రఘుకుంజర యీ
ఘన దేశచరిత్రమనుచుఁ గరుణాన్వితుఁడై 914

ఆ.వె. ఇట్టి దివ్యచరిత మెప్పుడువినలేదు
మేమటంచు మునులు నేమమొప్ప
నాలకించుచుండ నా రఘురామున
కిట్లుచెప్పఁదొడఁగె నింపుమీఱ. 915

**విశ్వామిత్రుఁడు శ్రీరామునకుఁదనవంశక్రమంబెఱింగించుట**

ఆ.వె. కుశుఁడు నాఁగనొక్కకొమరుండు నలువకుఁ
గలఁడతండులోకగణ్యమూర్తి
నిత్య సత్యధర్మనిరతుండు సత్తపో
ధనుఁడు ఘనుఁడు వైరిహననచణుఁడు. 916

వ. అయోనిజుండగు నా కుశుండు చతుర్ముఖ శాసన శాసితుండై క్షత్ర ధర్మాభివృద్ధిం గావింప నిలాతలంబునకరుదెంచి బహుకాలము తపోనియతుండై యుండి

ఉ. ఆమహనీయమూర్తి సముదంచిత కౌతుకియౌచుభార్య గా
శ్రీమహిళోపమానయయి చెన్నలరారు విదర్భ కన్యకన్
బ్రేమముతోడఁగైకొని యభీష్టసుఖమ్ము లనోలలాడి యా
భామిని యందుఁ బుత్రులను భాసుర గాత్రులనొందె నల్వురన్ 918

వ. కుశాంబుఁడనియుఁ గుశనాభుండనియు నాధూర్తరజసుఁడనియు, వసువని యును దివ్యాభిధానంబులనలరారుచు, దానధర్మదయాశాంత ధైర్యోత్సాహాది నానావిధ సుగుణ సంపత్తికల్గి, సమారూఢయౌవనులైయున్న యానల్వురు కుమారులంగాంచి, క్షత్రియ ధర్మ వివర్ధనాసక్తచిత్తుండును మహాతేజశ్శాలియునగు నాకుశుండిట్లనియె, మీరు సకలసంపద్వివృద్ధిదంబును, బురుషార్థ చతుష్టయసాధనం బుననగు ధాత్రీపాలనంబొనర్చుచు ధర్మమార్గరతులైయుండుఁడని యాజ్ఞాపింపఁ దదాజ్ఞానువర్తులై యఖండమహీమండలమును నాల్గుఖండములుగ విభజించి వేర్వేఱునామంబులిడి, రాజావాససముచితప్రాసాద గోపురోద్యాన మండపవాపీకూప తటాకాది విలసితంబగు మహానగర చతుష్టయ నిర్మాణంబుఁగావించి, కుశాంబుఁ డు కౌశాంబియను పట్టణంబును, కుశనాభుండు మహోదయమను నగరంబును, ఆధూర్తరజసుఁడు ధర్మారణ్యంబను పురభేదంబును వసువు గిరివ్రజంబను పురవరంబును ముఖ్యస్థానములుగానొనర్చుకొని, మహారాజులై ధర్మముఁదప్పక భూపరిపాలనంబుఁగావించి యుండిరి, అందు గిరివ్రజంబునాఁబరఁగు నీదేశమునం గల ప్రజలను వసుమహారాజు పరిపాలించియుండె, నిచ్చటి కనతిదూరంబునం గన్పట్టుచు మహోన్నతంబులై కోటగోడలవలె నీదేశమునుంజుట్టి ప్రకాశించుచుండిన యాయైదు పర్వతంబులంజూడుము. గిరి పంచకస్థితివల్లనే యీ రాజధానికి గిరివ్రజంబను నామము సార్థకమై యుండె. నీశిలోచ్చయములైదింటిచేఁ బరివేష్టింపబఁడి ప్రకాశించుచుండునిచ్చోట మగధదేశమునంబ్రభవించిన శోణనద మీగిరిపంచక మధ్యము నుండి ప్రవహించుచు వసుమహారాజ రాజ్యలక్ష్మి ధరించిన ముక్తాహారమో యనునటులఁ జెన్నలరారుచుండె. మఱియుఁ బశ్చిమాభిముఖమై పాఱుచుండునియ్యేటి నీట నీదేశమంతయు సస్యశ్యామలమై లక్ష్మీవిహార స్థానములనందగు మహోద్యానపరంపరలచేనిండి వసుసమృద్ధింజెంది విరాజిల్లు చుండె. కుశుని రెండవకుమారుండును, రాజర్షివర్యుండును ధర్మాత్ముండుననగు కుశనాభుండు మహోదయ పురాధినాథుండై ప్రజాపాలనంబొనర్చుచు. 919

**కుశనాభుని వృత్తాంతము**

తే.గీ. దళితశరదిందురోచిఘృతాచియనెడి

పత్నియుండొందెనమ్మహాపార్థివేంద్రుఁ

దఖిలజగదేకసమ్మోహనాస్త్రవితతి
యనఁగ నూఱ్వురుపుత్రికలను గుమార!

చ. దినమొక రీతిగాఁబెరిఁగి దేవతలం దమిముంచఁగల్గు జ
వ్వనమును రూపురేఖలును వాక్చతురత్వము విద్దెపెంపును
న్వినయవిధేయతల్గలిగి విశ్రుతలైరి జగత్త్రయంబునం
దున గుశనాభుపుత్రికలధోక్షజభక్తిలతానుబద్ధతన్. 921

వ. ఒక్కనాఁటి సాయంకాలంబునందు మందోత్సాహపరవశత్వమునొంది, కుశనాభుని పుత్రికలునూఱ్గురుంగూడ వరాంబరాభరణదివ్యమాల్యాద్యలంకృతలై, మంజులోద్యాన మధ్యంబున శంపాలతలంబోలి విహరించుచు, నృత్యగానాది వినోదంబులచేఁ గాలక్షేపమొనర్చుచు మహానందతరంగితస్వాంతలైయున్నవారి కడకనిలుండు నిజస్వరూపమున నరుదెంచి 922

కం. ఒఱఁబాపి మెఱుఁగుఁబెట్టిన
మరుకరవాలములవోలి మంజుల తనులై
మెఱయుచు సిగ్గరి యుండిన
సరసీజేక్షణలఁగాంచి సాహసియగుచున్. 923

వ. మందహాసచంద్రికావిరాజమానవదనుండై, సమీపంబునకు వచ్చి మృదుమధురాలాపములంగావించుచు నిట్లనియె 924

ఉ. భామినులార! మిమ్ము నెలఁబ్రాయఁపుఁగన్నెల నంచయానలన్
గాము విలాసినీసఖులఁగాంచిమనోజభవాగ్నికీలల
న్వేమరు బాధనొందుచునభీష్టముఁదీర్తురటంచునెంతయో
ప్రేమముతోడ వచ్చితినుపేక్షవహింపకనుగ్రహింపుఁడీ. 925

ఆ.వె. నాకు భార్యలౌచు నానావిధమ్ములౌ
సుఖములొందుఁడింక సుదతులార!
మానుషత్వముడిగి మహిమానుబద్ధమౌ
నిర్జరత్వసిద్ధినెగడుమీకు. 926

కం. మనుజస్త్రీలకు జవ్వన
మనిరత మమరాంగనలకు నదినిరతంబౌ

నని మీరెఱిఁగినదేకద
మనుజత్వమువిడుటకిపుడు మార్గంబిదియే. 927

కం. సురనారీమణులౌదురు
సరగుననాభార్యలైన సంశయమేలా
పరమాయుష్యమమర్త్యత
కరుమరుదుగ సంఘటిల్లఁగలదిందఱకున్. 928

ఆ.వె. సకియలార! మీకు జాగొనరించుట
తగదు మనములందుఁదరిచిచూచి
గౌరవమ్మునెఱింగి గాంధర్వవిధిచేత
నను, గ్రహింపుఁడిందఱనుచుఁబల్కి. 929

వ. మఱియు దేవమానవులకుంగల మహోత్తమాధమ లక్షణంబుల నుపన్యసించు చున్న సమీరణుంగాంచి యారాజకన్యలు మనంబులం బెగడొంది నిరుత్తరలై కొండొక తడవునకు ధైర్యంబవలంబించి. 930

కం. పకపక నవ్వుచునందఱు
సకల ప్రాణ స్వరూప! సర్వాత్మక! యీ
వికలేంద్రియత్వమవనిం
దకుఁ గారణమౌనటంచుఁదలఁపఁగవలదే. 931

కం. కుశనాభుని కూఁతులమని
దశదిక్కులలోన వైరిదళదళనేచ్ఛా
వశమాననుఁదతఁడనియును
యశమడుగంటఁగ నశించుననియెఱుఁగవొకో 932

వ. అని మఱియునిట్లనిరి 933

ఆ.వె. ఇంతయేల తండ్రి యెవనికిఁగూర్చునో
యతఁడె మాకు నాధుఁడగునుగాత
సత్యనిరతుఁడైన జనకునకపకీర్తిఁ
దెచ్చిపెట్టి యెట్లు తిరుగఁగలము. 934

ఆ.వె. కులమునకును గూర్చి కూడని యవమతిఁ
దుచ్ఛ సౌఖ్యమందు నిచ్ఛ సల్పి

బ్రదుకఁ గోరుకంటె భామినులకు నుర్వి
ఘనతకాదె మరణమనిలదేవ! 935

వ. ఇట్లనేకవిధంబుల నా కన్యకామణులు చెప్పుచున్నను వినక సాభిలాషుండై మాట్లాడుచున్న సమీరణుంగాంచి వారత్యంత కోపాద్రేకమాననలై యిట్లనిరి.

కం. చులకనసేయకుమమ్మిఁక
పలురకముల మాటలాడి పవనా! యిపుడే
మలిగితిమయేని శాపా
నల కీలల వలన నీవునశియింపవొకో. 937

కం. వచ్చిన త్రోవనె పొమ్మిఁక
హెచ్చుగ మాట్లాడకాత్మహీనుని పగిదిన్
మెచ్చునె నీ వడవడి నే
సచ్చరితుండైనఁగాని జగములలోనన్. 938

ఆ.వె. గొప్పవాని కల్పగుణముదయింపరా
దల్పమతి కనల్పమైన వాంఛ
కలుగఁగూడ దట్లు కలిగిన జగములం
దప యశమ్ము నొందు నహరహంబు. 939

కం. ఆ కమలనేత్రలీగతి
నేకతమునఁబల్కఁ బవనుఁడెంతేఁగుపితుం
డై కటకటఁబడుచును దాఁ
జేకొని లజ్జాతిరేకచేష్టలనెల్లన్. 940

వ. కొంతవడికి నదృశ్యుండై వారిదేహబులంజొచ్చి యనేక విధములుగానవయవంబులను భంజించి తన ప్రభంజనత్వమును సార్థకమొనర్చుకొనియె, నంత నారాజ కుమారికలంగవైకల్యము నొంది మఱుగుజ్జులై వక్ర గమనంబులతో స్వసౌధాంతరమ్మునకుం బఱతెంచి, వికారదేహములతో దురంతచింతాభరాక్రాంతలై యున్న, వారిం గుశనాభుండుగాంచి చింతావిచార సంభ్రమాశ్చర్య పరవశస్వాంతుండై యిటనియె. 941

కం. మీ కిట్లపకృతి సల్పుట
కే కఠినుఁడు సమ్మతించె నెఱుఁగఁగ నాకున్
సాకల్యమ్ముగఁజెప్పఁడు
శోకింపక మీకునిపుడు శుభమొనగూర్తున్. 942

కం. అని పల్కిన కుశనాభుని
ఘనపాదాబ్జములుముట్టి కన్నీలరొల్కన్
వినుమో తండ్రీ!యని త
త్తనయలు కలవృత్తమెల్ల దాఁచకతెల్పెన్. 943

వ. అనంతరంబనిలకృతంబులగు దుశ్చేష్టలకెంతయు విచారించి కుమారికలం గని కుశనాభుండిట్లనియె. 944

ఆ.వె. వంశగౌరవంబు వదలకనిల్పిన
మీ చరిత్రమిపుడు మేలుగూర్చె
నాకుఁ బూర్వులకును నా వంశకరులౌచుఁ
దనరువారికెల్లఁ దనయలార. 945

ఆ.వె. తనయలార మీరు తాలిమిఁబోనాడి
యలిగి శాపమీక యనిలునకును
దిరిగి వచ్చుటరయఁ బరమ ధర్మముగాదె
యింతశాంతమేరికిలనుగలదు. 946

ఆ.వె. క్షమయె యాగఫలము సమకూర్చు జీవికి
క్షమయె భూషణంబు క్షమయె విద్య
క్షమయె సర్వవేదసారంబు క్షమయందె
నిలిచియుండు జగము నిక్కమింత. 937

వ. క్షమావతులైన మీకెల్లవిధంబులచేతను శుభపరంపరలచిరకాలంబున నొనగూడుఁగాత. మఱియు మీరవివాహితలైయున్న తరుణంబునం గొండొక కారణంబుచే నేక కాలంబున మీకందఱకుంగూడ వైరూప్యము సంఘటిల్లఁగలదనియు నయ్యది పాణిగ్రహణానంతరముతొలంగి యథాపూర్వ సౌందర్యప్రాప్తి కలుగఁగలదనియును గార్తాంతికులు నాకెఱింగించియుండుటవలన సమీరణ కృతావమానంబు మీకనతి

కాలంబున నశించఁగలదని కుశనాభుండక్కన్నియల నోదార్చి, సభాస్థానంబునకరిగి తనకుమారికల కనురూపవరుండెవ్వండని మంత్రి పురోహితాదులతో దీర్ఘకాలంబాలోచించి బ్రహ్మదత్తుండను రాజశ్రేష్ఠు కొసంగి పాణిగ్రహణమొనర్ప నిశ్చయించెనని విశ్వామిత్రుడు శ్రీరామభద్రునకని 948

నారాయణం రామానుజాచార్య విరచితంబైన
శ్రీరాఘవాభ్యుదయమున బాలకాండ యందు
ప్రథమ భాగము సమాప్తము.



"శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినామ్
శ్రీవేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్"

ఆసాద్యనగరీం దివ్యామభిషిక్తాయ సీతయా
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్

ఓం తత్ సత్

"విద్వత్కవిశేఖర"

## శ్రీనారాయణం రామానుజాచార్యస్వామివారి

# ఇతర కావ్యములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ చెన్నకేశవ శతకము (తెలుగు) | 1944 |
| 2. | శ్రీనివాస శతకము (తెలుగు) | 1946 |
| 3. | శ్రీ లక్ష్మీనారాయణ స్తవం (సంస్కృతం) | ముద్రితం |
| 4. | శ్రీరామానందలహరి (సంస్కృతం) | 1961 |
| 5. | స్తుతికౌస్తుభం (సంస్కృతం) | ముద్రితం |
| 6. | స్తుతిముక్తావళీ (సంస్కృతం) | ముద్రితం |
| 7. | బభ్రువాహన విజయం (తెలుగు నాటకము) | ముద్రితం |
| 8. | మాయావతీ విజయం (తెలుగు నాటకము) | 1962 |
| 9. | సుచంద్రీయము (తెలుగు నాటకము) | 1962 |
| 10. | కృష్ణ శతకము (తెలుగు) | ముద్రితం |
| 11. | శ్రీ పద్మానుభూతి (తెలుగు) | ముద్రితం |
| 12. | శ్రీ భగవదారాధన చంద్రిక (సంస్కృతం) | ముద్రితం |
| 13. | శరణాగతి (తెలుగు) | ముద్రితం |
| 14. | క్షీరాబ్ధి కుమారీ శతకము (తెలుగు) | ముద్రితం |
| 15. | శ్రీరాఘవాభ్యుదయము (తెలుగు) | అముద్రితం |

(అయోధ్య, అరణ్య, కిష్కింధ, సుందర, యుద్ధకాండలు)